# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౨.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩


విషయసూచిక

# చి త్ర ము లు




చెన్నపట్టణము. ఫిబ్రవరి ౧౯౩౩

సంపుటము ౧౦ ఆంగీరస సంవత్సరము, మాఘమాసము సంఖ్య ౨


ఏ క్రు


సముద్రాల వేంకటరాఘవాచార్యులుగారు


ఆరవిచ్చుగలువతొయ్యలికి సంజపొలంతి సింగారపుం గావిచీర గట్టె
నునుమావిచివురువిందులు మేసి కోయిల గొంతెత్తి చల్లనికూత గూసె
నీరాని దిచ్చి గాసిలు చకోరమును జందురుడు మబ్బులనుండి తొంగిచూచె
వలిపెంపు బూలగుత్తులు దాల్చి శేరాణి బలితంపు గమ్మతావులు నిగుడ్చె
మలయపవమాను డాశలు మరలుదారు - లరయుచుండెను ఒక్క గ్రీష్మావసాన
మృదునవాషాఢవేళ నే నిల్లు విడిచి - పోయితిని ప్రేమభిక్షుకమూర్తి నగుచు.

ఆకృతాభ్యాసమధురభిక్షాటనమున - నాకు నానంద మొసగె నానాడుగూడ
సొట్టవోయిన పాత్రయు, మెట్టు లెల్ల - విరిగిపోయిన వీణయుం దిరిపెమెత్త.

పూడిక బ్రుంగిపోయి తెగిపోయిన వీణియతీవ లెట్టులో
గూడగ ద్రోసి రాపడిన గొంతుక సాహసించి గొట్టుమి

10. 2- 1 ౧౨౨

ట్టాడు పదంబులం గడు బ్రయాసముతో గదలించు చేగి మో
మోడక పాట బడి తెపుడో ముమ మెట్టిన సౌధవీథుల౯.

విన్నను, వెప్పుడో సమయ వేయ్ శ్రుతుల్ జతిచేసినట్లుగా
నున్న మదీయకంఠ విషమోర్తులలోని నిగూఢబాధ యా
అన్నవరాలి ముగ్ధహృదయంబున జెక్కెనో యేమొ ఆమె వా
ల్గన్నులనుండి జారిన నిగార్ద్రము చెక్కుల జాజువారెడి౯.

సుమధురభావనాగరిమ చూరలు వెట్టెడి నాదుపాట ఛి
త్తమునకు హాత్తిపోవ వనితాజనతామణి దృశ్యమానవి
శ్వము నొకమారుగా మరచి శాంతయు నిష్క్రియ యై తనర్చె గు
డ్యముపయి జిత్రకారుని పటాకృతి గొండొకసేపు—పిమ్మట౯—

విరిసిన తమ్మిలో గురుబు వెట్టడు తీయని తేట తేనెతుం
పురులు అలంతిగాలికదుపుం బడి చెంతల తమ్మి జిందు న
ట్టైరవున గాటపున్వాలపుతీపులు చిప్పిలు వాలుచూపు ల
ప్పరుసున నించె నాశిథిలపాత్రిక నామె యధోముఖాక్షియై.

అపుడు చరమాద్రిశిఖరమ్ము లాక్రమించె - మేలితమకమ్ము లుబుకగా మేఘమాల
చూపులో జూపు నిలిపి కలాపిమిథున - మావిష్కృతబర్హ మగుచు నాట్యమ్ము సలిపె.

---

# ద్రావిడభాషాలక్షణము—తొల్కాప్పియమ్

కోరాడ రామకృష్ణయ్యగారు, యమ్. ఏ.

౨

తొల్కాప్పియమునందలి నియమములకను గుణముగనె అకారపరకచకార మాదియందు గల దేశ్యశబ్ద మొక్కటియు నీభాషలో గనబడదు. శబ్దరత్నాకరమున గల చకారాదిశబ్దము లన్నియు తత్సమ పదములే. ఇక దంత్యచకార మాదియందు గల పదములు మాత్ర మీభాషలో పెక్కు గలవు. ఇతరదక్షిణదేశ భాషలలో నీదంత్యచకారము లేదుగావున వీనికి సజాతీయశబ్దములనుగూర్చి విచారింప నావశ్యకతయే లేదు. కాని కొన్నిశబ్దము లితరభాషలలో దంత్యసకారాది శబ్దములుగ గనంబడుచున్నవి. 'చచ్చు' ధాతువు కన్నడమున 'సా', 'సాయ్' అనురూపమున సకారాదియై యున్నది (సామ్మరణే). తమిళమళయాళములందు గూడ 'చా' ధాతు వున్నట్లగపడుచున్నది. తుళులో 'సయ్', 'సై' అని కలదు. కావున నిది యీభాష లన్నిటిలోను గనబడుచుండుటచే మూలభాషకు జెందిన ధాతు వేయనియు, ప్రాయికముగా సకారాదియై యుండు ననియు దలంపదగియున్నది. ఇట్లు పదాదిసకారము తెలుగులో చకారముగా మారుట మఱికొన్నింటిలో గానవగును (క. సార్—చేరు).

| క. | తె. | త. |
|---|---|---|
| సవి=to taste, | చవి | చువై |
| సట్టుగ=a ladle, spoon, | చట్టువము | చట్టువె |
| సత్తె=rubbish, dirt, | చెత్త | చెత్తై |
| సప్పనె=flatly, insipidly dull, | చప్పన | |
| సమలు / సవలు } to make proper, fit, neat, to trim, | చమరు | |
| సాఱు= to proclaim, cry out, publish, (ఘోషణే) | చాటు | చాఱ్ఱు |
| సాల్=to be joined, to become indebted, to be sufficient, to suffice, | చాలు | చాలు |
| సాల్=a continuous line, a row, a furrow, | చాలు, నాగటిచాలు | చాల్. |
| సరి=to move, to, go to go away, to slide, | జరుగు, | |
| సళి-చళి-చలి=coldness, cold, | చలి | తణ్ |
| సావి=key, | చెవి | చావి |
| సార్=to move toward, come near, | చేరు | |

చందా, చక్కి, చదలు, చదియు, చదువు, చనవు, చను, చప్పుడు, చబుకు, చఱచు మొదలగు మఱికొన్ని దేశ్యశబ్దము లెట్టిభాషలలో జేరినవో పరిశీలింప వలసియున్నది. ఇట్టి కొన్నిశబ్దములు తమిళకన్నడము లలో నుండిన నుండవచ్చును. ఇవి సామాన్యముగా ప్రాచీనతద్భవశబ్దములై యుండవచ్చును.

ఇక దేశ్యపదముల మొదటగల తకారరేఫసంయోగముకూడ వర్ణవ్యత్యయముచే నేర్పడినదే యైయుండును. త్రిప్పుధాతువే దీనికి ప్రబలమైన నిదర్శనము. 'త్రిప్పు' ధాతువు తమిళకన్నడములలోను గలదుగాని యీరూపమున లేదు. పదాదిసంయోగ మందు లేదు. కన్న: తిరి-భ్రమణే. తమి: అ. క. తిరుంబు-స. క. తిరుప్పు. ఈ 'తిరుప్పు' అనుశబ్దమే వర్ణవ్యత్యయముచే 'త్రిప్పు' అయినది. కాని దీని మూలధాతువు 'తిర్' అనునది

మాత్రమే. ఈధాతువే నామవాచకముగా ప్రయోగింపబడినపుడు తిరుల్ =త్రిప్పాటలు, త్రిప్పులుఅని యర్థము. నన్నెచోడుడు 'తిరుల్ 'అనియే ప్రయోగించియున్నాడు. తిర్ ధాతువుపై సహాయధాతువుగా 'అగు' చేర్పగా తిర్ + అగు=తిరగు, తిరుగు అయినది. ఇదియే మరల ధాతువుగా తెలుగున బరిగణింపబడుచున్నది. దీనినుండి సకర్మకరూపము, లేదా ప్రేరణార్థకరూపము 'తిరుప్పు' అయినది. దీనినుండి 'త్రిప్పు' యేర్పడినది. ఆంధ్రముననే 'తిరుగు' ధాతువు ప్రత్యేకముగా గనంబడుచుండుటచే 'త్రిప్పు 'అనునది వర్ణవ్యత్యయముచే నేర్పడిన రూపమే యనుటకు సందేహ మక్కరలేదు. ఆంధ్రముననే ద్వైరూప్యము గల మఱియొక ధాతువు తొరగు. దీనినుండియే వర్ణవ్యత్యయముచే త్రోయు=తొలగనూకు-అనున దేర్పడియుండును. కాని సామాన్యముగా నీరెండును భిన్న ధాతువులుగా బరిగణింపబడుచున్నవి. 'త్రోవ 'శబ్దమందలి తొలియక్షరమునందలి రేఫము నిట్లు వచ్చినదే. కన్నడమున 'తోఱు'-దర్శనే అనుధాతువు కలదు. తెలుగునందలి తోచు (=అగపడు) అనుధాతువు దీనినుండి యేర్పడినదే. తోర్పు-తోచు అయినది. తోచు ధాతువులో మూలధాతువునందలి రేఫ మగపడకపోయినను, ఆ రేఫ మీ భాషలో 'త్రోవ' అను నొక నామవాచకశబ్దములో మాత్రము నిలిచియుండి, తోచు ధాతువునకును దాని మూలరూపమగు 'తోఱు' ధాతువునకును గల ప్రాచీనసంబంధమును సూచించుచున్నదివలె నున్నది. కన్నడమున 'తోఱు' ధాతువునకు ప్రేరణార్థకరూపము 'తోరిసు.' దీనికి 'కనపఱచు' అని యర్థము. ఈ 'తోరిసు' — తోర్పు — తోపు అయి స్వార్థమున నీభాషలో ధాతువుగా నేర్పడినది. 'తోర్పు 'నది అనగా పోవురీతిని (మార్గమును) కనపఱచునది గనుకనే త్రోవయైనది.

'త్రొక్కు 'ధాతు వొకటి కలదు. తమిళమున నిది 'తొహ్హై', 'తొగై' అనురూపములు కలదైయే యున్నది. కావున నిందు రేఫ మగపడుటకు కారణము లేదు. ఇతరరూపముల సామ్యముచే వచ్చినదాయని సందేహపడవచ్చును. ఏలయనగా సామ్యముచేతను గొన్ని రూపము లట్లు భాషలో నేర్పడియుండవచ్చును. కాని యిది సామ్యమువలన నేర్పడినదిగా తోచదు. ఏలయనగా కన్నడమున తుఱి-పాదఘాతనే-అనుధాతు వొకటి కనబడుచున్నది. ప్రాచీనకాలమున నొక్కొక్కప్పుడీ 'ఱ 'కారము రేఫముగగాని, శకటరేఫముగగాని మాఱుచుండుటకూడ కలదు. ఆ 'ఱ 'కారమే రేఫగా మాఱి, తుఱి + అగు (క్కు) > తుఱిక్కు > తొఱిక్కు > త్రొక్కు అయియుండును. తమిళమునగూడ నంతరించిన నీ 'తుఱి 'అను మూలధాతువుయొక్క ప్రాచీనస్వరూపచిహ్నమే తెలుగునందు 'త్రొక్కు' ధాతువులోని రేఫచిహ్నమై యిప్పటికి నిలిచియున్నది. కాని యిప్పుడీపదాదియందలి సంయుక్తాక్షర ముచ్చరించుట కష్టతరముగా గనబడుచుండుటచే సౌలభ్యముకొఱకు జాఱవిడువబడుచుండుటచే 'తొక్కు 'అనునదే ధాతువుగా నేర్పడుస్థితి కలిగినది. ఇట్లే త్రవ్వు, త్రాగు, త్రుంగు, త్రిక్కు, త్రుళ్లు, త్రెంచు, త్రెక్కొను, త్రెగు, త్రెవ్వు, త్రెళ్లు, త్రేచు, త్రోలు మొదలగు ధాతువులుకూడ రకారముతోగూడిన మూలధాతువులనుండి వర్ణవ్యత్యయమువలననే యీభాషలో నేర్పడియుండునని తలంప నవకాశము కలదు. త్రుప్పు=ఇనుముమీది మఱక. దీనికి తమిళమున 'తురుంబు' అనురూపము కలదు. ఇదియే ప్రాచీనరూపం బయియుండుననియు, వర్ణవ్యత్యయముచే తెలుగులో 'త్రుప్పు' యేర్పడినదనియు దలంపవలయును. తమిళరూపము ప్రాచీన మేల కావలయును? 'త్రుప్పు' శబ్దములోని తొలిసంయుక్తాక్షరమునడుమ నొక యచ్చు ప్రవేశించుటచే 'తురుప్పు'-'తురుంబు' అయియుండకూడదా? అను ప్రశ్న బయలుదేరవచ్చును. సామాన్యముగా నీభాషలలోని ధాతువులు సంయుక్తాక్షరములతో గూడినవి కాకుండుటను 'తిర్' (తిరుగు-తిరుప్పు-త్రిప్పు) మొదలగు ధాతువులనుబట్టియే మనము గ్రహింపవచ్చును. సంస్కృతాద్యార్యభాషలలోని ధాతువు లట్లు సంయుక్తాద్యములై యుండుట సుప్రసిద్ధమె (cf. స్థా-త్రా-క్లిశ్ etc). అట్టిధాతువులేకాక నామవాచకశబ్దము

లలోగూడ త్వక్కు, త్విట్టు, త్వష్ట, త్సరువు మొదలగు శబ్దములుగాని, న్యక్కృతి, వ్యాయమ, వ్యాసము మొదలగునవిగాని యీభాషలలో గానవచ్చుట లేదు.

తెలుగులో పదాదియందలి పకారరేఫసంయోగ మునకు మకారరేఫసంయోగమునకును వర్ణవ్యత్యయమే కారణము.

| | | |
|---|---|---|
| ప్రత్తి | కన్న. హత్తి | త. పరుత్తి, వర్ణవ్యత్యయముచే—ప్రత్తి |
| ప్రబ్బు=వ్యాపించు. | క. పబుల్, పర్బు | త. పంబు, పరమ్బు,—పమ్బు—ప్రబ్బు |
| ప్రవ్వ=కుండ. | క. పరవి, హరవి = an earthen water vessel | |
| ప్రాకు | క. పరి = to run, to flow, to proceed, advance<br>పరె = to extend, spread | |
| ప్రాము | క. పబుల్ | త. పరమ్బు, పమ్బు—పమ్బ |
| ప్రుచ్చు | క. పుళి = to be eaten or infected by worms | త. పుఴు |
| ప్రువ్వ—పురువు | తు. పురుల్, cf. పుచుల్ | |
| ప్రేము = ఔత్తము | | త. పెరంబు |
| ప్రేలు = వదరు | క. పేల్ =to utter, to say, to speak | త. పేఴ<br>మ. పేఴ = to chatter as birds |

ప్రౌఢ, ప్లవగము, ప్లీహము, ప్లుష్టము మొదలగుశబ్దము లీభాషలలో లేనే లేవు.

ఆదిని మకారరేఫసంయోగము గలశబ్దములు.—

| | | |
|---|---|---|
| ప్రంగు = క్రుంగు, ప్రాలు | క. (మగ్గు) మఙ్గు, to become pale, to wither, to disappear, to perish, | త. మంగు |
| మ్రబ్బు=మబ్బు | క. మబుల్=darkness, gloom, dimness<br>మఙు = dimness<br>మఙల్ = the eyes to become dim | త. మప్పు<br>మయక్కు=busk, twiligh. |
| మ్రాకు = మ్రాను | క. మర, మరను = a tree | త. మరమ్ |
| మ్రాలు—సోలు (cf. మరలు) | క. మరల్=to turn, to retreat | |
| మ్రింగు=కబళించు | క. మింగు | త. విఴుంగు, విఙుంగు, మింగు=to eat |
| ముక్కు = చెడిపోయినది | క. ముక్కు = the state of being broken<br>ముఱుకు = Do.<br>ముఱి = to break, to destroy, to be impaired, (N) a fragment | త. మురి, ముఱి=to break, to be impaired |
| మ్రుచ్చు = దొంగలించు | క. ముఱిసు = to cause to break | |
| మ్రొక్కు = నమస్కరించు | క. మురి = to bend, to be bent, to stretch the body | |
| మ్రొగ్గు | క. ముఱ్గు=ముగ్గు, మొఱ్గు = to fall, to fall down | |

మ్రోగు—cf. మొఱఁగు, మొరయు క. మొఱఁగు=to sound as certain musical instruments, to roar త. ముఱంగు మ. ముఴక్కు

మ్రోడు—cf. మొరడు క. మొరడు=a story rough hillock.

ఇక మ్లానము, మ్లిష్టము, మ్లేచ్ఛుడు మొదలగు శబ్దములవంటివి యీభాషలలో లేవు. దీనినిబట్టి దక్షిణదేశ భాషలకును సంస్కృతమునకును శబ్దసంఘటనము విషయమున మిగుల వ్యత్యాస మున్నట్లు తెలియుచున్నది.

జకారఝకారము లాంధ్రభాషలోని వర్ణసమామ్నాయమున గ్రహింపబడకపోవుటచే నవి శబ్దాదియందు నిలుచుటయే సంభవింపదు

పదాంతమున వచ్చు వర్ణములు.—

తమిళభాషలో ఔకారముతప్ప తక్కిన యచ్చులు పదాంతమున నిలువగలవు. కకారవకారపూర్వకంబగు ఔకారముకూడ పదాంతమున నిలుచును. ఉదా: కౌ, వౌ. ఎ అనుదానికి పూర్వము హల్లున్నచో నది పదాంతమున నిలువలేదు. ఒకారముకూడ నకారముతప్ప తక్కిన యేహల్లు పూర్వమందున్నను పదాంతమున నిలువదు. ఉదా: నొ, నొ క్కొత్తా. ఞ కారము పూర్వమందున్నను ఏకార, ఓకారములు పదాంతమున నిలువలేవు. నకారవకారములు పూర్వమందున్నపుడు ఉకారఊకారములు పదముల తుదిని రావు. చకారపూర్వకమగు ఉకారము రెండుపదములతుదిని మాత్రమే యగపడుచున్నది. ఉదా: ఉచు, ముచు. పకారపూర్వకమగు ఉకారము 'తపు'అను నొక్కపదమందుమాత్రమే కనబడుచున్నది. అది ఉచ్చస్వరమున నుచ్చరింపబడినపు డొకరిని 'చంపుట'యనియు, నీచస్వరమున నుచ్చరింపబడినపుడు 'చచ్చుట'యనియు నర్థము నిచ్చును.

శబ్దములతుది నీ ౧౧ హల్లులుమాత్రమే నిలువగలవు.—ఞ, ణ, న, మ, న్న, య, ర, ల, వ, ఴ, ళ. నకారము రెండుపదముల తుదినిమాత్రమే యగపడుచున్నది. ఉదా: పొరున్, వెరిన్. ఞకార మొక్క 'ఉరిఞ్'అను పదముతుదినిమాత్రమే యగపడుచున్నది. 'వ'కారము 'అవ్, ఇవ్, ఉవ్, తెవ్'అను నాలుగు పదముల తుదినిమాత్రమే యగపడుచున్నది. పదాంత నకార మీక్రిందితొమ్మిది నపుంసకలింగశబ్దములలో మాత్రమే మకారముగా మాఱుటలేదని పెద్దలుచెప్పెదరు. ఎకిన్, చెకిన్, విఴన్, పయిన్, కుయిన్, అఴన్, పుటిన్, కడాన్, వయాన్.

ఆంధ్రమున సామాన్యముగా తక్కినభాషలలో వ్యంజనాంతములుగా నున్న పదములన్నియు నజంతములుగా మాఱుటచే నీభాషలో పదాంతవ్యంజనములను గూర్చిన విచారణమే యనావశ్యక మైనది. కన్నడమున శబ్దమణిదర్పణకారుడు పదాంతమున వచ్చు వ్యంజనములనుగూర్చి తెలిపియున్నాడు. ఈభాషలో య, ర, ల, ణ, న, ళ, ఴ, ఱ అను నెనిమిది వ్యంజనములును పదాంతమున నిలుచును పదాంతనకార మీభాషలో తెలుగున వలెనే యంతరించినది. తమిళమున ఞ కార మొక్క ఉరిఞ్ (=to rule=రుద్దుట) శబ్దాంతముననే కనబడుచున్నదని చెప్పబడినది. వకారము నాలుగుశబ్దముల తుదినే కనబడుచున్నట్లు తెలుపబడినది. కావున నీనూటిని త్రోసివేసినచో తక్కిన యెనిమిది వ్యంజనములును తమిళకన్నడశబ్దముల తుదిని నిలువగలవని వ్యక్తమగుచున్నది. ఈశబ్దము లన్నియు తెనుగున ఇకారాంతములో, ఉకారాంతములో అగుచున్నవి.

| | |
|---|---|
| కన్న. మెయ్, | తె. మేయు. |
| నెయ్, | నేయు. |
| కొయ్, | కోయు. |
| పొయ్, | పోయు. |
| పాయ్, | చచ్చు. |
| బాయ్, | వాచు. |
| తేర్, | తెచ్చు. |
| తళిర్, | తలిర్చు. |
| పోర్, | పోరు. |

| | |
|---|---|
| చెమర్, | చెమర్చు. |
| నూల్, | నూలు. |
| పాల్, | పాలు. |
| నిల్, | నిలుచు. |
| నిల్, | నిలుచు. |
| మాన్, | మాను. |
| పూన్, | పూను. |
| కాన్, | కను. |
| ఈన్, | ఈను. |
| పేన్, | పేను. |
| ఎన్, | అను. |
| వాన్, | వాను. |
| వేల్, | వేల్చు. |
| తాల్, | తాల్చు. |
| చీల్, | చీల్చు. |
| కొల్, | కొను. |
| ముగుల్, | ముగుడ్చు. |
| పూళ్, | పూడు. |
| ఏళ్, | ఎత్తు. |
| తెగళ్, | తెగడు. |

ఈతమిళభాషలోని వర్ణముల యుత్పత్తినిగూర్చి 'పిఱప్పియల్' అను మూడవప్రకరణమున చెప్పుదు నవి యన్నియు నాభిస్థానమునుండి బయలుదేరిన నిశ్వాస వాయువు, ఉరస్సు, కంఠము, శిరస్సు, నాక్కు, కఠిన తాలువు, దంతములు, పెదవులు, నాసిక యను నెనిమిది స్థానములనుండ ప్రసరించునపు డుత్పత్తియగుచున్నవని యీ గ్రంథకర్త తెలిపియున్నాడు. ఈవిషయమున తొల్కాప్పియనార్ పాణినీయశిక్షాపద్ధతినే యనుసరించిన ట్లున్నది.

"అష్టౌ స్థానాని వర్ణానా మురః కంఠః శిర స్తథా,
జిహ్వామూలంచ దన్తాశ్చ నాసికోష్ఠౌచ తాలుచ."
—పాణినీయశిక్ష.

నిశ్వాసవాయువు నాభినుండియే బయలుదేరునని పాణినీయశిక్షలో చెప్పిన విషయము నట్లే యీతడు ననువదించుట విశేషము. ఇంతేకాక నాభిస్థానము నుండి బయలుదేరిన వాయువుయొక్క లక్షణము, అది వ్యక్తధ్వనిగా మారుటకు పూర్వము పొందు మార్పులు మొదలగు విషయము లన్నియు బ్రాహ్మణముల గ్రంథములలో బాగుగ వివరింపబడినవిగావున వచ్చుట మాచి తెలిసికొనవలయునని చెప్పుటగూడ నీతడు సంస్కృతవ్యాకరణపద్ధతినే యనుసరించుచున్నాడను విషయమును సువ్యక్తము చేయుచున్నది. టకార ణకారముల యుత్పత్తినిగూర్చి చెప్పును నవి కఠినతాలువు యొక్క ముందుభాగమును నాలుకకొనచే తాకుటచే నేర్పడుచున్నవని చెప్పుటనుబట్టి నాలుకకొనను కొంచెము వెనుకకు త్రిప్పి తాలువుమధ్యభాగమున తాకుటచే నేర్పడు సంస్కృతభాషలోని మూర్ధన్యములకును, వీనికిని గొంత భేద మున్నదని యాతని యాశయమై యున్నట్లగపడుచున్నది. సంస్కృతభాషలోని మూర్ధన్యధ్వనులకును ప్రాచీనదక్షిణదేశభాషలోని ట, ణ లకును యత్కించిద్భేద మున్నను, నితరార్యభాషలలో లేక సంస్కృతమునందే యీమూర్ధన్యములు ప్రాదుర్భవింపటకు ప్రాచీనదక్షిణదేశభాషాసంపర్కబలమే ముఖ్యకారణమై యుండెననుటకు సందేహింపనక్కరలేదు.

(సశేషము.)

---

# పారశీక వాఙ్మయచరిత్ర

## మూడవప్రకరణము

మొహమ్మద్ ఖాసిమ్‌ఖాన్ గారు

### ౧

#### ఇల్ ఖానీయులకాలమునాటి పారశీక కవిత

క్రీస్తుశకము పదుమూడవశతాబ్ద ప్రారంభమున మంగోలియా, తుర్కిస్థానము, (ట్రాన్సాక్సోనియా) దేశముల నుండి ఒక ఝంఝామారుతము ప్రళయవాయువువలె వీచి ప్రపంచము నొక్కసారి కంప మొందించెను. జనసంఖ్య పెరుగుటచే కలిగిన తిండి కొదువవలన నవీనభూముల నాక్రమించుకో గోరి సైన్యములుగా గూడి ఐరోపాఖండము వరకు గల దేశముల సంపదను, నాగరికతను విధ్వంస మొనర్చి ధూమదేవతను తాండవింప జేసిన మొగలుల కరవాలచాలనోద్ధూత మీ ప్రళయమారుతము. ఒక నూతననాగరికతను విజృంభింపజేసి పశ్చిమమున స్పెయినుమొదలు ప్రాగ్దిశను సింధునదీ ప్రాంతమువరకు విజయ పతాకమును ప్రతిష్ఠాపన మొనర్చి ప్రపంచము నంతను ఖలీఫాల అధికార రజ్జువుల బంధించి ఒకటిగా చేయ గోరిన మొహమ్మదీయుల సామ్రాజ్యమును విచ్ఛిన్న మొనర్చి, రష్యా, పోలండు, హంగరీ, సైలీషయా మున్నగు పశ్చిమదేశములను, పారశీక మాది ప్రాగ్దేశములను రక్తవాహినుల ప్రవహింపజేసిన మృత్యుదూతలు మంగోలులు.

'ధరణీరాజ్యము వీరభోజ్య' మను సూక్తి నీతిగాగల ప్రపంచమునకు ఈసంఘటన మొక చిత్రము కాదు. రుధిరక్రీడ యగు యుద్ధము అవినీతిగా ఎంచని ప్రపంచమునకు మంగోలుల ఘోరయుద్ధములు కంప మేల కల్గించవలెను, దౌర్బల్యమున కాక?

పారశీకమును జయించిన మంగోలుల నాయకుడు హులాగూ ౧౨౬౫.వ సంవత్సరమున గతించెను. నాటినుండి అతనిసంతతి ౧౩౩౬-వ సంవత్సరమువరకు—అనగా దాదాపు ౭౦ ఏండ్లకాలము—పారశీకము నంతను అవిచ్ఛిన్నముగ పరిపాలించిరి. ఈ కాలమున పరిపాలించిన రాజులకు ఇల్‌ఖాను లందురు. అందుచే దీనిని ఇల్‌ఖానీయ యుగమని వ్యవహరింతము.

మొగలులు మొహమ్మదీయులు కారు. అందుచే వారు తమరాజ్యమగు పారశీకమున మొహమ్మదీయుల ప్రార్థనాలయములను, పుస్తకాలయములను దగ్ధమొనర్చిరి; మొహమ్మదీయపండితులను సంహరించిరి. కాని మంగోలులు సాహిత్యమునం దభిరుచి కలవారు. ఎందరో కవులును, చరిత్రకారులును వారి ఆస్థానముల మన్ననల బడయుచుండిరి. పారశీకమున ఈకాలమున రచింప

బడినన్ని చరిత్రగ్రంథములు మరేకాలమునను ప్రభవింపలేదు. నాసిరుద్దీన్ అను ఒక గొప్ప మొహామ్మదీయవిజ్ఞాని ప్రథమ ఇల్ ఖాన్ ప్రభువగు అబఖాచే పెక్కుమన్ననల బడసెను. మతసంస్థల కేర్పడిన ఇనాములపై అబఖా ఆవిజ్ఞానిని అధికారిగా నియమించెను. ఆప్రభువుపోషణక్రింద నాసిరుద్దీన్ తర్క, గణిత, నీతిశాస్త్రములపై పెక్కుగ్రంథములను రచించెను. 'తారీఖ జహాన్‌గుషా'అను పేర మంగోలువీరచరిత్రమును రచించిన అతామాలిక్ ప్రభువు పారశీకమును జయించిన హులాగూ. 'తారిఖ వస్సాఫ్' అను మరియొక చరిత్రగ్రంథమును రచించిన వస్సాఫ్ పోషకుడు ఏడవ ఇల్ ఖానీయప్రభువు ఉల్జయతు. 'జమిఅతుత్తవారీఖ" (చరిత్రసర్వస్వము) అను ఉద్గ్రంథమునే కాక అనేకశాస్త్రగ్రంథములు రచించిన రషీదుద్దీన్ ఆరవ ఇల్ ఖాన్ ప్రభువగు గాజాన్ ప్రధానామాత్యుడు. 'తారీఖ బనాఖాతీ' రచించిన అబూ సులేమాన్ దావూద్ ఆప్రభువు ఆస్థానకవి. ఇట్టి ఉదాహరణముల నెన్నేని ఈయవచ్చును.

## ౨

పారశీకులకు అరబ్బులకువలెనే కవితయన్న ప్రియ మధికము. విద్యావంతులలో సాధారణముగ పద్యరచనము చేయలేనివారెవరు నుండరు. ఇంక కవు లనదగినవారు పల్వురుండినను వారి నందరిని మనము పాటించనక్కరలేదు. ఇల్ ఖానీయుల కాలములో విశ్వసాహిత్యపీఠము నలంకరింపదగిన మహాకవులు ఇరాఖీ తప్ప మరెవ్వరును కానరారు. జౌహదుద్దీన్, జౌహదీ, నఅదుద్దీన్ మహమూద్ మున్నగుకవుల రచనలు ఎక్కువగా కానుపింపవు.

ఇరాఖీ—

ఇతనిపూర్తిపేరు ఫఖరుద్దీన్ ఇబ్రాహీం. ఇతడు ప్రఖ్యాత సూఫీకవులలో ఒకడు; సౌందర్యోపాసకుడు. ఈ ఉపాసన ఎంత గంభీరమైనదో అతని జీవితము చాటును. ఇరాఖీ తనపదునేడవఏట సన్యాసులతో నున్న ఒక సుందరుడగు బాలుని చూచి వారిలో చేరిపోయెను. తరువాత ఆసన్యాసులతో హిందూదేశమునకు వచ్చి ముల్తాన్‌నగరమున షేక్ బహాఉద్దీన్ అను ఒక ప్రఖ్యాత సూఫీకి శిష్యుడాయెను. ఇరాఖీ త్వరలో గురువు అనుగ్రహమును బడసెను. ఒకనాడు ఇరాఖీ ఒకపద్యమును వ్రాసి దానిని పాడుచు నాట్యమాడుచుండగా బహాఉద్దీన్ ఆపాట నంతటి నాలకించి, 'ఇంక నీవు సిద్ధిని బడసితివి. ధన్యుడ'వని అతనికి సూఫీదుస్తుల నిచ్చి దీవించెను.

ఆ పద్యమున కిది అనువాదము:—

"ప్రథమమున పాత్రిక నింపిన మధురసము సాఖిస్వాప్నికాక్షులనుండి సేకరించబడినవి.

"అహంకారపూరితులగు మధుపాన పరవశులు అహంభావ శూన్యమగు పానమును పొందిరి.

"ప్రియుని అరుణాధరప్రసాదిత మాపాత్రిక. 'ప్రియుని మధువు' అని పేరిడి దానిని హా రాస్వాదించిరి.

"ఆ సౌందర్యప్రతిమల కురులు విశ్రాంతి యేని లేక అశ్రాంత మెందరి హృదయముల నపహరించును ?

"మంచిచెడుగులకు మనగృహాంగణమున స్థానము కల్పించుకొని ఒకపాత్రతో అన్నిటిని మరచిపోయిరి.

"క్షేత్రముపై సౌందర్యగోళమును వైచి, ఒక్కవేళకే భూమ్యాకాశములను లోంగదీసికొనిరి.

"ఆ మధుపానపరవశులు, హృదయములను వేటాడుటకు పరచిన ఉచ్చులో యన, తమజడలను విప్పివేయుదురు.

"వారి చూపులు సహస్రసందేశముల బంపును.

"వారి కంటిరెప్పలు నా హృదయమున కేహో రహస్యములను సంజ్ఞచేయును.

"మానుల మనుటమేకాని రహస్యముల నెన్నిటినో మరుగునుండి ప్రపంచమునకు చాటుదురు.

"ప్రపంచమునందలి దౌష్ట్యమును దుఃఖమును కలిపి 'ప్రేమ' అందురు. తమ రహస్యములను తామే ఇట్లు ప్రపంచమునకు చాటుచు ఇరాఖీకీర్తి నేల భగ్న మొనర్పజూతురు."

కొన్నాళ్లు గడచినపిదప బహా ఉద్దీన్ తనకూతు నిరాఖి కిచ్చి వివాహము చేసెను. పాతికేండ్ల వరకు ఇరాఖి హిందూదేశమునందే తనజీవితమును గడిపి బహాఉద్దీన్ మరణానంతరము అరేబియా దేశమునకు పోయెను. అటనుండి సదరుద్దీన్ అను ఒక సూఫీని సందర్శించుటకై చిన్నఆసియాదేశమునకు పోయి అచట 'లమాఅత్' (విద్యుత్తులు) అను తన ప్రఖ్యాతవచనకావ్యమును రచించెను. అక్కడి ప్రభు వొకడు ఇరాఖికి శిష్యుడై అతనికొరకొక మఠమును నిర్మించి ఇచ్చెను. ఇరాఖి కొంతకాల మచటనే గడిపి శిష్యుని మరణానంతరము ఈజిప్టుదేశమున కేగి అచ్చటినుండి సిరియాదేశమునకు మరలి తన తుదిదినముల నచ్చటనే గడపెను.

ఇరాఖిపద్యముల కొన్నిటి నిట ఉదాహరింతును.—

"మధువుతో మెరయుచున్న అవి పాత్రికలా, లేక జలదపంక్తులనుండి మెరయుచున్న బాలసూర్యులా ?

"నిర్మలమగు కాచపాత్రలో స్వచ్ఛమగు మధు వుంట రెంటును ఐక్యము చెందినట్లు కాన్పించుచున్నవి.

"అంతయు కాచపాత్రయే, మధువే కాదు; లేక అంతయు మధువే, కాచపాత్రయే లేదా ?

"ఏది రాత్రియో, ఏది పవలో, ఏది పాత్రయో, ఏది మధువో, నీవు తెలిసికో లేక

పోయిన, నీవు రేబవళ్లవలెనే జ్ఞాన ముండియు సందేహపీడితుడ వౌదువు.

"విశ్వమును ప్రతిఫలించుకొను పాత్రికను చూడుము; ఆత్మ, ప్రియుడు, హృదయము సమస్తము అతడే అని నీకే అవగాహమగును."

ఇరాఖీ 'మెరుపులు' వచనమున నున్నను అక్కడక్కడ పద్యములు కూడ నున్నవి. ఈ క్రిందిపద్య మొకటి ఉదాహృతము:—

"యవనికాభ్యంతరమునుండి ప్రేయసి పాడుచున్నది. ఆకర్ణించుటకు ప్రియుడేడి? ఏడి?

"అనుక్షణ మొక్కొక నవీన రాగము పాడుచున్నది; ఒక్కొక నవీనతంత్రి మీటుచున్నది.

"విశ్వమంతయు నాగానము ప్రతిధ్వనించుచున్నది. ఆమహాగానము నాలకించిన దెవరు?

"దాని రహస్యము విశ్వగర్భమునుండి బయల్వెడలినది. ప్రతిధ్వని రహస్యము నెట్లు దాచగలదు?

"ప్రత్యణువు ఆ రహస్యమును గొంతెత్తి స్పష్టముగ వెలిబుచ్చుచున్నది."

జౌహదుద్దీన్—

జౌహదుద్దీన్ ప్రఖ్యాత సూఫీ యగు అరబీ శిష్యుడు. ఇరాఖీవలె ఇతడుకూడ సౌందర్యోపాసకుడు. 'షమ్స్' అను నాటి ప్రఖ్యాతసూఫీ ఇతనిని కలిసినప్పుడు, "ఏమి చేయుచుంటి" రని అడిగెనట. దానికి జౌహదుద్దీన్ "నీటిలో ప్రతిఫలించిన చంద్రుని సౌంధర్యము ననుభవించుచున్నాను." అని ప్రత్యుత్తర మీయగా షమ్స్ "ఆకాశముపై నున్న చంద్రునే ఏల చూడరాదు?" అని ప్రశ్నించెనట. జౌహదుద్దీన్ రూపములతో నిండిన భౌతిక ప్రపంచమును ప్రేమించువాడు. దివ్యసౌందర్య మాతనికి నీటిలో ప్రతిఫలించిన చంద్రునివలె భౌతికరూపములయందు కాన్పించును.

"నాకన్నులు రూపములనే చూచును. భావము రూపములలో తాను ప్రతిఫలించును. మనము రూపములమధ్య నివసించుచున్నాము; మనప్రపంచము రూపప్రపంచము. అందుచే మనము రూపముల నుండియే భావమును గ్రహించవలెను."

ఇదియే జౌహదుద్దీన్ ప్రత్యేకత.

జౌహదుద్దీన్ కావ్యము లేవియు దొరకలేదు. కవిజీవితములలో ఉదాహృతములైన కొన్నిపద్యములుమాత్రము కలవు. ఇతడు రచించిన 'మిస్‌బాహుల్ అరవాహ్' (ఆత్మజ్యోతి)నుండి పెక్కుపద్యములు ఉదాహరింపబడినవి. వానిలో నొకటి ఈక్రిందిపద్యము:

"చేయి కదలినప్పుడు నీడయు కదులును. పాపము! నీడ మరేమి చేయగలదు? నీడకు స్వాతంత్ర్యము లేదు. చేయి కదలిననే అది కదలును. స్వాతంత్ర్యము లేనిదానిని 'అస్తి' అని చెప్పుట జ్ఞానవంతుల పనియా?

"అతని ఛాయగా పడిన సర్వసృష్టియు 'అస్తి' అని చెప్పు టెట్లు? నిజముగా అది 'నాస్తి'యే.

"ఏనను కళాకారుడు తనరచనను ప్రేమించును. అతడుతప్ప మరేదియు లేదు.

"సత్యము నతడే ప్రకటించును. అతడే వినును. అతడు చూపుచున్న తన ఆననము నతడే తిలకించును.

"నిశ్చయముగ అతడు తప్ప మరేదియు లేదు."

జౌహదీ—

జౌహదుద్దీన్ శిష్యుడు జౌహదీ. ఈకవి రచించిన 'జామ్-ఇ-జమ్' (జమ్షీదుపానపాత్ర) కావ్యమును పాఠశీకమున చదువనివా రుండరు' ఇది ప్రకటితమైన ఒకమాసములో ౪౦౦ ప్రతులు వ్రాయింపబడెనట. జౌహదీపద్య సంపుటినుండి అనేకపద్యములు కవిజీవితముల యం దుదాహరింపబడినవి.

ఇతని పద్య మొకటి క్రింద అనువదించు చున్నది:—

"ఎంతకాల మీగర్వము? ఆస్నేహితునితో సఖ్యము చేయుము.

"చైతన్యముతో నీహృదయమునింపుము.

"ప్రశాంతమగు నీయాత్మకు బలము చేకూర్చుకొమ్ము.

"వాసనాలేశమేని లేక అహంకారమును చెరిపి వేయుము.

"అప్పుడే సఖుడు నిను కౌగిలించుకొనును.

"అత డానతిచ్చినట్లు చేసితివేని నీకోరిక లన్నియు నెరవేరును.

"అతడే నీకు బంధువు. సర్వస్వమును త్యజింపుము. నీబంధుకోటినుండి ఎప్పుడు విడివడెదవు?

"నీలో 'మనము', 'నేను' అనుచున్న దెవరు?

* * * *

"చూపు ఐక్యము ఒకటే ఐనచో కంటకమును చూచు కన్ను రక్తాంకితము కాదేల?

"ఇదిగో, పానపాత్రిక నిచ్చుచున్నాడు-పారవేయక త్రాగుము. ఇదిగో, నేను మరొక పాత్రిక నిచ్చుచున్నాను.

"ఒకటి ప్రభువాననము.

"రెండవది ప్రభువు ప్రతిమ.

"గులాబీపొదను, కంటకమును అలంకరించినపుష్పమొసగిన దాపాత్రను నింపినమధువు.

"విశ్వమంతయు అతని రూపసందర్శన మొసగును. కన్నులున్న వాడవు,చూడుము."

సలదుద్దీన్ మహమూద్—

ఇత డొకప్రఖ్యాతసూఫీకవి. ఇతని గుల్షన్-ఇ-రాజ్ గొప్ప సూఫీగ్రంథము. సూఫీమతము నెరుగగోరువారి కిది అమూల్యగ్రంథము. ఖురాసాన్ నగరమునుండి అమర్ హుసైనీ అను పండితుడు పంపిన ౧౫ ప్రశ్నలకు ఉత్తరముగా ఈగ్రంథమును మహమూద్ రచించెను. దీని అనువాదమును ఆంధ్రపాఠక లోకమునకు త్వరలో సమర్పించుకో దలచినాడను.

---

# లేఖన ప్రమాదము

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు

సంస్కృత వ్యాకరణ విలక్షణముగ నాంధ్రమున లఘ్వలఘుభేదములన్ లకార రేఫములు రెండువిధములుగఁ జెప్పఁబడియున్నవి. ఆంధ్రశబ్ద చింతామణి యందలి—

"లఘుర్వోఽలఘువ శ్చేతి
ద్వేధాఽన్తస్థాన్ విదన్తి శాస్తారః,
అస్యోఽస్యవ్యాకరణ
స్పష్టా ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః"

అను కారికను వివరించుసందర్భమున వెలమూచి బాల సరస్వతి ప్రాకృతవైయాకరణులు "లో ళః" అను సూత్రమున లకారముంగూర్చి లఘ్వలఘుభేదముల నొప్పుకొనియున్నారనియు, రేఫమునందలి భేదములనుమాత్ర మాంధ్రవైయాకరణులే వివరించి రనియుఁ జెప్పియున్నాఁడు. కావున నిట్లు భేదము కలయప్పు డుచ్చారణము తప్పక భేదించి యనుటలో సందియము లేదు. ఉచ్చారణమునందలి భేదముంబట్టి వా రిట్టిభేదమును గల్పించిరని చెప్పవలెను.

భేదము లి ట్లంగీకరింపఁబడినను వర్ణ సమామ్నాయమునందు వీని ననుసరించి ళకటరేఫాదికము చెప్పఁబడియుండ లేదు. సంస్కృతవైయాకరణులు యవలు లఘ్వలఘుభేదమున ద్వివిధములని [వ్యో ర్లఘుప్రయత్నతరః శాకటాయనస్య] చెప్పినను వానిని వర్ణసమామ్నాయమునఁ బరిగణింపకుండుట మనవారి కాదర్శప్రాయమై యుండనోపును. బాలవ్యాకరణమున "తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు" అనుసూత్రమున ళకారము చెప్పఁబడియున్నను నది వర్ణాంతరము కాని యలఘులకారము కాదని చిన్నయసూరియే వేఱొకచో వ్రాసియున్నాఁడు.

"ఏళులు, పాళులు, త్రాళులు" అని బహుత్వమునందు ర ల డల కాదేశమయిన ళకార మలఘు వనియు, "తల, సెల" యిత్యాదు లందలి లకారము లఘువనియు నాంధ్ర వైయాకరణుల యభిప్రాయము. కావున నాదేశ రూపమగు ళకారముకంటె భిన్నమై నామమునందే గల "తాళము" ఇత్యాదులయందలి ళకారమే వర్ణసమామ్నాయమున గ్రహింపఁబడినదని మనము నిశ్చయింపవలెను.

సంస్కృతసంప్రదాయము ననుసరించి యాంధ్రమున యవలు రెండువిధములుగఁ (లఘ్వలఘుభేదమున) బరిగణింపఁబడియే యున్నవి. కాని ప్రయోజన రూపమగు నుచ్చారణమున భేదము లేకుండుటచే లిపియందును వానికి భేదము లేకపోయినది. రేఫవిషయమున వర్ణభేద మగపడుచుండుటచేఁ బ్రస్తుతమున వాని కుచ్చారణమున భేదము పాటింపఁబడకున్నను బ్రాచీనకాలమున నుచ్చారణభేదము కలిగియుండెడిదని మనము నిశ్చయింపవలెను. ఇఱ్ఱి, కఱ్ఱి, మఱ్ఱి, మొదలగు ద్విత్వరేఫము లన్నియును శకటరేఫములు గాన రేఫద్విత్వమున నుచ్చారణ మలఘురేఫపరమై యుండునని పండితుల యాశయము. కాని యిర్రి, కర్రి, మర్రి, గొర్రె యనునట్టి స్థలములందు లఘురేఫము నుంచినను మీఁదిరీతి యుచ్చారణమునకు నష్టము లేదు. ఇట్లు భేద మేమియు లేకుండుటంబట్టియు, లిపియందు భేద ముండుటంబట్టియుఁ శకటరేఫము నుపయోగించువిషయమున నెంతటివారైనను బొరపడుట సంభవించుచున్నది. శకటరేఫముకల పదము లివియని వైయాకరణులు నియమించుకొనవలసివచ్చుచున్నది.

కాని లకారవిషయమై యింతవఱకును పూఁదిరీతి చిక్కులు కలుగుచుండుట లేదు. వర్ణభేదమువలెనే యుచ్చారణభేదముకూడ లకారవిషయమున స్పష్టముగఁ గన్పడుచున్నది. "ఏళులు, త్రాళులు, పాళులు" అను చోట్ల నెట్టివాఁడును, "ఏలులు, త్రాలులు, పాలులు" అని వ్రాయ సమకట్టఁడుకదా!

ఉచ్చారణమున లఘ్వలఘులకారములకు భేదము సువ్యక్తమై లిపి భేదముగ నున్నను యతియందును, ప్రాసమునందును ల ళ లకభేదమే యంగీకరింపఁబడి నది. ఉచ్చారణమున భేదము లేకున్నను ర ఱ లకుఁ బ్రాసమైత్రి గాని, యతిమైత్రి గాని యంగీకరింపఁబడి యుండ లేదు. ఇందులకుఁ గల కారణ మేమో వ్యక్తమై యున్నది.

అలఘ్వతిరిక్తముగ శకటరేఫము వేఱొకటి లేకున్నను, లఘ్వలఘురేఫములకు భేద ముచ్చారణమున వ్యక్తముగ నున్నను, ద్విత్వరేఫము శకటాతిరిక్తము కాదనియు, శకటరేఫముక్రింద రేఫమును గాని, రేఫముక్రింద శకటరేఫమును గాని (ఱ్ర, ర్ఱ) వ్రాయఁగూడదనియు, చిఱుగు, మెఱుఁగు ఇత్యాదులయందు లఘురేఫమును, పెరుగు, కరుగు ఇత్యాదులయం దలఘురేఫమును వ్రాయఁగూడ దనియు వైయాకరణుల సిద్ధాంతము.

లఘ్వలఘు లకారాతిరిక్తముగ ళకారము వర్ణసమామ్నాయమునఁ బరిగణింపఁబడియున్నది. దానికిని లకారమునకు నెట్టి సంబంధమును లేదు. కావున ళకారద్విత్వరూపములను మనము "పళ్ళెము, కళ్ళెము, గోళ్ళెము" అను రీతినే వ్రాయవలసియున్నది. కాని పండిత పామర సామాన్యముగ నందఱు నిట్టిచోట్ల "పళ్లెము, కళ్లెము, గోళ్లెము" అనియే వ్రాయుచున్నారు. న్యాయమునుబట్టి యట్టిరీతిని వ్రాసినచో "పళ్ లెము, కళ్ లెము, గోళ్ లెము" అని యుచ్చరింపవలసియుండును. అనుభవసిద్ధమగు నుచ్చారణముమాత్రము "పళ్ ళెము, కళ్ ళెము, గోళ్ ళెము" అనియే యున్నది. ఈలకారలిపి ళకారమున కెట్లు దాపురించినదో తెలియరాకున్నది. ఒకవేళ ల ళకార సామాన్యముగ నియ్యది వాడఁబడుచున్నది కావున రెండింటికి నిది యొక్కటే లిపియని యనుకొనఁ గూడదా! యని సందేహము కలుగవచ్చును. అట్లను కొనిన నాఁడుకూడ ళకారముక్రింద నున్న లకారచిహ్నము లకారచిహ్నము గాక ళకారచిహ్నమే యగునని యనుకొనక తీరదు. లేనిచో నుచ్చారణము భేదించును. అట్లనుకొనుటకంటె ళకారచిహ్నమునే తొలుతనే యుంచినచో నెట్టి విప్రతిపత్తికి నవకాశము కలుగఁజాలదు. యతిప్రాసలయందు ల ళల మైత్రి యంగీకరింపఁబడుచుండుటచే ళకారచిహ్నము విరోధమును గల్గింపఁజాలదు. కావునఁ బ్రాచీనకాలమునుండియు నిట్టి వ్యవహారమే కలదని యనుకొన వీలు లేదు. ఒకవేళ శాసనములందుఁ గొన్నింట నట్లు కన్పించినను శాసనభాషకంటె నీభాష వేఱగుటచేతను, శాసనసంప్రదాయములు కొన్ని కావ్యభాషయందు విడువఁబడుటచేతను దన్మార్గమే యిచట నవలంబనీయము. ళకారముక్రింద మఱియొక ళకారముంచినచో వ్రాఁతలోఁ బంక్తులు సొగసుగ నుండక పోవుటయు, వ్రాఁత (క్రింది ళకారము) సుగమము కాక పోవుటయుఁ దటస్థించుటచే శాసనములందును, దాళపత్రగ్రంథములందును లకారచిహ్నము ళకారచిహ్నములోనికి మాఱియుండవచ్చును.

ఉచ్చారణమున లేని శకటరేఫము, నర్థానుస్వారము పాటింపఁబడుచున్నప్పు డుచ్చారణమునఁ గల ళకారచిహ్నము పాటింపఁబడకుండుటలోఁ గల కారణము కేవలలేఖనసౌకర్యరూప మగుటచే యథార్థమును గుర్తించిన విమర్శకు లియ్యది ప్రమాదజనితమనియే చెప్పవలసియున్నదని విన్నవించుచున్నాము. చదువరు లిందలి దోషములను విడిచి గుణములను గ్రహింతురు గాక!

---

# శరత్పూర్ణిమ

కోరిమిల్లి వీరసోమసత్యనారాయణగారు

లేశము మబ్బువీచికలు లేని ప్రశాంతవిశాలనిర్మలా
కాశసరోవరంబునను కాంతిలుచుండె శరన్మనోజ్ఞ రా
కాశశిబింబపాండురవికస్వరపద్మము నేడు భృంగసం
కాశసమంచితాంక మది కాదొకొ మధ్య దనర్చె వింతగన్.

పైకొన ప్రేమవెల్లువలు భాసురదంతపుపళ్లెరాన ర
త్నాకరు డింద్రనీలమణిహారము జేరిచి కాలదూతిచే
ప్రాకటలీల నీప్రకృతి భామిని కంపిన కాన్కవోలె న
స్తోకసుధాంశుబింబ మదె తోచెను మింట కళంకయుక్తమై.

భూరితమోహరుండును ప్రమోదకరుండగు నీశ్వరుండె నిం
డారిడు ప్రేమతోడ హృదయామృతధామమునుండి సత్కృపా
సారసుధారసంబు వెద చల్లుచు నుండె ననంగ నిప్డు డీ
శారదచంద్రచంద్రికలు చల్లగ నొప్పె ప్రసన్నదీప్తితోన్.

శారదలక్ష్మి కార్తికపు సారసనేత్రున కారతీయ వి
స్ఫారవియత్తలం బనెడు పళ్లెరమం దవదాతసారక
ర్పూరము కుప్పవోసె నన పూర్ణసుధాకరబింబ మంచితా
కారముతోడ నే డదిగొ కన్నులపండు వొనర్చె నెంతయున్.

ఈనిఖిలప్రపంచ మెలయింప గళావిభవంబుతోడ ది
వ్యానన చంద్రబింబసముదంచితహాసమనోజ్ఞ చంద్రికల్
గానబడంగ భారతి యగణ్యకృపామృతధార లొల్కగా
తాన ప్రసన్నరూపమును దాల్చెనొ శారదపూర్ణిమానిశన్.

ఆరయ విశ్వనాథుని సమగ్రయశోలత నిర్మలాంబరో
దారపు కాయమానమున దార్కొన బొల్చెను పాండుతారకా
కోరకరాజి, యం దతులకోరక మొక్కటి విచ్చె నాగ నీ
తోరపు చంద్రమండలము దోచుచునుండె నపూర్వశోభతోన్.

మెండుకొనంగ బ్రేమపరమేశ్వరశిల్పి రచించినట్టి బ్ర
హ్మాండవిశాలసౌధమున బ్రాంచితనిర్మలసాంద్రచంద్రికా
పాండుసుధావిలేపనము బాల్పడ జేసెను కాలభృత్యు డీ
నిండుమృగాంకు డొప్ప కమనీయసుధామయభాండరీతిగన్.

వాసిగ చంద్రికావిమలవస్త్రము దాల్చి యపూర్వలీల గై
సేసికొనంగ నీప్రకృతిచేడియ నిల్పిన మించుటద్దమై
భాసిలె చంద్రబింబము నభఃస్థలకుడ్యమునందు, తారకల్
భాసిలుచుండ వజ్రశకలంబులరీతి మనోహరంబుగన్.

ఎన్న శరల్లతాంగి జగదీశ్వరపూజ లొనర్చునత్తరిన్
మిన్నువితానమధ్యమున నిల్పిన పాదరసంపుబుడ్లనా
జెన్నలరారె తారకలు శీతకరుండును సొంపుమీరె వి
ద్యున్నవదీపికాకృతిసముజ్జ్వలకాంతుల జిమ్మువైచుచున్.

ఎన్నివ్రతాలు సేయ జనియించెనొ అల్లపయఃపయోధి కీ
పున్నమచందమామ తెలిపూవులగుచ్ఛము మించుటద్ద మీ
వెన్నలముద్ద యీసుధల పెన్నిధి వెన్నెలవన్నెకా సహో!
కన్నులు రెండు చాలునొకొ కన్గొన నీసుకుమారమూర్తినిన్.

అమృతనిధానమైన ధవళాంశుకరంబులు సోకినన్ శిలా
సమితి ద్రవింపగా జడధి సైతము నుబ్బుచునుండగా, చకో
రము లలరారగా కుముదరాజి వికాసము నొందుచుండగా
ప్రమదము లంతరంగముల బట్టగ శక్యమె మానవాళికిన్.

సురుచిరపాండుచంద్రికలు చూడ లతాతరుసీమలందు వి
స్ఫురితములైనవేళ తెలి పూవు లనంగ నదీజలాశయాం
తరముల బర్వువేళ కలధౌతపురేకు లనంగ గ్రాల ని
ర్భరతరహర్షవీచికల భావము లొక్కట దేలియాడవే.

నెలతలనవ్వులీల ద్విగుణీకృతమయ్యెను సైకతోపరి
స్థలములు దంతపీఠముల చాడ్పున నొప్పె నగాళి రాజతా

ద్రులగతి గ్రాలె నీరములు దుగ్ధరుచిన్ దగ పండువెన్నెలన్
కలకలలాడు నీప్రకృతి గాంచిన మేనులు పుల్కలెత్తవే.

సలలితకార్తికీతిథినిశాపరిపూర్ణసుధాంశుచంద్రికల్
గలయఁగ బర్వ నత్తరి నొకానొకదివ్యతరంగిణీతటీ
పులినతలాన గూర్చుని యపూర్వతరప్రకృతిప్రభాళి క
న్నుల గనుఁగొన్న డెందము లనూనముదంబుధి నీదులాడవే.

ప్రవిమలచంద్రికాయశము పర్వ దిగంతములందు లోచనో
త్సవసుకుమారమూర్తియయి సత్పథమందున సుప్రసన్నవై
భవమున తేజరిల్లుచు శుభాస్పదపూర్ణకళాప్తి నొప్పు నీ
కువలయనాథు గాంచ కవికోటుల లేఖను లూరకుండునే.

---



భద్రాద్రి గ్రామము
శ్రీ దమ్మేటి గోపాలరావుగారు తీసిన ఆకస్మిక ఛాయాచిత్రము.

# కవిత్వము: యతిప్రాసలు
## (Blank Verse)

ఆచంట బాపిరాజుగారు, బి. ఏ.

ఆంధ్రసారస్వతమున కన్నివిధములను సంస్కృతసారస్వతమే మాతృకగా చిరకాలమునుండి నిన్న మొన్నటివఱకును పరిగణింపఁబడుచుండెను. నేఁడాంగ్లేయభాషా సంపర్కమువలన తెనుఁగు కవిత్వమున నూతనసంస్కారము లేర్పడుచున్నవన్నమాట యొప్పుకొనక తప్పదు. నూతన భావములు ఖండాంతరనాగరకతా సంపర్కమువలనను, పరభాషావిద్యావిశేష వాసనలవలనను నవీనరూపము దాల్చి నాట్యము సలుపుచున్నవి. పూర్వరూపముననే కొంతవఱకు కవితావధూటి కన్నులకు గోచరించుచున్నను, హృదయాంతరాళమున పరదేశవిశేషములను జవిగొనుచుండుటచే, వేషభాషలు రెండును మార్చవలసిన యగత్య మేర్పడుచున్నది. ఆంగ్లేయసారస్వత మపారముగా కొల్లగొనుచున్న యాంధ్రసోదరులు వేలగు పరదేశపు కవిత్వపు సొంపులు విన నింపుగొనుచున్నారు. ప్రజల యాశయములు, రాజ్యాధికారవిశేషములు, మనోభావములు మిక్కిలిగా మారుచున్న సమయమున కవిత్వపుఠీవియు క్రొత్తరూపు దాల్చుట వింత కాదు. నూతనరూపమున కవితావధూటిని అలంకరింప వెనుదీయుచున్న కవిసత్తములు సహితము, నవీనభావములే తమకవిత్వమునఁ బ్రకటించుచున్నారు.

రాజ్యపరివర్తనల కనువైన యిక్కాలమున, కవితాశరీరము పూర్వరూపమును విడిచి నూతనరూపమును ధరించుటకు సిద్ధపడకున్న నభివృద్ధియందు వెనుకంజ వేయవలసివచ్చును. తెనుఁగుకవిత్వమునకు సంస్కృతభాషయే మాతృకయని ముందు తెలిపియుంటిని. సంస్కృతమున నుండియే యతిప్రాస లను పద్యనియమములు గైకొనఁబడినవని సాంస్కృతిక నామములే చాటుచున్నవి. అయినను, విరతి, విశ్రామమనఁబడు యతి సంస్కృతమునఁ గేవలము పదవిశ్రామమే గాని, తెనుఁగునందున్నట్లు, ద్వివిధమైత్రియుఁ గానరాదు. కావున నియ్యది తెనుఁగు కవితకన్న పూర్వమగు తమిళాదిభాషల సంపర్కమువలన తొలుదొల్త గ్రహింపఁబడినదేమో యని తోఁచుచున్నది. ఇట్టికట్టుబాటు మనకవులు సాధారణముగా సర్వహైందవసారస్వతమునకు మాతృకయైన సంస్కృతమునుండి గైకొనలేదు. కావున కారణాంతరములచే మధ్యకాలమున పరభాషలనుండి గైకొనఁబడిన నియమములు మఱికొంతకాలమునకు బలవత్తర కారణములవలన మధ్యను విడిచిపెట్టినను దోషము లేదు. అయినను మనవారనేకశతాబ్దములనుండి యలవాటుగా నున్న, యిబ్బంది కూర్చు, కట్టుబాటుల నైనను సులభముగా వదలిపెట్టుటకు సిద్ధముగా నుండరని నాకును తెలియును.

అది యట్లుండ వాదమునఁ గాని తత్త్వము బోధకా నేరదు కదా; యతిప్రాసల విషయముకూడ నిట్టిదే. సంస్కృతమున నైచ్ఛికముగా నున్న ప్రాస తెనుఁగున పరభాషాసంపర్కమువలననే బహుశః నిర్బంధకమైనది. కంద మనుష్టుప్పు యొక్కయు, గీతి ఆర్యావృత్తము యొక్కయు వికృతులుగా (?) భావింపఁబడుచున్నను, కందము తమిళభాషా సంపర్కమువలన హెచ్చునిర్బంధములకు లోనయినదని వినికిడి. కవులు తమ పాండిత్య ప్రభావముఁ జూపుట కెన్నియైన ప్రాసాదినియమము లుంచుకొని కవిత్వము చెప్పుట వాడుకగా నున్నది. అందువలన నట్టికవిత్వము పాండిత్యమే గాని కవిత్వమని యెన్నఁడును చెప్ప నమనీయదు. ఎందఱో మహాకవులు బాల్యకవిత్వమున శబ్దాడంబరము చూపి ప్రాసాదులతో పద్యములు చెప్పినను, వయసు మీఱిన వెనుక కవిత్వమునకు రసము ప్రధానమని యవగాహనము చేసికొని రసమును పోషించుచు భాషాసౌకుమార్యముఁ జూపుచు,

నవసరపు శబ్దాడంబరాదులను విడిచి కవిత్వపుబెంపుఁ జూపుచుండిరి.

అయిన నింతవఱకు నెంతటి స్వతంత్రకవిత్వధురీణుఁడును యతిప్రాసనియమముల నుల్లంఘింప సాహసింపఁడు. ఇది యన్నింట నవీనయుగము గావున, నీ నూతనఫక్కి మనకాలమునాఁటి కవు లవలంబనీయమని యెంచినచో నట్లు గావింతురు గాక! ప్రజాసామాన్యము జీవనోపాధులకు కాల మంతయు వ్యర్థము గావించుచున్న నూతనశకమున, కవులకు తీరుబడిగా వ్రాయుటకును, చదువరుల కోపికగా చదివి నియమాదులయందు గౌరవముఁ జూపుటకును తగినయవకాశములు క్రమముగా క్షీణించుచున్నవి. ఇట్టిసమయములకుఁ దగినకవిత్వము సులభార్థబోధకముగాను, ఉపయోగ, వినోద,హృదయానందకరముగాను ఉండవలయును. విశేషనియమబద్ధకవిత్వమువలన నిట్టివి చేకూరుట దుర్లభము.

పూర్వ మిట్టికవిత్వ ముండెడిదేమో సంశయము. నన్నయయే యాదిమాంధ్రకవియని భ్రమించుకాలము నశించినది. నన్నెచోడాదులకు పూర్వ మిట్టికవిత్వము ప్రబలియుండెనో చెప్ప వలనుపడదు. తమిళభాషా సంపర్కమువలన పూర్వ మాంధ్రకవిత్వమున యతిప్రాసముల ప్రథ యెంతవఱ కుండెనో చెప్పఁజాలము. మహాకవు లుద్భవించి రసవత్తరముగ నియమాదులతో కవిత్వము తీరుబడిగా చెప్పుటవలన నంతకు పూర్వ మున్న యాంధ్రఫక్కి నశించియుండవచ్చును. ఏది యెట్లయినను పూర్వము లేదన్న కారణమున నిప్పు డుపయోగమగు క్రొత్తసంగతి గ్రహింపకుండుట తగవుకాదు.

ఆంగ్లేయభాషయందు ప్రాసమువంటిదే యంత్యప్రాస మొకటి మిగుల ప్రబలముగా,కవిత్వ మన్నయట్టిదియే కాఁబోలు ననునంతటి నియమ ముండెను. పేరొందిన కవీశ్వరులు సహిత మెంతో పట్టుదలతో నద్దానిని పోషించుచుండిరి. అయినను కవితోద్రేకము హెచ్చయి,రసముప్పతిలవలసినప్పుడంత్యప్రాసముకొఱకు పదములు మార్చి భావము చెఱచుట కంతటికవికైన నసహ్యముగాఁ దోఁచుచుండెను. ప్రాచీనపద్ధతులను విడువ నొల్లనివారును పండితకవులుసహితము కొంత కాల మనుసరించి రగడలయందుఁ గానవచ్చునట్టి అంత్యనియమమును విడిచిపుచ్చి ధారాప్రవాహముగా చక్కని కవిత్వము చెప్ప నారంభించిరి. ఆవలికాలములోనే యట్టినిరంకుశ కవిత్వము వృద్ధి బొంది జనసమ్మాన్యమై యిప్పటికిని గౌరవింపఁబడుచున్నది. నాగరకతఁజెంది విశేషపారస్వతమును గలిగియున్న పాశ్చాత్యభాషల యం దెద్దానియందును విశేషనియమబద్ధకవిత్వము గౌరవము గాంచలేదు. నియమపాశబద్ధులైన తెనుఁగు కవులు నిరాతంకముగా కవిత్వప్రవాహమును రసపుష్టిగా ప్రవహింపఁజేయుట మన కంతయు గర్వకారణమే యైనను, నిజముగా నిర్బంధకములైన నియమములను విడిచిపుచ్చినచో నింతకన్న హెచ్చుగ్రంథము లుత్సాహముతో మేలగునవి రచియింపఁబడియే యుండును. పద్య నియమములే కొంతవఱకు కవిత్వమున భావశూన్యతకు కారణమని చెప్పవచ్చును. కేవలనిర్దుష్టపదములతో పద్యరూపమున గ్రంథము వ్రాసి, తా నెంత శ్రమ గైకొన్నను, శ్రమ గైకొననివిధాన లోకమును మోసగింపుచు ప్రకటించుటయే కవికి మొదటి పనియై యున్నట్లు గాన్పించుచున్నది. కావున సంస్కృతభాషయందున్న కవిత్వపరిమళము తెనుఁగునఁ గానరాదు. ఎంత మనవారు ప్రగల్భముగాఁ బలికికొన్నను, మహాకవుల కవిత్వమందే యతిప్రాసలకొఱ కనవసరపు పదము లెరువుగైకొనఁ బడుట స్పష్టముగా నున్నట్లు పరిశీలించినఁ దెలియఁగలదు.

ఇంతకును కవిత్వమునకు ముఖ్యాంశము లెయ్యవియో యాలోచించి తెలిసికొనినచో పద్యనియమాదులం దంతటి మోహమును విడిచివేయవలసి వచ్చును. భాష కవిత్వమునకు శరీరమనఁదగును. అలంకారములు శరీరాలంకారములు. వాగాడంబరము వస్త్రవిశేషము లనఁజెల్లును. వాగాడంబరము హెచ్చయినచో కన్నులకు మిఱుమిట్లు గొలుపు విశేషవర్ణవస్త్రములు మాత్రమే కానుపించి సహజసౌందర్యమును మాటుపుచ్చును. ఔత్సుక్యములోఁ బల్కు భావవిశేషములు కవితాశరీరమున కంతరాత్మ. నియమములు కట్టు

బాట్లు కావున కవితావధూటికి నిర్బంధములు. ఇట్టి స్వేచ్ఛాయుగమున నెన్నికట్టుబాట్లు తగ్గియున్న నంత మేలు. అయ్యది ఆరోగ్యముగా శరీరమును పెరుగనీయవు. అందువలన కవిత్వప్రధానభావమే చెడుచున్నది.

నియమములు విడిచిపుచ్చిన కవిత్వము స్వైరిణి వలె పాడుగాదా యని మనలోఁ గొంద అడుగవచ్చును. కేవలము కట్టుబాటులచేత మాత్రమే పద్యము లనిపించు కొనునవి కవిత్వమనిపించుకొనఁ జాలవు. నియమములు విడిచినంతమాత్రముననే కవిత్వరచన సులభమని గాని, సర్వసామాన్యమని గాని చెప్పరాదు. అందున నిందున చెడు కవిత్వము పొడచూపక మానదు. నియమము లుండుటవలన విన సొంపుగా పదములు నడచునని చెప్పుదు రేమో? నియమములు లేకున్నను విన సొంపుగా గాన తుల్యముగా నుండని కవిత్వము ప్రశస్తము కానేరదు. మాటలయొక్క పొందికవలన కవిత్వము మఱింత హాయి గొల్పును. యతిప్రాసలకై మతి పోఁగొట్టుకొని, నిఘంటువుల నెన్నిటినో వెదకి వేసారి మారుమూలపద ములను నిల్పుటకన్న, నేకధారగా యతిప్రాసములను విడిచి చెప్పిన కవిత్వ మెట్లుండునో పరిశ్రమచేసి మాచె దరు గాక!

యతిప్రాసలు కుదుర్చుకొనఁజాలనివాఁడు కవిత్వ మేల విడిచిపుచ్చ రాదని కొంద అనవచ్చును. అది కవిత్వమునకును పాండిత్యమునకుఁ గల సంబంధ మెఱుఁగని మాట. పండితుఁడు పద్యముల నెన్నినియమములతో నైనను నలవాటును బట్టి యల్లివేయఁ గలఁడు. ఇది కేవలము బట్టలనేతవంటిదే గాని రసపోషకము గానేరదు. రసవిజృంభణ గల కవి పాండిత్యవిశేషమో, విశేష పాండిత్యమో యలవరచుకొనఁ జాలక నియమబద్ధుఁడై యూరక మిన్నకుండఁ జూచుచుండ వలసివచ్చును. ఈవాదము కవులకు పాండిత్యప్రకర్ష యనవసర మనువారికి మనసున కెక్కును. కవి వేరు; పండితుఁడు వేరు—అని తెలిసికొనఁజాల కున్నంతవఱకు కవిత్వమను పదమున కర్థమే లేదు. పాండిత్యము, కవిత్వము నొక్కచో నున్నంత మాత్రమున నది దోషముగా పరిగణింపఁబడదు.

ఇట్టిదే శాస్త్రములకును, కవిత్వమునకును సంబంధము. ఎన్ని శాస్త్రములు నేర్చినను కవిత్వమున కలంకారముగానే యుండును గాని, కవిత్వమునకు శాస్త్రపాండితి తప్పనిసరి కాదు. మంచిపండితుఁ డెన్ని శాస్త్రము లందు ప్రవీణుఁ డైనను, రసవత్తరకవిత్వవాసన లబ్బక పోవచ్చును. అందుచే నిర్దుష్టమగు శబ్దజాల మంతయు కొనవ్రేళ్ల నిడుకొన్నను, కవితాలతాంగి కడకంటి చూపుల ప్రసార మెుకింత తక్కువ యైనచో, వ్యాకరణవేత్త పద్దులపొత్తమువలె నా కవిత్వము చప్పగా నుండక తప్పదు.

మన తెలుఁగు పూర్వకవు లీరహస్య మెఱుంగక గణితశాస్త్రముసహితము పద్యములలో నిమిడ్చిరి. సులభముగా గణితసూత్రములు జ్ఞాపక ముంచుకొనుటకు మాత్రమే యట్టిగ్రంథము రచింపఁబడియుండుటచేత నిది యొకదోషము కానేరదు గాని, అట్టి పద్యజాలము కవిత్వమని గాని, గుణమని గాని చెప్ప వలనుపడదు.

యతిప్రాసములే కాని గణనిర్ణయము మాత్రము కట్టుబాటు కాదా యని కొందఱు ప్రశ్నింపవచ్చును. ఈప్రశ్నకు కారణము కవిత్వమనఁగా పద్యరూపప్రబంధమే యని తలంచుట గాని వేఱొండు కాదు. వచన కవులయందున్న గాంభీర్యము, కవిత్వపు సొంపులు నొకప్పుడు పద్యరచయితలయందు కానరావు. కవిత్వమనఁగా రసవిజృంభణచే నుత్పాద్యమగు నాత్మస్యమును భాషారూపమునఁ బలుకుటయే కాని, గణ యతిప్రాసలచే కట్టుబడిన భావమాత్రమే కాఁజాలదు.

యతిప్రాసనియమము లుండుటవలన పద్యము జ్ఞాపక ముంచుకొనుటకు వీలుండు ననియు, నట్లు గాకున్న జ్ఞాపకముంచుకొనుట కష్టమనియు కొందఱు దలంచుచున్నారు. యతిప్రాసములు తెనుఁగువందువలె సంస్కృతమున లేవనియే చెప్పవలెను. అట్టిసంస్కృత శ్లోకములు వేలకొలఁది జ్ఞప్తియం దుంచుకొనుచున్న మనవారికి తెలుఁగు పద్యములందుమాత్ర మీనియమముల వలన ప్రత్యేకలాభ మేమి కలదు? ఇట్టి నియమములు లేని తక్కినభాషలవారు పద్యములను జ్ఞాపకముంచు

కొనుటలో నేమి చిక్కు పడుచున్నారు? ఇంతేల, గద్య ప్రబంధములను, నాటకములను, సులువుగా నెందఱో జ్ఞాపక ముంచుకొనుచున్నారు. "మెకాలే" ప్రభువు జ్ఞాపకశక్తిగూర్చి మన మాలోచించిన యెడల నియమాదులు జ్ఞాపకశక్తికి మిక్కిలి యవసరములని చెప్పఁజాలము. గద్యప్రబంధముల నతిసులభముగా జ్ఞప్తియం దుంచుకొని చిరకాలము తరువాత సహితము జ్ఞప్తిపై తిరిగి పఠింపఁజాలిన వారిని నే నెఱుంగుదును. వేదములను తల్లక్రిందులుగాఁ జదివి యెనుబదిరెండుపన్నములను వల్లె వేయు బ్రాహ్మణోత్తములకు యతిప్రాస లక్కఱలేకపోయినవి. కావున నిట్టినియమములు మిక్కిలి కొంచెమువఱకే జ్ఞాపకమునకు సహకారులని మాత్రము చెప్పవచ్చును. ఇంచుక లాభ మున్నంతమాత్రము చేత గొప్పలాభము విడిచిపుచ్చుట సంభవించు నట్టిపని ధర్మము కాదు.

ప్రాస విడిచి పద్యము చెప్పిన బాగుండునేమో యని యెవ్వరైన నన్నచో మనసున కొకవిధముగాఁ దోఁచును గాని, సీసము, గీతము, ఆటవెలది పద్యముల యందు ప్రాసనియమ మేది? కవులు తమశక్తిఁ జూపఁదలంచు కొన్న వారు సీసములందును ప్రాసాదులు వ్రాసిన కాదనువా రెవ్వరు? పింగళి సూరనార్యుని సీసముల యందు యతులును ప్రాసయతులును కూడ సర్వసాధారణముగాఁ గనుపించును. అంతమాత్రముచేత తక్కుంగల కవు లట్లు చేయరాదని యనఁజాలము. ప్రాసాదు లక్కఱలే దనువారు సీసాదులనే వ్రాయరాదా యను వాదము సమంజసము కానేరదు. ఛందోవిషయము దెలియనివారికి రసవంత మయిన పద్యభావము నియమాదు లున్నను, లేకున్నను నొక్కతీరుననే గోచరించును. తెలిసినవారైనను ప్రత్యేకముగా యతిప్రాసలపై ధ్యాన ముంచనిదే తస్సైత్రి గోచరము కాదు. కొన్నియతులు నియమానుసారముగా నున్నవో లేదో ప్రత్యేకించి నిర్ధారణ చేసికొనవలసి యుండును. తెనుఁగున యతికి "వడి" యని పేరు. యతి సమాసమన్వయమునఁ బ్రయత్నపూర్వకముగాఁ దగిల్చి వడిగా వడి నడిపించిన వాఁడే కవి. యతిప్రాసలపై నున్న యాలోచన ప్రయత్నములు పద్యమునకు కావలసిన తక్కినవిశేషములకై వినియోగించిన, కవిత్వమున సారస్య మినుమడించును. తమంత తామే యతిప్రాసములు తమ కవిత్వమున దొరలుచున్నవని లోకమును భ్రమింపఁజేయఁ బ్రయత్నించిరియు, సాధారణకవీశ్వరులు ఏదే నొకచరణములో పాదపూరణ వ్యర్థపదములు చొప్పించుట తఱచు గాంచుచున్నాము. పేరొందిన కవులయందు సహితము వీనియములు బాధించుట పరిశ్రమ చేసి పరిశీలించు నిష్పక్షపాతబుద్ధిగలవారికి తోఁచక పోదు.

తమ కిట్టివఱకే యలవాటైన కారణమున యతిప్రాస లనాయాసముగా పాదములందు తమస్థానములలో పడుచుండుటచే ప్రత్యేకించి శ్రమ లేదని గాని, ఆ మాత్రపు పరిశ్రమ యవసరము కాని కవిత్వము సొంపుగా నుండునా యని గాని యెవ్వరైనఁ బ్రశ్నింపవచ్చును. అలవాటు చొప్పున యథాస్థాన మలంకరించిన యతిప్రాసలను బలవంతముగా మాడఁజేయుట కక్కఱలేదు. ఇట్టియలవాటు బహుశ్రమచే కలిగినదే గనుక మున్ముం దిట్టినియమ మైచ్ఛికమని యేర్పఱచుకొనిన కవుల కీయనవసరపుశ్రమ యీపాటియు నుండదు. యతిప్రాసలు యథాస్థాన మలంకరించెనో, ప్రక్కస్థాన మలంకరించెనో యను బాధయు కలిగింపదు. శ్రేష్ఠతర కవిత్వమున కిట్టినియమములు తప్పనివి గావు. అయ్యవి తొలఁగించి చెప్పిన పద్యములు చప్పిడిగా నుండునని భ్రమింపరాదు. రెండుమూఁడు ప్రాసములు గలిగి, రెండు మూఁడుయతులు గల పద్యపాదములు మఱింత సొంపుగా నుండవచ్చును. అట్టివానిని కవి తనశక్త్యనుసారము చొనిపి, కవిత్వమునకు ముఖ్యాంగమగు రసము విడిచిపుచ్చక, యింపగువిధముగా వర్ణింపఁజాలిన యెడల మఱియును మంచిది. యతిప్రాసలను బ్రయత్నపూర్వకముగాఁ దొలఁగింప నక్కఱలేదు.

గణనియమము విశేషబాధాకరము కాదు గావునను, పద్యమునకును వచనమునకు నంతమాత్రపు భేద ముండవలయును గావునను, నాయావృత్తముల గణము లట్లే యుంచిన నుంచవచ్చును. మార్చుటకు తగినంత కారణము గాన్పించునెడల గణములను సహిత మాంగ్ల మం దున్నట్లు, ఐచ్ఛికముగా నుపయోగకరముగా

మార్చవచ్చును. వచనరచనయందును పరసకవితావిశేషములు విజృంభింపవచ్చును గావున కవిత్వమునకు గణబంధ మత్యవసరమని తజ్జ్ఞులు దలంపరు.

ఇదివఱకే యింపగు కవిత్వ మల్లఁగలిగిన కవికుంజరు లీక్రొత్తపద్ధతిని మచ్చుపద్యములు వ్రాసి యా సౌఖ్య మనుభవించి వ్యర్థపదసమాససంపుటి దొలఁగింతురు గాక! గణములను మాత్రమే గలిగి, యతిప్రాసలు గిడిచిన చంపకమాలావృత్తమునకు చాంపేయమని గాని, మత్తేభమునకు మదవారణమని గాని, ఇంకేసమంజసమైన నామకరణముగాని గావింపవచ్చును. వ్రాయువారికే గాని చదువువారి కట్టియిబ్బందులు నీక్రొత్తపద్యములు కలిగింపవు. కవు లాలోచించి తగినరసోజ్జృంభకములగు పదములనే ప్రయోగించుటయందు శ్రమపడుట కలవాటు గావించుకొనిన మంచిరకపు కయితలు మున్ముందు పొలు పొందవచ్చును. (Cf. "Paradise Lost" and "Paradise Regained" by John Milton in Blank Verse.)

మనదేశభాషలయందే గాక, దేశాంతర ఖండాంతరములఁ బ్రఖ్యాతి గాంచిన తిక్కన సారస్వతములందు యతిప్రాస లంతటి దుష్కరనియమములు నిర్బంధకరముగా పద్యములయందుఁ గానరావు. ఇంతేల? రసవత్తర కావ్యమని దేశదేశములఁ బ్రఖ్యాతి వహించిన "మేఘదూత" (మేఘసందేశము)యం దిట్టినియమము లున్నవా? ఖండాంతర భాషాంతరీకరణము లెన్నిటిని గాంచినను రసోత్పాదకమగు నుత్కృష్టతరమగు నట్టి కవిత్వపుకీ లీకావ్యరాజమునం దిమిడియున్నదో యాలోచింపుఁడు! అట్లే గ్రీకు, ల్యాటిన్, ఆంగ్లేయాది భాషలయందును పద్యకవిత్వమున కఠిననియమములు ముఖ్యములు గావు. ఆయాభాషలయం దుత్కృష్టగ్రంథము లెన్నో యుండుటచే, తెనుఁగునను సుప్రసిద్ధమగు పద్యరచన కీనిర్బంధద్వయము ముఖ్యమని చెప్పఁజాలము.

యతిప్రాసలు మాత్రము ముఖ్యములు గావని విడువవలెనన్నంత మాత్రమున, మావాదము తక్కిన విషయములందును నియమరహితమని గాని, నియమాదు లక్కఱయే లేదని గాని భ్రమపడరాదు. వ్యాకరణవిషయమునను వ్యావహారిక భాషాప్రయోగమును గూర్చియు నిం దేమియుఁ బ్రశంసింపలేదు. అవి వేఱువాదములు.

నాటకములయందును, పురాణగ్రంథములయందును, నూతన భావవిలసితకవితలయందును నిట్టిక్రొత్తశక్తి మిక్కిలి యుపయోగముగా నుండునని మా తలంపు. ప్రసిద్ధకవు లీవిషయమునఁ దమకటాక్షవీక్షణముఁ బరఁగింతురుగాక! మా వ్రాఁతలయందు గుణావగుణ పరీక్షలఁ, సౌజన్యముతో నేపక్షమువారైనను న్యాయ్యమార్గమునఁ గావింతురు గాక!

---

# కైతవోపచారము

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

పెడమొగము బెట్టకుము కడు బడలిపోతి
ముమ్మరించిన రేయెండ ద్రిమ్మ తిరిగి;
తేరికొనియెద రదనకాంతి ప్రసన్న
విమలమందస్మితప్రవాహమున నీది.

పెడమొగము బెట్టకుము, తను వుడికిపోయె
నతిశయించిన మురిపెంపు టగ్గిసెగల;
పెనచికొని నీదు మృదుబాహుబిసలతికలు
నల్పుకొనియెద శైత్యోపచారవిధులఁ.

పెడమొగము బెట్టకుము, బిగి సడలిపోయె
జల్లచల్లగ జీవనసంధు లెల్ల;
కొమ్మ, కమ్మని యధరామృతమ్ము గ్రోలి
కొంత కొంతగ నవశక్తి గూర్చికొందు.

---

# ప్రవరుని హిమవద్గిరిగమనము

కొణిదెన బాలకృష్ణయ్యగారు

మనుచరిత్రము సుప్రసిద్ధాంధ్ర ప్రబంధములలో నొక్కటి. ఆధునికవిమర్శకు లందలి కవితాకళానైపుణ్యమును బలుతెఱఁగుల మెచ్చుచున్నారు. మఱి కొందఱు పండితు లం దసంగతములు గలవని సూచించి యున్నారు. అట్టి యసంగతములలో సిద్ధాగమనము, ప్రవరుని హిమవద్గిరిగమనము-లకు సంబంధించిన కాలము గుఱించినది యొక్కటి. అదియు మన కిప్పుడిచట చర్చనీయాంశము. కావున నవ్విషయము సుసంగత మగుట కెద్దేని యవకాశము మనుచరిత్రమువలన మనకు లభించునేమో విమర్శింతము.

## ప్రవరాఖ్యుని విషయము

ఇతఁడు తరుణాగ్నిహోత్రి. "నిత్యము బ్రత్యూషపవనాంకురములు పైకొనునపుడు వామనస్తుతి పఠత్వమున నిదుర లేచు" వాఁడు. ప్రాతఃకాలస్నాన సంధ్యావందనాదిక్రియల నెఱపుచుండువాఁడు. తీర్థయాత్రాపరు లెవరేని వచ్చినారని విన్నచోఁ బ్రవరుఁ డెంత దూరమేనియు నెదురేగి వారి నింటికిఁ దెచ్చి వారికి సద్భక్తి నాతిథ్య మొసంగి, యిష్టాన్నసంతృప్తులుగాఁ జేసి, వారు కూర్చుండియున్నచోఁ జేర వచ్చి, ధరయందుఁ గల వనధి పర్వత స్థితీర్థ మాహాత్మ్యములును, మార్గములును దెలిసికొని వాటినిఁ జూడఁ బోవలయునని యూర్పులు నిగుడ్చుచుండువాఁడు. ఇవ్విధమున నను దినంబును తీర్థసందర్శనాభిలాష మాతని యాత్మ నుప్పొంగుచున్నయది. ఇతనికి దేవియు దేవరయును బలె తల్లిదండ్రులును, సౌభాగ్యవరాలై భజించుచు మనసులో వర్తించు అనుకూలవతియగు భార్యయును, తోడునీడలై క్రీడించునట్టి యోగ్యులగు శిష్యులును గలరు.

## సిద్ధాగమనము

ఇటుల నభ్యాగతసేవాపరతంత్ర సఫలజీవనుఁడగు ప్రవరునింటికి ఔషధసిద్ధుఁ డొకఁ డొకనాఁటి కుతపకాలమునందుఁ జనుదెంచెను. కుతపకాల మనఁ బగటిలో నెనిమిదవ ముహూర్తము. అనఁగా నానాఁడు పగలు పదియేను, పదునాఱు గడియలకు సిద్ధుఁడు ప్రవరునింటికి వచ్చెను. అప్పటికి మధ్యాహ్నము మించినది. ప్రవరుఁ డప్పటికి మాధ్యాహ్నికమునకు సంబంధించిన యగ్నిహోత్రాది వైదిక కర్మకలాపము నంతయు నిర్వర్తించి యుండును. కావున సిద్ధున కాతిథ్య మొసంగి, యిష్టమృష్టాన్నకలన నతని సంతుష్టుని గావించెను. పదపడి సిద్ధునిఁ జేర వచ్చి తీర్థయాత్రాదిక వివరము లాతనివలనఁ దెలిసికొనఁ బ్రశ్నించి సదుత్తరములఁ బడసెను. "నన్ను నీశిష్యునిఁగా నంగీకరించి తీర్థయాత్రలవలన ధన్యాత్ముఁగాఁ జేయరా?" యని వేఁడెను. అతఁ డొకపసరది యిది యని వచింపక ప్రవరుని పాదములకు రాచెను. ఆమం దిడి యరిగెను. ఇది సిద్ధుఁడు ప్రవరునింటికి వచ్చిననాఁటి మధ్యాహ్నమునకుఁ దరువాత నడచిన వృత్తాంతము.

## హిమవత్పర్వతముమీఁది ప్రవరుఁడు

పాదలేపమహిమవలనఁ బ్రవరుఁడు మంచుకొండకుఁ బోయెను. అందందుఁ జరించెను. ఇట్లనుకొనెను: "ఈ నగమాహాత్మ్యము నెంచ బ్రహ్మకును దరము గాదు. ఇచటఁ గల చోద్యంబులు నేను దెప్ప గన్గొనియెదను గాక. నేఁడు పోయెదను. భానుకిరణతప్తము లగుచు జాఱుచున్న మంచుబిందువులు సూర్యకాంతశిలలపైఁ బడునపుడు జనించుచున్న చూత్కారములు మధ్యాహ్నమైనదని స్పష్టపఱచుచున్నవి." పాదలేపనము కరఁగిపోయినది. అది ప్రవరుఁ డెఱుఁగఁడు. ఆతని శీఘ్రగమనశక్తి నశించినది. కావునఁ దా నింటి కేఁగుటకు సదుపాయము దెల్పుపుణ్యు లెవరా యని యారయుచుఁ బ్రవరుఁడు వరూథిని యున్న స్థలమునకు విచ్చేసెను. ఆమె యతని గౌరవించి యాతిథ్యముఁ గొనఁ

ప్రార్థించెను. ప్రవరుఁ డది విని, "అండజయానా! నీసపర్యలు మాపు వచ్చినవి. నే నిట నుండరాదు. మా యూరికి నే నిపు డేగవలయును. నీయింటికి వచ్చిన నొకటి, రాకున్న మఱి యొకటియు నా? భక్తియు చాలును. సత్క్రియాకాండము దీర్పఁ జేగఁ జనవలయును. నాపైఁ గరుణింపుము" అని వరూథినిని బ్రతిమాలెను. మధ్యాహ్నమైన సూచన లగపడుచున్న వనుట— సత్క్రియాకాండము దీర్పఁ జేగఁ జనవలయు ననుట— ఈ రెండును ప్రవరుని వాక్యములే. దీనిఁబట్టి ప్రవర వరూథినీ సంభాషణము నడచిననాఁడు మధ్యాహ్నమునకు లోపలనే యతఁడు మంచుఁగొండకు వచ్చె ననుట నిర్వివాదాంశముగ నున్నది. హిమవంతమునకు వచ్చి యచటి పుణ్యస్థలములను, ప్రకృతిచిత్రములను జూచుచు యథేచ్ఛావిహారము సల్పి కొంత కాలక్షేపము జరిగిన యనంతర మాతఁడు సూర్యకాంతశిలలపైఁ బడిన మంచు బిందువుల చాత్కారములవలన మధ్యాహ్న మగుట తెలిసికొన్నట్లు వివరింపఁబడియున్నది. (మనుచరిత్రము, ద్వితీయాశ్వాసము, ౩-౧౨ పద్యములు.) కావునఁ బ్రవరుని హిమగిరి సంచార మంతయు మధ్యాహ్నమునకు లోపలనే, అనఁగా నానాఁటి యుదయముననే ప్రవర్తిల్లెనని చెప్పుటకు సంశయింపఁ బని యుండదు.

## కాలము - అవస్థాభేదము

సిద్ధ-ప్రవర, ప్రవర-వరూథినీ సంభాషణములు రెండును మధ్యాహ్నకాల మించుక యతిక్రమించిన యనంతరమునుండియుఁ బ్రవర్తిల్లెను. ఇందు మొదటిది ప్రవరుఁడు మంచుఁగొండకు వచ్చుటకుఁ బూర్వము గడచిన మధ్యాహ్నకాలమునకును, రెండవది సిద్ధశిష్యత్వమును ప్రవరుఁ డంగీకరించిన పిమ్మట వచ్చిన మధ్యాహ్నకాలమునకును సంబంధించి యున్నవి. ఇవి రెండును రెండు రోజులయందలి మధ్యాహ్నకాలములకుఁ జెంది యుండె ననుటకు మనుచరిత్రయందు సూచింపఁబడిన ప్రవరుని భిన్నావస్థలు నిదర్శనములని చెప్పఁదగును.

అరుణాస్పదపురమున సిద్ధునితోఁ బ్రసంగించి నప్పుడు:—అతిథికిఁ జక్కఁగ విందు పెట్టించినాఁడు. కావున నంతకుఁ బూర్వమే యానాఁటి యగ్నిహోత్రాదిక వైదికక్రియల నన్నిటి నిర్వర్తించి యున్నాఁడు. యతిభిక్ష యైనపిదపఁ దాను భుజించి సావకాశముగ నతనికడకుఁ జని, సంతుష్టుఁ డగు నాతనితోఁ బ్రసంగ మారంభించెను. "నేఁడు నాయిల్లు పవిత్రమయ్యెను. మాన్యుఁడ నైతిని" అనెను. సిద్ధమాహాత్మ్యమును గొండాడెను "మీపాదరజోలేశము దక్క మావంటిగేస్తుల నుద్ధరింప వేరొక మందు గలదా?" యనెను. అతఁడును గృహస్థధర్మము నగ్గించెను. తరువాతఁ బ్రవరుఁడు

కం. "......................
దేవా దేవర సమస్త తీర్థాటనమున్
గావింపుదు రిలపై నటు
గావున విభజించి యడుగఁ గౌతుక మయ్యెన్"

అని సిద్ధుని తీర్థయాత్రాసంచారమునకు సంబంధించిన ప్రశ్న వైచెను. అతఁడు దా నెఱింగినంతవట్టు వివరించెను. మరల "ఈషదంకురితహాసగ్రసిష్ణుగండయుగళుం" డగుచుఁ బ్రవరుఁ డాతని కొకవిన్నపము గావించెను. దాని కతఁడు బదులు పలికెను. ఉభయులకు నొండొరులపై విశ్వాస మంకురించెను. తుదకు సిద్ధుని

మ. "......విప్రవరుండు కౌతుకభర
వ్యగ్రాంతరంగుండు భ
క్తినిబద్ధాంజలి బంధురుండు నయి మీ
దివ్య ప్రభావం బెఱుం
గని నా ప్రల్లదముల్ సహించి మునిలో
కగ్రామణీ సత్కృపన్
నను మీ శిష్యునిఁ దీర్థయాత్రవలనన్
ధన్యాత్ముఁగాఁ జేయరే"

అని ప్రార్థించెను. ఇందువలనఁ బ్రవరుని చిత్తస్వాస్థ్యము, సంతోషము, భక్తి, తీర్థయాత్రా సందర్శన కుతూహలము ద్యోతక మగుచున్నవి. ఇది యాతని సిద్ధాగమనమునాఁటి యవస్థ.

వరూథినితోఁ దనయవస్థఁ దెలుపునప్పుడు:— "నేను ప్రవరాఖ్యుఁ డను బ్రాహ్మణుఁడను. క్రొవ్వుచేత

నీకొండకు వచ్చి త్రోవఁ దప్పితిని. నాపురమున కేగు తెరువు దెల్పుము." అని ప్రవరుఁడు వరూథినిని వేఁడెను. "మధ్యందివాతపోతమ్మహతిఁ గంది వడదాఁకి" నవదనమున బడలి యున్నాఁడు ప్రవరాఖ్యుఁడు. వరూథిని తనతోఁ బలికిన మాటలకుఁ బ్రత్యుత్తరము లీచ్చుచు- "షట్క్రియాకాండముఁ దీర్ప వేగ చనఁగా వలయు" నని దీనముగఁ బ్రార్థించినాఁడు. "మీ కసాధ్యములు లేవు. నా ప్రజలతో నన్నుఁ గూర్పు" మని మొఱపెట్టినాఁడు. ప్రయోజనము లేకపోయెను. తుదకు,

ఉ. "వేలిమియున్ సురార్చనయు
విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జన
నీజనకుల్ కడు వృద్ధు లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురు
సూచుచునుండుదు రాహితాగ్ని నేఁ
దూలు సమస్తధర్మములు
తొయ్యలి నేఁ డిలు సేరకుండినన్..."

అని వరూథినితోఁ దనయావసరములను బలికెను. ఆమెవలన సదుత్తరములను బడయలేఁడయ్యెను. ఒండొరులకు విరుద్ధభావము లంకురించినవి. తుదకుఁ బ్రవరునకు సిగ్గు, వెగటు, అందువలన నిస్పృహత కలిగినవి. ఆమె యొక్క సంప్రదాయమును నిరసించినాఁడు. నాకు "అరణులు, దర్భలు, అగ్నులు" ప్రియము లైనట్లు నేరెవ్వియుఁ బ్రియములు కావన్నాఁడు. ఆమె సాహసమునకు "ఓరమో మిసి, శ్రీహరీ" యని దైవమును స్మరించినాఁడు. ఆమె యొనర్చిన కలుషకృత్యమునఁ బ్రవరాఖ్యునకుఁ గోపము వచ్చినది. ఏవ జనించినది. తుదకు గార్హపత్యాగ్నిప్రసాదమున "ఇనుండు పశ్చిమాంభోనిధిలోనఁ గ్రుంకకయ మున్న" నిజగృహప్రవేశమును జేసి నిత్యకృత్యములఁ దీర్చుకున్నాఁడు.

వరూథినితో పల్కునప్పు డెల్లను, తన నిత్యకృత్యములు నిల్చిపోయిన వనియు, తలిదండ్రు లాఁకట నల్లాడుచుందు రనియుఁ, దా నానాఁ డిలు సేరనిచో సమస్తధర్మములు చెడుననియుఁ బ్రవరాఖ్యుఁడు వివరించియున్నాఁడు. ఇది యంతయు నాతఁడు హిమగిరిపైఁ బడిన యవస్థ. కావున, సిద్ధసంభాషణము, హిమవద్గిరిప్రయాణము రెండును రెండురోజులకుఁ జెందినవై భిన్నకాలములయందు సంఘటిల్లినట్లుగఁ బ్రకరణానుసారముగ నున్న ప్రవరుని యవస్థాభేదములు దెలుపుచున్నయవి.

ప్రవరునిపాదములకుఁ బసరు రాచినవాఁడు కుతపకాలమున సిద్ధుఁడు వచ్చినట్లు కవి వ్రాసెను. మంచుఁగొండపై మధ్యాహ్న మైనదని ప్రవరునివాక్యమున వెల్లడించుట గాక, "మధ్యందివాతపోతమ్మహతి" యని వరూథినినోటను గూడఁ బలికించియున్నాఁడు. సిద్ధుఁడు కుతపకాల మైనతరువాతఁ బ్రవరునితోఁ బ్రసంగించెను. మధ్యాహ్నకాలమునకుఁ బూర్వము మంచుఁగొండపైఁ బ్రవరుఁడు విహరించెను. మధ్యాహ్నమునకుఁ బూర్వపు కాలమునకు ఉదయ మనియుఁ, దరువాతి (కుతపకాలమునకుఁ బిమ్మటి) కాలమునకు సాయంకాల మనియు సామాన్యముగ వాడుచుందుము. ఇందువలన సిద్ధుఁడు వచ్చిననాఁడు సాయంకాలమున ప్రవరసిద్ధసంభాషణమును, వరూథినితో మాట్లాడిననాఁడు ప్రాతఃకాలముననఁ బ్రవరుఁడు హిమగిరికి వచ్చుటయు జరిగినట్లు నిశ్చయింపఁదగి యున్నది. ఇది సందర్భవిరుద్ధము కానేరదు.

## వాయుభేదము

ప్రవరుఁడు హిమగిరిపై "బదరీతరుషండమండలాంతరసరణిన్" జనుచుండ, నెదుట "పరిమళలహరీ హల్లోహలమదబంధుర మల్లధ్వను లెసఁగ" మరుదంకురములు విసరె నఁట. ప్రభాతవాతములను మరుదంకురములని ప్రయోగించుట కవిసమయసిద్ధము. ప్రవరుఁడు ప్రభాతకాలమున కచటికి వచ్చుటఁ బట్టియే మరుదంకురము లతనిపై విసరుటఁ గలిగినది ప్రవరుఁడు వరూథిని మందిరంబున కరుగునప్పటికి గాలియందలి చలువ తగ్గిపోయినది. మాధ్యందివాతపోతమ్మ మనిలుని శైత్యగుణము నపహరించినది. గాలిలో వేఁడిమి చేరినది. కావునఁ గుందనమువంటి భూసురుని మోము కందినది. ఒప్పులొలుకు వదనమునకు వడ దాఁకినది. ప్రవరుఁడు మంచుఁ

గొండకుఁ బ్రాతఃకాలమున వచ్చెనని "మరుదంకురము" లు, వరూథిని సమీపించునప్పటికి మధ్యాహ్న మైనదని "మాధ్యందినాతపోష్మహతి", ప్రవరుఁడు వరూథినితో సంభాషించి విసివి యింటికి బయలుదేఱునప్పటికిఁ బ్రొద్దు పడమటిదెసకు వ్రాలుచుండుసమయము కావచ్చెనని "ఇనుండు పశ్చిమాంభోనిధిలోనఁ గ్రుంకకయ మున్న" అను వాక్యములు సుస్పష్టముగఁ జాటుచున్న యవి.

## ఔషధశక్తి మఱునాఁటికిఁ గలదా?

ప్రవరుఁడు శ్రోత్రియుఁడు. కాలుసేతులు దఱచుగఁ గడుగుచుండువాఁడు. కావునఁ బాదలేపము మఱునాఁటిదనుక నుండునా? అని యొకసంశయము ప్రవరుని మఱునాఁటి పయనమునుగురించి జనించుచున్నది. కాని దానిఁగూడఁ బెద్దనార్యుఁడే నివర్తింపఁజేసియున్నాఁడు.

క. "అనుటయు రసలింగము నిడు
తనపట్టున ప్రేఁపసజ్జ దంతపుబరణిన్
నినిచిన యొకపస రిది యది
యని చెప్పక పూసెఁ దత్పదాంబుజయుగళిన్."
(మ. చ., ప్ర. ౭౮.)

కం. "ఆమం దిడి యతఁ డరిగెన."
(మ. చ., ప్ర. ౭౯.)

"మునిలోకగ్రామణీ! నాప్రల్లదములు సహించి మీశిష్యుఁడనగు నన్నుఁ దీర్థయాత్రవలన ధన్యాత్ముఁగాఁ జేయరే" యని ప్రవరుఁడు ప్రార్థింప నిది యది యని చెప్పక పసరును సిద్ధుఁ డాతనిపదములకుఁ బూసెను. ఇందుమూలమున దాని నుపయోగించువిధమును బ్రవరున కాతఁడు దెలిపెను. పోవునపుడు ప్రవరున కామందిడెను. ఇది పై నుదాహరించిన పద్యద్వితయమువలనఁ దెల్లమగుచున్నది. "ఇడి (దే): భక్ష్యవిశేషము; ఉంచి." "ఇడు (దే): ఇచ్చు; ఉంచు; చేయు." (శబ్దార్థ చంద్రిక, పుట ౭౩ చూడుడు.) ప్రవరుని సుగుణసంపదకు, అతని పొగడ్తకు, తీర్థయాత్రాదర్శనార్థ మాతఁడు మాపుమన్న యాతురతకు సిద్ధుఁడు చాల సంతసించి పాదలేప మను మందుయొక్క ప్రభావముచేత నే నిట్లు తిరుగుచుందు నని (చూ: ప్ర. ఆ. ౭౫–౭౬ పద్యములు) ఉపన్యసించియుండెఁ గావున నిది యని చెప్పక తాత్కాలికముగ నాతనిపాదములకు రాచి దాని నుపయోగించు పద్ధతిఁ దెలిపి, తాను పోవునపు డామం దిడి పోయెను. ఇవ్విషయమునే "హిమగిరిమాహాత్మ్యము లేపు గన్గొని రొందను గాక - నేఁ డేగెదను" అను ప్రవరుని వాక్యములు రూఢిపఱచుచున్నవి. ఔషధము తనకు లభించియుండనిచోఁ బ్రవరుఁ డంత ధైర్యముగఁ బలుకఁజాలఁడు. ప్రవరుని పదములకు సిద్ధుఁడు రాచిన పసరు పాదప్రక్షాళనాదికమువలనఁ దప్పక పోవచ్చును. పోయినను ఔషధము లభించియున్నది గావున నతనికి మఱునాఁడు బయలుదేఱ శక్తి గలదు.

## ఔషధ మున్నచోఁ గొండపైఁ జిందు లేల?

ఆనాఁ డతఁ డౌషధసత్త్వమును దెలిసికొనుటకు మాత్రము వచ్చినాఁడు (చూ: మ., ద్వి. ౧౬). తీర్థయాత్రలకుఁ బయనమై రాలేదు. ఒకసారి పాదములకు రాచుకున్న పసరుతోడనే మంచుఁగొండకుఁ బోయి మరలి యరుణాస్పదమునకు రావచ్చునని సిద్ధునియొక్క వాక్యప్రమాణము ననుసరించి పాదములకుఁ బసరు రాచుకొని బయలువెడలి వచ్చినాఁడు; చిక్కుపడినాఁడు; "నేను బుద్ధిజాడ్య జనితోన్మాదుఁడను" అని తిట్టుక తిట్టుకున్నాఁడు; అనలు ననుగ్రహమున నిలు సేరినాఁడు.

కావునఁ బ్రవరుని హిమవద్గిరిగమనవిషయమున నసంగతి యెద్దియును గోచరింపదు. పెద్దనార్యుఁ డివ్విషయమును గురించి గొడవ పెంచక తనకవిత్వకళానిపుణత సూచించుటాగునఁ బ్రకరణానుసరణముగ నాయా శబ్దప్రయోగముల మూలమున విషయమును ధ్వనింపఁజేయుచు దన చాతుర్యమును బ్రకాశింపఁ జేసియున్నాఁడు.

శాంపిల్సు ఉచితము.



## కుసుమాల్ హెయిరాయిల్ (రిజిష్టర్డు)

శిరోజములకు, మెదడికి, శాకములతో చేయబడిన సహజమైన నూనె. శిరోజబీజములను కాపాడి, మాడుపట్టును శుభ్రముగాను ఆరోగ్యముగాను ఉంచును. ఇందు చలువనిచ్చుపదార్థములు మిళితమై యుంటచే ఆలోచనాపరుల కద్వితీయముగా పనిచేయును. మంచి పరిమళము గలది.

వెల బుడ్డి 1-కి రు. 1-0-0. 3 బుడ్లు రు. 2-10-0.

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

ఉచిత శాంపిలుకొరకు ఒకఅణా స్టాంపును పోస్టేజినిమిత్తమై పంపుడు.



## కేటి వైట్ రోజ్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిష్టర్డు)

తాజా గులాబిపుష్పముల పరిమళమందు ప్రతిబింబించియున్నది. మెదటికి చలువనిచ్చును. శిరోజములకు మంచి టానిక్. వెల సీసా 1-కి 0-14-0 అణాలు.

వి. పి. చార్జీలు ప్రత్యేకము.

కొనునపుడు నెం. 777 రును గుర్తించి కేటి వైట్ రోజ్ హెయిరాయిలునే కొనుడు.

నమూనాలను అంగీకరింపకుడు.

## కేటి ఓటో రోజ్ నెం. 777 రు (రిజిష్టర్డు)



మంచి తాజా గులాబీపుష్పముల పరిమళము గల యత్తరువు. ఎక్కువకాలము వాసనపోకయుండునట్లు బాగుగా తయారుచేయబడినది. ఒకసారి పరీక్షించిన మీకే తెలియగలుగు.

వెల ¼ ఔన్సు బుడ్డి రు. 1-0-0. వి. పి ఛార్జీలు ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం రెండణాల స్టాంపులను పంపి ఉచితశాంపిలును పొందుడు.



## కామినియా స్నో

శరీరమున కుపయోగించుటకు శాస్త్రీయముగా తయారైనది. మొటిమలు, పొక్కులు, మచ్చలు మున్నగువాటిని తొలగించి, ముఖవర్చస్సులో సౌందర్యమైన నవయౌవనమును నెలకొల్పును. చర్మమును మృదువుగాను, ప్రకాశవంతముగాను చేయును. మనోహరమగు పరిమళము కూడినది.

వెల బుడ్డి 0-12-0 అణాలు. వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

పోష్ట్ ఏజంట్లు:— **ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,**

నెం. 285, జుమ్మామసీదు, తపాలాపెట్టె నెం. 2082. బొంబాయి.

శాంపిల్సు ఉచితము.

సహజమైన హెయిర్ టానిక్ తో మీ శిరోజములకు అందమును తెచ్చికొనుడు.

## కా మి ని యా నూ నె (రిజిస్టర్డు)



శిరోజములకును, మెదటికిని, యిది చాలా శ్రేష్ఠమైన నూనె. చలువ చేయు పదార్థము లంగు మిళితమై యున్నవి. కామినియానూనె మాడుపట్టును శుభ్రపఱచి, శిరోజ బీజములకు బలము నిచ్చి, వెంట్రుకలను పట్టువలె బాగుగా పెంచును. మంచి పరిమళ మిందు చేర్చబడినది. దీని నుపయోగించిన ప్రకాశవంతమగు శిరోజము లేర్పడును.

నేడే ఒకబుడ్డిని పరీక్షింపుడు. వెల బుడ్డి రు. 1-0-0, 3 బుడ్లు రు. 2-10-0.

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం ఒకఅణాస్టాంపునుపంపిన శాంపిలును ఉచితముగా బడయగలరు.

పరిమళ రాజు **ఓ టో దిల్ బ హా ర్** (రిజిస్టర్డు)


OTTO DILBAHAR.

దీనికి సాటియైనది లేదు. దీని పరిమళము యింపుగాను, ఆనందదాయకము గాను యుండును. వాసన బహుకాల ముండును. కొన్ని బొట్లు మీ చేరుమాలుమీద వేసి చూడుడు. మీ చుట్టును అద్భుతమైన పరిమళ మీనుచుండును.

వెల ¼ ఔన్సు రు. 1-4-0. 1 డ్రాము సైజు 0-12-0 అణాలు.

వి. పి. ఛార్జీ ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం రెండుఅణాల స్టాంపులను పంపి శాంపిలును ఉచితముగా పొందుడు



ఆసియాలో ప్రధాన సబ్బులు

## కామినియా టాయిలెట్ సబ్బులు

వాడుకలో పోడిమి.

ధరలో పోడిమి.

పరిమళ మానందదాయకము.

రకము అసమానము.

నానావిధ పరిమళములందును దొరకును.

కామినియా ట్రాన్సుపరెంటు గ్లిసరిన్ సబ్బు.

కామినియా లవండరు సబ్బు.

కామినియా చందన సబ్బు.

కామినియా వైట్ రోజ్ సబ్బు.

దిల్ బహార్ సబ్బు.

ఈ సబ్బులు మీకు సంపూర్ణసంతృప్తి నొసగగలవు.3 బిళ్లలుగల పెట్టె 1-కి 0-15-0. వి. పి. ఛార్జీలు ప్రత్యేకము

మీకు సమీపములోగల దుకాణములో అడుగండి లేక మాకు వ్రాయండి.

కొనునపుడు ప్రతిపెట్టెమీదను కామినియా అను పేరుండుట గమనింపుడు.

ఈపేరు స్వచ్ఛతకును, గుణమునకు గ్యారంటీ నిలచును.

సోల్ ఏజెంట్లు :—ఆంగ్లో-ఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,

నెం. 285, జుమ్మామసీదు, తపాలాపెట్టె 2082, బొంబాయి.











౨. బాలానందము

ఛాయాచిత్రకారుడు : శ్రీ ముడుంబి రామకృష్ణమాచారిగారు, పాలకొల్లు

రంగము ౧.

ఉదయము ౭ గంటలు.

[బ్రాహ్మణవీధిలో నొకయిల్లు. ఒకమూల పుస్తకములు, విడికాగితములు, అద్దము, అగ్గిపెట్టె, సిరాబుడ్డి, మాసినగుడ్డలు ఒకమేజాపై దుమ్ములో బడియుండును. పగిలిపోయిన సీసాలు, ఒక చేలాంవరు, మడతకుర్చీ, ఒకచేయి విరిగిన కొయ్యకుర్చీ అక్కడక్కడ ఆనుర్చి యుండును. సున్నము రాలుచున్న గోడలనిండ చీలలు గొట్టియుండును. ఒకచీలకు గాంధిగారి పటము. ప్రక్కనే గోవార్ధాకా పటము. ఆనుకీసముతో పట్టించుకొన్న మగవానిపట మొకగోడకు వ్రేలాడుచుండును. అద్దములు వేయని సినిమానటకుల అచ్చుబొమ్మలు అక్కడక్కడ అతికించియుండును. 'నటరాజన్' ౨౦, ౨౨ యేండ్ల గుజ్జువాడు. భుజములవరకు బడుచున్న వుంగరములు దిరిగిన వెంట్రుకలు, మెడలేని ఖద్దరుజుబ్బా, చేతిగడియారము, తోలుపట్టె, కళ్లద్దములు, వ్రేల నొకరాయి వేసిన యుంగరము, బంగారాధోవతి, మోజాలతోటి మేజాపైనుండి కొన్ని రంగుకాగితములు చేత బట్టుకొని, ముంగిలిలోనికి వచ్చి వీధివంక జూచును. వాకిట తెల్ల ముసుగువేసిన తడిసినగొడు గొకటి ముడిచి తలక్రిందులుగ నుంచబడియుండును. బయట వర్షము గురియుచుండును.]

నటరాజన్

ఇంకా చినుకులు బడుతూనే వున్నయే. (ఇంటిలోనికి జూచుచు) తాతా! గొడుగు తీసుకవెళ్లతా. నీ వెక్కడికీ పోవలసిన అవసరము లేదుగదూ! ఇప్పుడు వచ్చేస్తాలే సభవరకు వెళ్లి. కాగితాలు తడిసిపోత వేమో నని యింతా! (గొడుగు విదలించుచు తెఱువ ప్రయత్నించుచుండును.)

తాత

(లోనుండి కుంటుచు వచ్చి) పోతున్నావట్రా మళ్లీన్నీ! కలెక్టరుకన్నా తీరుబా టుంటుంది గాని నీకు లేదుగదురా. ఏమి టా చేతిలో గ్రంథాలు? తిరిగి ఆ 'గ్రంధి'గొడవేనా! నాశనమై పోవడానికి వచ్చిందిపో యీ ప్రళయం! నీకే గాకుండా, నీవల్ల యింట్లో ఆబాల గోపాలమున్నూ మిణికిపోతున్నాము, ఏపోలీసువెధవ వొస్తాడో, యేగంప దెస్తాడో నని. వయసొచ్చిన తర్వాతనే ప్రయోజనమా? కుక్కకు రాలే! జ్ఞాన ముండాలి గాని మానవజన్మవికి............

నటరాజన్

ఏమిటయ్యా నీగొడవ. తెల్లవారినప్పటినుండి గ్రంధి, గ్రంధి అంటూ ఒకటే రచ్చ. గ్రంధేమిటి? ఆమహాత్ముడి పేరు గాంధిగారయ్యా అని నూరుపర్యాయములు చెప్పుంటాను. పత్రికలు అనుదినమూ ఆద్యంతం తిరుగవేస్తుంటావు. గ్రంధి అనేవా డెవడో యిటలీదేశపుడయ్యా...అది పోనిండి. బయట వెళ్లడమంటే ఆపని మీద వెళ్లినట్లేనా. మానవుడి కింకేమీ పను లుండవు గావోసు! సభవరకు వెళ్లి యిప్పుడే వస్తా నయ్యా అంటున్నాను. మఱి మాట కొసవరకు వినవు. నీధోరణి నీది.........

[ఇంతలో నటరాజన్ తల్లి పద్మాక్షమ్మ ౫౦ యేండ్ల నల్లని విధవ, తలపైని గుడ్డ సవరించుకుంటూ లోపలితలుపు దగ్గరకు వచ్చి తొంగిచూచి]

పద్మాక్షమ్మ

నాన్నా! ఏదో పనిమీద వెడుతుంటే నీ వెంకుకు వా గ్దండించడం? నీనస వాడికి పనికివస్తుందీ? నీ వీవలికి రా. కాఫీ త్రాగుతూ త్రాగుతూవుండి యేమెమో పని వున్నట్లు లేచి వెళ్లావే జగడానికి! రా. ఇంట్లోకి రా. (కుఱ్ఱవానితో) అబ్బాయీ, నటరాజా! ఇడ్డెన వుడుకుతూంది. కుణ ముండరాదూ! కాఫీ దీసుకొని పోదువు గాని......అదేమిట్రా, అంగవస్త్ర మేదీ! అదిన్నీ, ఒకమాట చెబుతా, బయట వెళ్లేటప్పు డెప్పుడైనా సరే, తెల్ల చాదుబొట్టు ముఖాన బెట్టుకొని వెళ్లు

తూండు. దేనికైనా మంచిది...శారదా! ఇడ్డెనతె పెల దింపూ...... (వెళ్లి పోవును.)

తాత

ఆ! ఆవంశోద్ధారకుడికి సరిపోతావు నీవున్నూ, 'యథారాజా తథా ప్రజా' అన్నట్టు. (నటరాజువంక జూచుచు) పకే నాయనా! నా కెందు కీవిచార మంతాన్నూ, కలిగినవరకు దిని కృష్ణా రామా అనుకోవలసిన దినముల్లో. పో. పో. నీయిష్టం.

నటరాజన్

(ఆమాటలు వినిపించుకోనట్లే ఆకసమువంక జూచుచు గొడుగు విదలించుచుండును.)

తాత

(లోనికి పోవుచు) పొయ్యేటప్పుడు మాత్రం ఆగొడుగు యక్కడనే వుంచి పో. నే నెక్కడికైనా వెళ్లాలెనంటే దేశద్రిమ్మరిని నిన్నెక్కడ వెదుకొ్కంటూ వచ్చేది.

నటరాజన్

(కోపముతో గొడుగు విసరి యింట్లో పారవేసి) తీసుకోవయ్యా. నీ గొడుగు...మహా గొడుగు...వెధవ గొడుగు...

తాత

(తలుపు దాటుచు) వెధవ గొడుగో, మంచి గొడుగో, మనం మంచివాళ్లమైతే గొడుగేమి చేసింది...

[నటరాజన్ కోపముతో వీధివంక జూచుచు అట్లే నిలబడియుండును. వీధిలో వెనుకనుండి హనుమంతరావు వచ్చి వానిభుజముపై తట్టును. నటరాజ వులికిపడి చివాలున తిరిగి చూచి నవ్వును.]

హనుమంతరావు

ఏమిటోయ్, యింకా యింటిదగ్గరే వున్నావు. టాంటాం వెళ్లిందా వూళ్లోకి?

నటరాజన్

లేదురా యింకాను. నేను సభదగ్గరకు వెళ్లి పంపాలి. టిఫిన్ దీసుకొని వెళ్లుదామని నిలబడ్డా. వర్షం మిట్లా దాని దుంప దెంచుకుంటుందే అంటూ ఆలోచిస్తున్నా.

హనుమంతరావు

వర్షాని కేమి లేవోయ్. ఇప్పుడు పోదూ. నేనూ కాఫీహోటల్ మీదుగా సభకు వస్తా.

నటరాజన్

ఉండరాదూ. టిఫిన్ యిక్కడే తీసుకొని వెళ్దాము. ఈ శుభలేఖలు జూశావా?

[చేతిలోని కాగిత మొకటి వాని కిచ్చును. ఇరువురు ఇంటిలో తిన్నెపై గూర్చుండురు. నటరాజన్, 'దూడు నాముసీడు' అన్నట్లు హనుమంతరావువంక జూచుచుండును. హనుమంతరావు చదువుచు నవ్వుకొనుచుండును.]

నటరాజన్

ఏమిటి?

హనుమంతరావు

దర్జాగా వున్నాయ్. నీదేనా యీకపనమంతాను? (చదువును.) "ఆంధ్రలోకమున కమూల్యతరుణము. జగత్ప్రసిద్ధ నటబృందము. గంధర్వగానము. నూతనసీనులు. త్వరపడుడు, త్వరపడుడు. నేటి రాత్రి. శ్రీ స్వర్ణ అమెచ్యూర్సు, నెల్లూరుపుర సౌధమున. ఏనాటకరాజము నిరుపమానదేశభక్తిప్రదమని ఆంధ్రప్రపంచమున వన్నెకెక్కెనో, ఏ నాటకశ్రేష్ఠము పాతివ్రత్యమహిమను జాటి భరతఖండమున వాసి గనెనో, ఏ నాటకము సుమము విద్యాబోధకమని భూవలయమున పేరువడసెనో, అట్టి రూపకవధ యను నవరసభరిత నాటకమును గాంచి జీవితముల ధన్యము గావించికొండు. నాటకము నూత్న మయ్యు నటకులు నెల్లూరు ప్రేక్షకమండలికి చిరపరిచితులే. రూపకుడు-నటశ్రేష్ఠ మడతపిల్ల బలరామశాస్త్రి గారు (చేబ్రోలు). నారదుడు-గానకళాగంధర్వ నల్లూల తిట్టి సూర్యకాంతదీక్షితులు గారు (అవనిగడ్డ). శ్రీకృష్ణుడు శృంగార సరస్వతి, అభినవకృష్ణ బిరుదాంకితులు బ్రహ్మశ్రీ వదరుబోతు లక్ష్మీపతిశర్మగారు (వెంగలుతోట్టి). గోపిక-జగమెటిగిన బ్రాహ్మణులు. ఎవరు? మన పానం

బి. యె. గారు (నిజదవోలు). ఉదయమునుండి హాలువద్ద టిక్కెట్లు యివ్వబడును. స్థలము నిండినపిదప టిక్కెట్లు అమ్మబడవు. త్వరపడుడు. బీదవిద్యార్థుల సహాయార్థము.

"శ్రీ. క్రిష్ణరావు, బి. ఎ.; మ. రఘురామచౌదరి; శ్రీ. వెంకట్రామనువులు శెట్టి - సహకార్యదర్శులు. ఒ. బ్రహ్మాండం పంతులుగారు, బి. యె., బి. యల్. - ప్రెసిడెంటు."

[హనుమంతరావు చదువుచుండగా పద్మాక్షమ్మ చేతి పళ్లె మంచుకొని ప్రవేశించి ఆనందముతో విను చుండును.]

పద్మాక్షమ్మ

అబ్బాయీ! నీవట్రా అట్లా వ్రాసి అచ్చువేయించింది?

నటరాజన్

(పరీక్ష ప్యాసయిన పిల్లవానిలాగ జూస్తూ) ఇంకెవరు మరి?

పద్మాక్షమ్మ

అయితే మరి నీపే రెక్కడా వ్రాసుకోవ్వాను గాదేమిట్రా?

హనుమంతరావు

అచ్చే: వీటిల్లో వ్రాయకూడదు లెండి. గోడలపై నంటించిన పెద్ద కాగితాల్లో యెక్కడా మీ నట్రాజన్ పేరే!

పద్మాక్షమ్మ

అయితే వాడా డేమివేషం వేస్తాడు రాత్రికి?

హనుమంతరావు

నట్రాజనా! ఈనాటకంలో పెద్దవేషం వేయవన్నాడు తానే. ఏవో చిన్నవేషాలు చాలా వేస్తాడు. నాటక మంతా చిన్నవేషాలపైనే ఆధారపడి వుంటుంది మరి. చిన్నపాత్రలవారు సమర్థులుగా వుంటే పెద్దవారెంత పాడుజేసినా కమ్ముతుంది. అందుకనే మే మంతా చిన్నచిన్న వేషాలు వేయడం.

[శారద, పదియేండ్ల బాలిక, పాత్రతో కాఫీ దెచ్చును.]

శారద

ఏమిట్రా! అన్నయ్యా! డ్రామా! నా కొక టిక్కట్టు. పోయినసారిగూడ యివ్వలే. ఈసారి యివ్వకుంటేనా— ...... అమ్మా! నీవు చెప్పే, వూరకే వుంటావు చింతమాని లాగా. (అనుచు అమ్మను కొట్టుచు చిందులు ద్రొక్కుచు, ఏడ్పుట నభినయించును.)

పద్మాక్షమ్మ

తెచ్చివ్వరా పాపం, దాని కొక టిక్కట్టు. ఇంక రాత్రంతా పోరుపెట్టుంది.

నటరాజన్

చూదాములే, పోండి. లేరా, హనుమంతరావు. వాన తగ్గినట్లుంది.

[వెళ్లి పోదురు]

శారద

(గుమ్మములో) టిక్కట్ టిక్కట్. అన్నయ్యా, టిక్కట్రో.

[తెర పడును]

---

రంగము ౨.

ఉదయము 8-30 గం.

[బ్రాహ్మణఅగ్రహారములో నొకయిల్లు. ముందరింటి తలుపు సగము తెఱచియుండును. బయట వర్షము గురియుచుండును. వర్ధనమ్మ, ఇరువది నాలుగేండ్లది కూర్చుని గుమ్మడికాయ తఱుగుచుండును. తులశమ్మ ముప్పదియేండ్ల బ్రాహ్మణస్త్రీ, ప్రక్క యింటినుండి వచ్చి చాపపై గోడ కానుకొని కూర్చుండి రవిక గుట్టుకొనుచుండును. ఇరువురు సంభాషించుచుందురు. గోడకు చీలలకట్టిన తలగుడ్డ, చేతికఱ్ఱ, గీఱలకోటు తగిలించి యుండును. పేము కొంత పీకిన పెద్ద సోపాకుర్చీ యుండును.]

వర్ధనమ్మ

మనష్టంసారంగొడవ యెప్పటికి వుండేదే గాని. అదేమిటో తులశమ్మా, నాకుమాత్రం నాటకమంటే

పార్యోత్ప్రాణం లేచివస్తుంది. ఊర్లో నాటకమంటే నాకు యింట్లో పండుగలా గుంటుంది. ఏకారణం చేత నన్నా వెళ్లకుంటే ఆరాత్రల్లా నిద్ర బట్టితే ఒట్టు. నా అవస్థ పరమాత్మ కెఱుకగా వుంటుంది.

తులశమ్మ

మావారు వూర్లో వుండేటట్లయితే నన్ను తప్పకుండా తీసుకెళ్లుకుంటారు. వారికి డ్రామా లంటే బహుసర్దా. సాధారణంగా ఫ్రీటిక్కెట్లు వస్తుంటవి లెండి. అయినా ఆయన ఊర్లో వుండేది అరుదు. వారు లేనిదే మన మేమిటి నాటకాలకు వెళ్లడమని సహాము, ఇంట్లో ముసలిదాని పోరు సహాముతో నేను అప్రయత్నమే మానుకుంటున్నా.

వర్ధనమ్మ

ఒక్కొక్క నాటకము యెంతసొగసుగా వుంటుం దబ్బా. చెన్నపట్నంలో ఒకమాటు సావిత్రినాటకానికి మావారు, నేనుకూడా వెళ్లి ప్రక్క ప్రక్కన్నే కుర్చీలపైన కూర్చున్నాము. అక్కడ యీలాగ లేదు తులశమ్మా! భార్యాభర్తలు వుంటే నాటకాలకి చేతులు చేతులు లంకె వేసుకొని పరాసరి వెళ్లిపోవడమే. ఆ సావిత్రినాటకములో సావిత్రిభర్త అడవిలో చచ్చిపోయినప్పుడు పాటపాడుతూ యముడివెంట పోతుంది. రాగమాలిక. అబ్బా! యేమిపాటమ్మా అది. గ్రామఫోనులో గూడ వుంది.

తులశమ్మ

ఈనాటకాలకంటే మావూర్లో మేము పిల్లలముగా వుండేటప్పుడు జాతరకు కూచిపూడివాండ్లను పిలిపించారు. భాగవతికత్తుగా ఆడ్తారు నాటకాలు. కాని యేమి అభినయ మమ్మా. వాడిదుంప దెగ, బొంతలాంటి వయసు మీరినవా డొకడు, సీతవేషంవేసి నాట్యమాడుతాడు. అబ్బా! జింకపిల్లలాగ యెగురుతాడమ్మా వాడు.

వర్ధనమ్మ

సీతవేష మంటే జ్ఞాపకమొచ్చింది. తెనాలిలో ఒకసారి సంపూర్ణ రామాయణ మాడుతుండివారు. తొమ్మిదిగంటలకు మొదలెత్తె సూర్యోదయ మయింది మంగళం పాడేవరకు. ఆనాటకంలో ఒకకుఱ్ఱవాడు. వాడి పేరు మాపంతులుగారి పేరే. సీతవేషం వేసి అశోకవనంలో కూర్చుని విచారపడుతుంటే, ఆహా, వాడి ముఖవర్చస్సు! మన మెందుకుపనికివస్తాము వాడిముందు! పచ్చిభోగముదే వాడి అభినయమున్నూ, పాడున్నూ. పచ్చ బుటాలు చీర కట్టుకొని, సామాన్యమైన వాయిలు జాకెటే తొడుగుకొన్నాడు. మరెక్కడ నేర్చాడో తులశమ్మా, ఆచీర కట్టేతీరే వేరమ్మా. ఎంత తంటాలు బడ్డా మనకు రాదు. మరల అనుదినము చీరలు గట్టుకొంటుంటాము గదా!

తులశమ్మ

నాకు దుఃఖమైన నాటకాలకు వెళ్లితే ఒకటే ఏడుపు. ఒకమాటు హరిశ్చంద్రనాటకంలో చంద్రమతి లోహితుడి శవాన్ని దహనంజేస్తూ శృంగారముగా పాడుతోంది. నా కదేమిటో కడుపులోనుంచి పుట్టుకవచ్చింది, పాడుయేడుపు. నేను వెక్కి వెక్కి యేడుస్తుంటే నన్ను జూచి అందరూ నవ్వడమే. మావారికి కోపం వచ్చి చక్కా లేచిపొయ్యారు. నేను నాటకమైన తర్వాత పొరుగింటి వారితోగూడ వచ్చాను. రాత్రంతా చీవాట్లు పెట్టారు.

[వీధిలో బ్యాండు, తప్పెటలు మ్రోగును.]

తులశమ్మ

అన్నట్లు మఱచినా నమ్మా! రాత్రికి అద్భుతమైన నాటకమట. చూడనిజన్మ మెందు కంటూన్నారందరూ. మొన్న వెళ్లినాటకము మెత్తుకొన్నట్టే వుండింది గాని యిదేమో ఆశ్చర్యంగా జెప్పుకొంటున్నారే, వర్ధనం.

వర్ధనమ్మ

(కూఱ తఱుగుట నాపి) రాత్రికా! ఏమాట?

తులశమ్మ

ఏమిటో...'రూపకవధ' అట. క్రొత్తనాటక

వర్ధనమ్మ

రూపకవధా!...రూపకవధ. నిజంగానే! క్రొత్తదేమి. నేను పోయినసంవత్సరం బెజవాడలో జూశా.

అప్పుడు మావా రక్కడ ఇనస్పెక్టరుగా వుండేవారు. అబ్బా! చెప్ప శక్యమా ఆఆట. చూచితీరాలి. రాత్రి కేనా? ఎట్లన్నా పోవాలి. తులశమ్మా! ఆకృష్ణుడివేష మేసి, పేరు మరచినా, ఎవరో శర్మగారో శాస్త్రిల్లో... పాడుతాడు-అబ్బా అబ్బా, అది వినవిజన్మ మెందుకే! సరే గోపికవేషంమాట అట్లుండనియి గదా. వెళ్లాలమ్మా: నే నెట్లయినా వెళ్లతా. మావారు వచ్చినా సరే, రాకున్నా సరే. ఆయన రారులే, ఆఫీసునుంచి వచ్చి 'ఏం బాగలే దంటూ పడుకొంటారు. తొమ్మిదిన్నర గంటలకా. పెందలాడ్నే భోంచేసి వెడతాము. నీవు రావూ?

తులశమ్మ

రావల్ననే ప్రాణ మల్లాడుతోంది. ఏమి జేసేది. మాయింట్లో ముసలి విధవ గోడ పెట్టుంటే! ఆయనైనా ఊళ్లో వుంటే నెమ్మదిగా చెప్పి వొప్పించికోవచ్చు. ఈముసలిదానికి చావైనా రాదు. ఏమైనా గాని, ఈ వేళ గట్టిగా పట్టు బడుతా. ఏమైనా వాగిందంటే నోరు మూసేటట్టు గొట్టా. ఎక్కడికి వెళ్లాల్నన్నా ఆపేసుగ రొకటే పోరమ్మా. మాల మాదిగ పోరు. నా కెక్కడ దాపురమైందో. సందులోకి వెళ్లి వచ్చేసరికి నాలుగు మార్లు తొంగిచూస్తుంది కిటికీలలోనుండి. ఎవరితో మాట్లాడినా తప్పేనట. ఇప్పటికే నసనసలాడుతోంటుంది. ...అదిగో...వస్తున్నట్లుగా వుంది.

[వాకిటనుండి నారాయణరావు, వర్ధనమ్మభర్త, ధుమధుమలాడుచు ప్రవేశించును.]

నారాయణరావు

ఏమి టింకా తెలుక్కొంటూ కూచున్నావు-తొమ్మిదిగంట లై లేను. ఆఫీసుతనిఖీ ప్రాణం దీస్తోంది. త్వరగా కచ్చేరికి వెళ్లాలె నంటే నీ కొకటే ప్రసంగాలతో సరిపోతుంది, పుణ్యకాలం కాస్తాన్ను.

తులశమ్మ

(మెల్లగా జరిగి జరిగి వెళ్లిపోవును.)

వర్ధనమ్మ

తెల్లవార నక్కర లేదండీ. మరీ ఆగడము మీది, కచ్చేరి కచ్చేరి అని. ఒకటే కచ్చేరి.

నారాయణరావు

అఘోరించావులే. త్వరగా కానీ...అమ్మాయి యేదే వర్ధనం?

వర్ధనమ్మ

అదో! తొట్లో బనుకొని నిద్రబోతోంది. దానికేమో వొళ్లు నిమ్మళంగా లేదు. కుమకుమలాడుతోంది. లేకుంటే యింతసేపు నిద్రబోదు గానీ!

నారాయణరావు

(లోనికి బోయి కూతురిని చంకబెట్టుకొని ముద్దిడుతూ వచ్చి)నాన్నా; నాన్నా: శశిలేఖా; నమగన్నా: అమ్మను దన్నే కాలేది?

శశిలేఖ

(ఏడ్చును.)

వర్ధనమ్మ

దాని నెందు కిప్పుడు లేవదీసింది? వంట గావలెనంటారా. దా న్నొకదాన్ని లేపారు. ఎట్లా జచ్చేది నేను?

నారాయణరావు

వంట వల్లకాడయిందిలేవే. దీన్ని దీసుకో. నే నెక్కడయినా హోటల్లో భోంచేసి పోతాలే.

వర్ధనమ్మ

ఏమంత గ్రహచారం? ఏమిటండీ మీమాటలు, సరసమైంది విరసమైంది కూడా తెలియకుండా మాటాడుతారు.

నారాయణరావు

(నవ్వుచు బిడ్డమిషమీద తల్లిని ముద్దిడుకొని) తెలిసిందా సరసమో విరసమో?

వర్ధనమ్మ

(చెంప తుడిచికుంటూ) సరే గాని, ఏమండో, రాత్రికి నాటకమట. రూపకవధ. మంచినాటకం. తప్పకుండ వెళ్లాలిసుమండీ. పెందలకడ్నే రండి. ఏం?

నారాయణరావు

(కొంచెము కోపముతో) ఏడ్చావులే. ఈవెధవ ప్రసంగాలకుమాత్రము తయారు. ముప్పైయేండ్లు నెత్తికి వస్తున్నా నాటకాలు, ఆటలే గాని, బిడ్డలు—పాపలు—సంసారం—మంచి—చెడుగు ఇంతవరకు మనసుకు రావడంలేదు, పాడుజన్మానికి.

వర్ధనమ్మ

మీ కేమైన అనండి. రాత్రికి వెళ్లాలి, తీరాలి. అంతమంచినాటకమట.

నారాయణరావు

ఎక్కడికైనా వెళ్లు. నన్నెందు కడగడం? నీవన్నీ నన్నడిగే చేస్తున్నావా యేమిటి? ఆబిడ్డలకోసం పట్టుకొని ప్రాకులాడుతున్నానే గాని లేకుంటే నీప్రవర్తనమంతా నాకు తెలియదూ?

వర్ధనమ్మ

(కోపముతో గట్టిగ) ఏమి నా ప్రవర్తనం? ఏమైనా నామీద పల్లెత్తుమాట విన్నారా? ఇట్లాంటి ఆగడపుమాటలు మీకే తగునండీ. ఏమో 'నాటకానికి వెళుదామండీ సరదాగాను' అంటే పెద్దపెద్దవ్యవహారాలు తెచ్చిపెడ్తున్నారే, ఏమో మహాప్రవర్తన మంటున్నా. ప్రవర్తనమట ప్రవర్తనం. మీప్రవర్తనానికి సరిపోలేదు గావోసు.

నారాయణరావు

మన ప్రవర్తనాలు తగులబడ్డవిగాని, ఉండి గానీ, పోవాలి. నాకు నాటకాలకి రావడానికి వీలు లేదు, చావను వీలు లేదు.

వర్ధనమ్మ

మీరు రాకుంటే నేను తులశమ్మతో గూడ వెడుతానులెండి. ఏమి దినమ్మా వెళ్లుతుంటావూ?

నారాయణరావు

వెళ్లు వెళ్లు. నీయిష్టము వచ్చినవాళ్ల వెంబడి వెళ్లు...అయ్యంగారి పెండ్లాని కైనగతి తెలుసు గదూ. నీకూ ఆదుర్గతి బట్టడానికే యిట్లా చెడుబుద్ధులు బుడుతున్నాయి. నేనేమో వెనకా ముందూ ఆలోచించే వాడిని గాదు. ఎరుగుదువు గదూ!

వర్ధనమ్మ

ఏమిటి, వాతలు వేస్తారా? ఎందుచేత? నాటకానికి వెళ్లితే తప్పా? నలుగురు పెద్దమనుష్యులతో చెపుదాము రండి.

నారాయణరావు

ఇప్పుడే యెందుకు పెద్దమనుష్యులు, చిన్నమనుష్యులున్నూ? ఆపని జరిగినతర్వాత సాక్ష్యాలకు, సంబంధాలకు వారే రారూ! నీకేమో నాచేత......

[తులశమ్మ అత్తగారు ఆగ్రహముతో ప్రవేశిస్తుంది.]

అత్త

ఏమమ్మా! వర్ధనమ్మా! ఏమిటో మంచి పేరుగనీ, బ్రాహ్మణులనీ, ఉద్యోగస్థులనీ యిక్కడ కాపురం చేరితే, దాని కెందుకమ్మా యిట్లాంటి చెడబుద్ధులు నేర్పి పంపుతున్నావు? మీవారితో చెప్పేదటమ్మా. ఏమండీ, కంపినీలకు వెళ్లాలని మాయింట్లో కోతిని ఈవర్ధనమ్మ గీరి పంపిందండీ. అది దయ్యంబట్టినలాగా పాత్రలన్నీ విసరి విసరి కొట్టోంది. మా అబ్బాయి వూళ్లో లేడు. ఇట్లాంటప్పు డేమి నాటకాలండీ....అమ్మా వర్ధనమ్మా, మీకిది మర్యాద గాదమ్మా......

వర్ధనమ్మ

(బిడ్డను తొట్టిలో బండబెట్టి వచ్చి) ఏమిటమ్మా తగవుకు వచ్చినావే? ఏమి నీకోడలు పసిబిడ్డా...

నారాయణరావు

ఛీ! మాయి నోరు. సిగ్గుమాలినదానా. (అనుచు కఱ్ఱతో ప్రక్కలు విఱుగ గొట్టుచుండును.)

వర్ధనమ్మ

చూచారు గదో: ఎట్లా కొడ్తున్నారో నిష్కారణంగా...(యేడ్చుచుండును.)

తులశమ్మ

[తులశమ్మ ప్రవేశిస్తుంది.] (ముసలిదానితో) బుద్ధి గాలినదానా. రా, రా. (అంటూ నెట్టుకొని పోవును.)

[బిడ్డ లేచి యేడ్చుచుండును.]

[తెర జారును.]

---

## రంగము 3.

ఉదయం ౧౦-౩౦ గం.

[వర్షము హెచ్చుచుండును. బ్రాహ్మణ సందు. కృష్ణరావుగారింటి వసారాలో గారవేసిన అరుగుపైన కృష్ణరావు, బనీను వేసికొని, ఒకచేతి మడచిన టెలి గ్రాము కాగితము, మరొకచేత కాలుచున్న సిగరెటు బట్టుకొని 'ఆలి గోల్పడినవానిక్రియ' గూర్చొని యుండును నటరాజన్ వర్షములో పరుగెత్తుచు తడిసివచ్చును.]

నటరాజన్

ఏమిటి కిష్టూ: అట్లా గూర్చొనివున్నావ్? బ్యాండు తెప్పెట్లు వూర్లోకి పంపాను. మతి టైము యింది. ఫైనల్ రిహార్సల్సు ఒకమారు చూచుకోవడం మేలుగదా. నోటీసు వ్రాసి పంపావా, యాక్టర్సు కందరికిన్నీ? పైనుండి వచ్చేవా రంతా ౧౨-౩౦ ప్యాసింజరుకు వస్తారు. వారికి రిహార్సల్సు అవసరము లేదులే. మనచెనవ లందర్నీ గూర్చి ఒకమాటు వొద్దికలు జూచుకుంటే కాని వీలుపడదు. పంతులుగారుగూడ ఆమాటే అన్నారు. పన్నెండు గంటలకి అందర్నీ సభలో మీట్ గమ్మన్నారు. వారుగూడ తీరుకజూచుకొని వస్తారట.

కృష్ణరావు

(పరధ్యానములోనుండి కొంతసేపటికి) ఒకే నట్రాజా! రిహార్సల్సు ఎట్లున్నా జేసికొందాము గాని యీ టెలిగ్రాము జూశావా?

నటరాజన్

ఏమిటైనా కొంప మునిగిందా యేమిటి? (కాగితము విప్పి చదువును.) "వయార్, హార్ట్ బ్రడ్స్, ఇమ్మిడియట్ లీ, అదర్ వైస్, స్టార్టింగ్, ఇంపాజిబిల్, కమింగ్, కార్, యీవినింగ్, ఫోర్, యిక్స్పైడైట్, పావం." అయితే యిప్పుడు డబ్బంపితే సాయంకాలం కారులో వస్తా డన్నమాట. ఒరే, నీ వేమన్నా అను. ఈపెద్ద గాడిదకొడుకులంత రాస్కల్సు మరెక్కడా వుండరురా.

కృష్ణరావు

ఆమాటలవల్ల యిప్పు డేమిట్రా ప్రయోజనం? రాస్కల్సో, గీస్కల్సో; ఇప్పుడు రూపాయలు పంపితే రాత్రికి ఆట, లేకుంటే లేదు. అదీ పర్యవసానము.

నటరాజన్

డ్యామిట్. ఆపక్కిరి వస్తే వచ్చినట్లు, లేకుంటే ఆట మానుకోవడమేంటి. వాడు లేకుంటే నేను వేస్తాను గోపిక వేషం.

కృష్ణరావు

పార్టు?

నటరాజన్

పార్టేమిటి? వాడి నాటకమంతా కంఠగతం. ఏవేషానికైనా తయార్.

కృష్ణరావు

అది సరేరా. పావంగాడు రాలేదు. నీవు గోపిక వేస్తున్నా వంటే నల్లులత్తివా డఘోరిస్తాడు. ఆసలు వేషం వేయడు. వారి దంతా ఒక బ్రదర్ హుడ్.

నటరాజన్

అట్లయితే మరేమిటి దారి? (కొంత ఆలోచించి) కిష్టూ కిష్టూ! మనవాణ్ణి బట్టుకొందాం, గోపాలాచారిని. వాడికి పార్టంతా వచ్చు. వాడంటే అభిమానంచేత వదగువాయివాడు గూడ సరే నంటాడు. ఏమంటావ్, ఐడియా!

కృష్ణరావు

బాగానే వుంది. ఆచారిగాడు యెట్లయినా నిగ్గించుకొంటాడు గాని వాడి నెక్కడ పడుదామబ్బా! ఏ సారాయిగిడ్డంగిలోనో, సానిదాని కొంపలోనో నే వాడిముఖాన్ని...... లేదోయ్, వాడు నాలుగువాళ్లనుండి ఆస్పత్రిలోనే వున్నాడట, నిన్న యెవరో అన్నారు.

కాలు చేయి పడిపోయిందట ఆయనకి. ఏమిటో రోగాల తుక్కు.

నటరాజన్

ఆ ఆశా పోయింనీ, యెట్లా మరి? పోనీ, డబ్బు పంపుతామా?

కృష్ణరావు

అంతకన్నా మంచిమార్గం లేదు గాని, మరి మనీ యెట్ల జిక్కుతుందా అనేది ప్రాబ్లం! నా కింటి దగ్గిర కొంచం కష్టంగా వుందిరా. మొన్న యేదో సభకు హార్మోనియం పంపానని "షి రెఫ్యూజ్డు టుకుక్". నావల్ల కాదు పొమ్మన్నది. తర్వాత యేమి చేశా నను కొన్నావు. స్వయంపాకం ఆరంభించాను. పదకొండు ఘంట లైంది. స్కూలిక్కి కాస్త లేటయింది. పిల్ల వెధవర్ది ఒకటే రచ్చ. హెడ్మాస్టరు యెగిరిపడ్డాడు. ఆవాడు యింటిదగ్గర యేదో అరచానని అది యేడుస్తూ బడుకొన్నది. అప్పటినుండి మాట్లాడడంలేదు. ఒకే యేడుపు. ఈసందర్భములో జూవెల్ యెదైనా కావలె నంటే అగ్నిహోత్రంమీద నూనె పోసినట్టు. నాచేత దమ్మిడీ లేదు. మాస్కూలుజీతాలు యెన్నిసెల్ల కొక మాటు వచ్చేది లోకవిదితమే గదా!

నటరాజన్

పోనీ పంతు ల్నడుగుదామా? తెల్లవారే కలెక్షన్లలో యిచ్చేద్దా మంటాం.

కృష్ణరావు

నీకు తెలియదు గాని, ఆయనవ్యవహారం మన కంటే మిసరబిల్ గా వుంది. మొన్న మద్రాసుకు వెళ్లడానికి చేతిలో ఏమీ లేక లాబుక్ సు అమ్ముకొన్నాడట. అయితే గౌరవస్తుడు గనుక యెవరికి తెలియలేదు గాని యిట్లానే రెండుసెల లుంటే ఆయనగూడ గోల్డు స్టాండర్డు తీయవలసినవాడే.

నటరాజన్

ఆ పంతు లేమిటోయ్ దివాలా తీయడం? అతడు కావల్నంటే మూరురూపాయలు లేవూ!

కృష్ణరావు

నీకు తెలియదు రా అబ్బాయ్. పంతులికి ౧౦౦ రూపాయ లిస్తే యిప్పుడు నీ కూడికను చేస్తాడు కుటుంబ సమేతంగానున్నూ. వారి అవస్థ నీ కెట్లా తెలుస్తుంది?

నటరాజన్

అయితే శెట్టిగా ణ్ణడుగుదామా? వాడిపేరు సెక్రటరీల్లో చేర్చాముగా.

కృష్ణరావు

వాడా, కోమిటి బిడ్డ పేరు అచ్చు గొట్టినందుకు నాలుగో అయిదో అయితే యేమో గాని నూర సేటుప్పటికి పేరు గొట్టివేయ మంటాడు. అసలు వాడిపేరు ఆఖరులో వేశామని వాడికి కుళ్లు.

నటరాజన్

అయితే యెట్లాగోయ్; లై మయిపోతూందే.

కృష్ణరావు

నీ వడగడం జూస్తే సీతాన్వేషణ మరిగే హనుమంతుడి ముఖం వ్రేలవేసినలా గుంది. నీవు రెస్పాన్సిబిలిటీ ఫీల్ జేసి, కావలె నన కొంటే వెధవ నూరు రూపాయలు లేవట్రా! నీ వన్నట్టు రాత్రికే వసూలుడబ్బులో తీసుకోకూడదూ?

నటరాజన్

ముసలాడు చాల గడుపో డవుతున్నాడోయ్. అతడిదగ్గిర యింపాజిబిల్. మరి మామసర్ దగ్గిర క్యాష్ వుండదు.

కృష్ణరావు

క్యాష్ లేకుంటే యేదైనా నగ పెడితే క్యాష్ రాదటోయ్. ఏమి తెలియని పిల్లవాడిలాగ అడుగుతున్నావే. నేను నా వైఫు మంచిటెర్ముసలో వుంటే యింత చిక్కు వుండదు. దాని పతకమో గాసులో ఎప్పుడో అద్దుపెట్టిఉండేవాణ్ణి. మరి మనకార్యంసాగాలి గదా?

నటరాజన్

మా మదర్‌కి జూవెల్ సంగతి చెబితే యేడుస్తుంటుందోయ్. అసలు యివ్వదు.

[ఇంటిలోనుండి కృష్ణరావుకొడుకు ౬ యేండ్ల పిల్లవాడు తొంగిచూచును.]

పిల్లవాడు

నాన్నా, మళ్లా పోదాలతోటి పోసున్నా! మామ్మతో చెప్తా వుండు.

కృష్ణరావు

(నవ్వి) వెధవా, పో. వ్రాసుకోలా అంటే వ్యవహారాల కొచ్చావ్. ఏదిరా వెళ్తవు.

[పిల్లవాడు పరుగెత్తి పోవును.]

(నటరాజన్‌తో) అది గాదురా, ఈపురాణమంతా మదర్‌తో చెప్పడ మేమిటి? వేషానికి నగనావాళ్లని పట్టుకరా. అది తాకట్టుబెట్టి నేను అయిదు నిమిషాల్లో మనీ దెస్తాను. తెల్లవారే నగదెచ్చి మీ మదర్‌కు అప్పజెప్పు. నొణగకుండా ఆమె కొకటికెక్కటివ్వరాదూ. నావద్దనే వుండాలి.

నటరాజన్

మంచివుపాయం బన్నావురా కిష్టా. యుగంధరుడిలాంటివాడివి అదే ప్లాన్. వెళ్లి ఒక్క ట్రయల్ వేస్తా. (నాలుగడుగులు నడచి మరల వచ్చి) కిష్టా, పత్రికలకు క్రిటిసిజం యేలాగురా. ఆమాటే మరచిపోయ్యామే.

కృష్ణరావు

ఏమిట్రా. నే నంత ఆలోచన మాలినవాడ ననుకొన్నావా? ఉదయాన్నే వ్రాసేశాను. నాటక మాతుండగనే పంపుతాను, లోకల్ పేపర్సుకి.

నటరాజన్

ఎట్లా వ్రాశా వేమిటి? ఏదీ, ఏదీ.

కృష్ణరావు

చూపుతానులేరా, నీ కెందుకు. అంతా ఆలోచించే వ్రాశానులే. నీవిషయం బాగా ఘాటుగా తెగిలించా. అదిమాత్రం చదువుతా వుండు. (లోనికి బోయి కాగితములు దెచ్చి చదువును.) విను. "శ్రీయుత సరసపాటి నటరాజన్ గారి యభినయచాతుర్యము ప్రేక్షకవర్గము నానందవార్ధి నోలలాడించె ననుటలో నేమియు నతిశయోక్తి యుండజాలదు. వారి గానమాధుర్యము శ్రోతల కమృతధారాప్రవాహమువలె శాంతి నొల్పుచుండెను. పిట్ట కొంచెమయ్యు కూత ఘన మను నార్యోక్తిని స్పష్టపరచుచుండెను. ఇట్టి సుప్రసిద్ధనటకుల నింకను ఆంధ్రలోకము సన్మానింపకుండుట శోచనీయము. నాటకాభిమానుల యభినందనములకు వీ రెంతయు తగుదురని నిస్సంశయముగ మనవిచేయుచున్నాను." చాలదూ?

[నటరాజన్ వేడ్కతో వినుచుండును.]

నటరాజన్

బేశా వే నీయిష్టం వచ్చినట్లు. అయితే కిష్టా, క్రింద నే రేమి వేశావురా?

కృష్ణరావు

'ఒక కళాభిమాని' అన్నాను. సరేనా?

నటరాజన్

శేవ్! అయితే నాటక మాతుండగానే పంపేస్తానన్నమాటే. త్వరగా పంపెయ్. ఇంకొకమాటరో. మీలంబుడు వూళ్లో వున్నాడు గావాలె. దుంప దెంచడు గదా!

కృష్ణరావు

ఉంటే నేం? అతడు రాడులేరా నాటకానికి. వచ్చినా, మన క్రిటిసిజం రేపే పేపర్సుకి వెళ్లిపోతుంది గా. తర్వాత అతడు వ్రాయడు.

నటరాజన్

అయినా ఒకటికెక్కటు పంపరాదూ?

కృష్ణరావు

ప్రయోజనం లేదు. రెఫ్యూట్ చేస్తాడు. ఎందుకూ? నీ కెందుకు, నీవు త్వరగా వెళ్లి రారా. టి. యం. వో. పంపివేయి. ఒరే! వర్ష మొస్తావుంది. గొడుగిదిగో పట్టకెళ్లు. [తెర పడును.]

---

రంగము ౪.

మధ్యాహ్నము ౧ గం.

[సభ యిల్లు. పాడుబడిన ట్లుండును. చుట్టిన పర్దాలు. రంగు, బంకకలిపిన మూకుళ్లు, కుంచెలు అక్కడక్కడ పడియుండును. పెద్దరంగుకాగితాలపై "శ్రీ స్వర్ణ అమెచ్యూర్సభ," "రూపకవర్ధ" అని, "'మదత పిల్ల', 'వదురువాయి', 'పానం', 'నటరాజన్', 'మాస్టర్ లింగం'" అని పెద్ద అక్షరములతో గీచి యుండును. కాగితములు చిందరవందరగ పడియుండును. చినిగిపోయిన ఈతాకుచాపలు, తుంగచాపలు ఇంటినిండ పరచియుండును. గోడల ప్రక్కను నాటకాల ప్రక్క పరదాలు బోరగిల ద్రిప్పి ఆనించియుండును. చాపల నిండుగ ఆర్పి పారవేసిన బీడీముక్కలు, సిగరెట్టుముక్కలు పడియుండును. బక్కచిక్కినవా డొకడు పైని కువాల గప్పుకొని ఒకగంగు కాగితముపై 'నేటిరాత్రి నేటిరాత్రి.' అని నిమ్మళముగ వ్రాయుచుండును. మఱొకడు పరదాచుట్టలమధ్య పండుకొని గుఱకపెట్టుచుండును. ఇద్దరు చీట్లపేక ఆడుచుందురు. చెంచు రామయ్య అనువా డొకడు నోటినిండ తాంబూలము, పొగాకు వేసికొని గోడలప్రక్కను వుమ్మివేయుచు గొంతు తడవికొనుచు, భాగవతార్లవలె మాట్లాడుచు మధ్యమధ్య కూనరాగములు వడకించుచుండును. మధ్య భాగములో ఒక త్రొక్కుడుహార్మోనియం, తబలా బొచ్చులు వుండును......హార్మోనిష్టు వెంకట సుబ్బయ్య ప్రవేశించి సిగరెటు కాల్చుకొని హార్మోనియం విప్పి శ్రుతిపెట్టుచుండును. తబ్లా ఖాజామియా వెనుకనే వచ్చుచు చీట్లాడువారిలో ఒకరికి సలాము చేసి, రెండవ వానిని నవ్వుచూ కాలితో తట్టి క్రింద గూర్చొని హార్మోనియం బూరుగకు తబలాశ్రుతి సరిపోవునట్లు చేతితోను, సుత్తెతోను త్రిప్పిత్రిప్పి కొట్టుచుండును.]

చెంచురామయ్య

(పొగాకు బుగ్గకు ద్రోసి కొంచెము మెడ పైకెత్తి) వచ్చారే, చూశావ్. మన మగధీరులంతా ప్యాసింజరుకు. పానంగాడు మాత్రం సాయంకాలము వస్తాడట.

హార్మోనిష్టు

వాడు పక్కాపని చేశాడు. అట్లాంటివాళ్లది కాలం. మఱి నాకు డబ్బిచ్చేటప్పుడు చూడు ఏమి కల్లోల మవుతుందో. ఉండ్లే సామెత, 'మ్రొక్కేవాడికా మొత్తేవాడికా వర మిచ్చే'దని.

చెంచురామయ్య

బాగా చెప్పావు......మన కెందుకులే, ఆ గొడవ. వెంకటసుబ్బయ్యా, నాపద్యాలు వాయించు. తోడి, నాలుగు.

హార్మోనిష్టు

నాలుగున్నర వేసుకోరాదూ? లక్షణంగా పాడు తావే.

చెంచురామయ్య

పెట్టు చూదాము. పైస్థాయి అందుకోలేనేమో నని భయంగా వుంది. అయినా కానీ.

(పద్యము)—

మోహము మోహరించె సతి!
మొల్ల సుగంధిరో తాళజాలనే
మోహము నిల్వదాయె కడు
ముక్కరమారుడు బాణజాలముల్
దేహము ప్రుక్కగా మిగుల
తీవ్రత నేసెను భామ! చూడవే
యూహాపకీరుడౌ ముగ్ధుడు
నచ్ఛత మొప్పగ మూర్ఛ గూర్చెనే.

(పాట—చరణము)—

ఎంత కఠినహృదయమైన కలుగదె యీప్రార్థనమున
చాలా, యీదీనుని మొఱ వినవా
ఇటు మోసగింప తగవా
ఇక చాలు రమ్మ మగువా.

(—పల్లవి)

కాంతా, నిను గానక జగ మంతా
వెదకితి నిక చింతా
భర మాపజాల కుంతా.

(—అనుపల్లవి)

కారడవుల గ్రుమ్మరితి, కొండగుహల దిరుగాడితి.

[ఇంతలో ఏడెనిమండుగురు సభ్యులు ప్రవేశింతురు. నటరాజక్ కృష్ణరావుగూడ వారిలో నుందురు.]

కృష్ణరావు

పాట లుండనిచ్చి రిహార్సల్సు జరపండోయ్. అంద రున్నారా? ఎవరైనా కొావా? చిల్లరసీను లన్నీ జరపండి త్వరత్వరగా. (అందరిని పారజూచి) మూడవసీనుకు అంద రున్నారు. ముందు అది కానివ్వండి.

[సభ్యులు గోడల కానుకొని కూర్చొందురు.]

కృష్ణరావు

(చేత పుస్తకము బట్టుకొని కాగితేములు ద్రిప్పుచు) ప్రారంభించండి మూడవసీను. చెంచురామయ్యా, నీవేగా వసంతుడు మల్లికార్జునం, లేవోయ్. పెండ్లి కూతురిలాగా కూర్చుంటే యెట్ల? పార్టు వచ్చుగదా? (వెనుకకు దిరిగి చూచి) పంతు లొస్తున్న ట్లుంది. ప్రారంభించండి.

[బ్రహ్మాండం పంతులుగారు, మఱొక వయసు మీరిన బ్రాహ్మణుడు (కవి) ప్రవేశింతురు. కొందరు వారికి నమస్కరింతురు. కొందరు చూడన ట్లభినయింతురు.]

కృష్ణరావు

ఒరే, కుర్చీ, కుర్చీ.

బ్రహ్మాండంపంతులు

అక్కరలేదు, అక్కరలేదు. (చాపపై గూర్చుందురు. కవి యనుసరించును.) (చెంచురామయ్యతో) నీదేమి పోర్షనయ్యా?

చెంచురామయ్య

వసంతుడు సార్.

బ్రహ్మాండంపంతులు

(మల్లికార్జునంతో) మీ దేమి పోర్షనబ్బాయ్.

మల్లికార్జునుడు

'కళాధ్వంసి' అండీ. సెకండ్ హీరోయిన్.

బ్రహ్మాండంపంతులు

మీసీను రిహార్సు చేస్తున్నారా? కానివ్వండి. (కవిదిక్కు జూచి) దీక్షితులవారుగూడ వున్నారు. ఏమైనా సజెషన్సు యిస్తారు. ఒరే కృష్ణరావు, ఏమి టీసీను?

కృష్ణరావు

(పుస్తకమునుండి చదువును) "రూపకునికడనుండి వచ్చిన వసంతుడు కళాధ్వంసిని గానక కాఱడవుల వెదకుచు విలపించుచుండును. దైవవశమున కళాధ్వంసియు అయ్యెడనే గ్రుమ్మరుచు ప్రాణనాయకుని తలపుచే వగల బొగలుచుండును. దుఃఖరసము."

బ్రహ్మాండంపంతులు

మంచిదే. ఇక కానివ్వండి.

చెంచురామయ్య

(పైకి జూచుచు) "కటకటా! దైవమా! నీ కేల కరుణ గలుగదు. నీది హృదయమా, పాషాణమా? నీవు దీనపోషకుడవని చెప్పగా వింటి. అది నిక్కమేని ఆర్తుడనగు నాచింత బాప నిది సమయము." (కడుపు బట్టుకొని) "అక్కటా! నే డంతయు ఆకలిదప్పు లనక నా యనుంగుప్రాణేశ్వరి కళాధ్వంసి జాడ గానక వెదకి వెదకి వేసరితి. నే నేమి సేయుదు? యెవరి శరణు జొత్తు? నా కవ్వ రిక దిక్కు! యెటుల దొలగు నీ చిక్కు! యేరాకుసులదో యీటక్కు..." (హార్మోనిష్టువంక జూచి తల ఎగురవేయుచు) ముఖారి, రెండున్నర.

బ్రహ్మాండంపంతులు

మాటల ఉచ్చారణ యింకా దీనంగా వుండవలెనయ్యా. పెద్దగా కూడ జెప్పాలి. ఆడియన్సు కందరికి వినబడొద్దూ మరి? ఎంతసేపైనా ఆడియన్సును జూస్తూ జెప్పు. వెదుకుతున్న ట్లభినయిస్తున్నా వాళకు వీపు జూపించగూడదు.

చెంచురామయ్య

చిత్తం. (మరల) "కటకటా......యీటక్కు." ముఖారి, అఠ.

కవి

చక్కగా వున్నది. శేష్.

బ్రహ్మాండంపంతులు

(తా నేదో చేసినట్లు అందరివంక సగర్వముగా జూచును.)

చెంచురామయ్య

(పద్యం)—

"ఏలా చిక్కులు పెట్టె దీయడవిలో,
యేలే నమస్ జూడవే,
ఏలే నాయకి పిల్చినా బలుకవే,
యేలే కృపన్ జూడవే,
ఏలే తాలిమి బట్టజాల, సరసం
బెందాక నీ వాడెదే,
ఏలే దూరపథశ్రమాగతుని న
న్నిక్లేశల గారించెదే."

(కన్నులు మూసికొని) "హృదయేశ్వరీ: ఈ యంధకారమున దారి సహిత మగపడదు. నే నెందు బోదు. ని న్నెందు వెదకుదు."

[మల్లికార్జునము వేరొకవంకనుండి ప్రవేశించిన ట్లభినయించును.]

చెంచురామయ్య

(వానిని జూడనట్లే) "కోమలీ! కోమలాతి కోమలము లగు నీ బాహువు లీముండ్లచెట్ల రాపిడిచే నెంత కందెనో! లేజిగుళ్లవంటి నీ పదపద్మము లీకటికరాళ్ల నెట్లొత్తువా లైనో! ఆకట నెంత డస్సెనో నీ తనులత! అక్కటా! హతవిధీ! ఎంతెనారి కట్టిపాటు చేకూర్చితివి!" (గొంతు సవరించుకొని) కేదారగౌళ. శ్రుతి తగ్గించు.

(పద్యం)—

"కట్టిడిదైవమా! యెటుల
గారియ పెట్టితి పట్టికోమలిన్
గుట్టెన కన్ను, చెంపపయి
గొట్టెనె తన్మహిమాతిరేకముల్
జెట్టలు లేరె నీ చెనటి
చేష్టల కగ్గము గాగ నిప్పిరో
దిట్టవు మొండికట్టియవు,
దిట్టులకే యొడిగట్టె దెప్పుడుగా."

కవి

ఈ పద్యం ప్రతాపరుద్రీయంలోది గదబ్బాయ్.

చెంచురామయ్య

చిత్తం, అవునండీ. పైపద్యంగూడ యేదో ఒక గ్రంథంలోదే.

కృష్ణరావు

ఈనాటకములో వసంతుడి పార్టుకు పద్యాలు లేవుంటే, సంగీతజ్ఞాన ముండేవాడు గనుక సందర్భానుసారంగా పద్యాలు వేసుకొన్నాడు లెండి.

కవి

సరే. సరే. కానివ్వండి.

చెంచురామయ్య

"ప్రాణేశ్వరీ! ఈబాధ దుర్భరము. నే నాత్మహత్య గావించుకొందును."

మల్లికార్జునుడు

(సన్నగొంతుతో) "హృదయేశ్వరా, నీముద్దుమొగ మొకమాటు నాకు జూప నింత యలుకా? అయ్యో! వలదని ప్రార్థించితినే. ఎంత చెప్పినను, తుదకు పదము లంటి వేడినను, నామొర నరకుసేయక యాకతి నాత్మరూపకుకడ కేల యరుగవలసె! అక్కటా, ఇప్పు డేమైతివో గదా! ఓవృక్షములారా! నాపతిని నాకు జూపుడు." (చెంచురామయ్యవంక దప్ప తక్కిన అన్ని దిక్కుల గిఱ్ఱుగిఱ్ఱున దిరుగుచు) "ఓ భల్లూకములారా! మా వసంతుని నా కొసంగుడు. ఓసింహశార్దూలములారా! నావల్లభునిజాడ నా కెఱింగింపుడు. ఓగిరులారా! కరులారా! హరులారా! ముసలారా! నాజీవేశ్వరుని, నాపెన్నిధానమును, నాబంగరుకొండను, నా రతనంపురాశిని నాకు జూపుడు. అహో! చంద్రుడుదయించుచున్నాడు..............."

కృష్ణరావు

(పుస్తకమువంక జూచుచుండి) నిలువు. నిలువు. వసంతుడిమాట లున్నాయ్. "నాకు జూపుడు" అన్న తర్వాత నీ వాగాలి.

మల్లికార్జునుడు

మూర్ఛిల్ల వద్దటయ్యా ?

కృష్ణరావు

తర్వాత లే. వాడిది కానియ్. వాడు మూర్ఛిల్లిన తర్వాత నీవు మూర్ఛిల్లాలి. నీవు రా చెంచురామయ్యా!

చెంచురామయ్య

(పాట)—

"ఎంతకఠినహృదయమైన కరుగదె యీ ప్రార్థనమున" (అనుపాటను పాడి)

"ప్రేయసీ, కళాధ్వంసీ! మోహితులై నీ సౌందర్యమును గాంచిన యేదేవతలు నిను గొంపోయిరో. ఏదానవులు నిన్చెరబట్టిరో. ఏమానవులు తపములు మాని నీవెన్న దవిలిరో! సముద్రుడు నిను గాంచి విస్మితుడై తనచెంతకు జేర్చుకొనెనో! లేక ఈ వనలక్ష్మియే నిన్ననుంగుచెచ్చెలిగ గొనియెనో! ఏల పలుకవు? ఏల ఓ యనవు? నా ప్రాణమా: నా జీవమా. హా. కళా." (అనుచు మెమ్మదిగ మోకాళ్లపై గూర్చుండి పరుండును.)

బ్రహ్మాండంపంతులు

అట్లా గా దబ్బాయ్. న్యాచురల్గా వుండాలి. ఒక్కమాటుగా పడాలి.

చెంచురామయ్య

(తల యెత్తి) స్టేజిపైని పడ్తా లెండి. ఇక్కడేమో భయంగా వుంది.

కృష్ణరావు

భయమంటే యెట్లా ? ఇప్పుడే వాడుక గావాలి.

చెంచురామయ్య

(లేచి గబాలున పడి తల తడవికొనుచుండును.)

మల్లికార్జునుడు

"అహో: చంద్రుడుదయించుచున్నాడు. ఓ చకోరమిత్రా!

(పద్యం)—

రాజీవాప్తుల నేచు పాతకివి చం
　ద్రా రాజవా నీవు నీ
రాజత్వంబున చక్రము ల్మనియెనో,
　రంజిల్ల సత్సంతతుల్
తేజం బందెనో, డిందెనో యసీథమో
　ద్రేకంబు, లా జెల్ల రే
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే
　రాజౌట దోషార్థమే.

ఈ మదనబాణజ్వాలలవేడిమి కిక నోర్వజాలను. హృదయేశ్వరా, వసంతా! ఆహా! వాడుగో మావసంతుడు! వచ్చితివా! వచ్చితివా! ప్రియా, మోహనాంగా, వచ్చితివా! చేతులు జాపి వచ్చితివా! వికటముగా నవ్వుచు వచ్చితివా! వెఱ్ఱిచూపులు జూచుచు వచ్చితివా! క్రిందబడి వచ్చితివా!"

కృష్ణరావు

ఒరే! ఒరే! ఒరే! స్టాప్. 'చేతులు జాపి,' 'వికటముగా నవ్వుచు,' 'వెఱ్ఱిచూపులు జూచుచు,' 'క్రిందపడి' అనేమాటలు బ్రాకెట్సులో వున్నాయోయ్. అవి చెప్పగూడదు. నీవు అలా చాపాలి, వెఱ్ఱిచూపులు చూడాలి, నవ్వాలి, క్రింద బడాలి. అంతే.

మల్లికార్జునుడు

మరి నాపార్టులో బ్రాకెట్సు లేవే.

కృష్ణరావు

పొరబాటేమో. దిద్దుకో. మరల చేయాలి ఆసీను.

చెంచురామయ్య

(సంతోషముతో హీరోయినియంవంక జూచి) మొదటిపద్యం, తోడి, నాలుగున్నర.

బ్రహ్మాండంపంతులు

పద్యా లెందుకు లెండి. టైము లేదు. నడవనివ్వండి సీను వెంబడి సీను.

మల్లికార్జునుడు

నే నక్కడైనా పాట పాడుతూ వెళ్లిపోతా నండీ 'నమస్తే' లాంటిది. క్రింద పడాల్నంటే యిద్దరికీ స్థలము చాలదు. అదిగాక నాకేమో భయంగావుందండీ.

నటరాజన్

స్టేజిలో పడితే దెబ్బ తగలదురా మల్లీ!

మల్లికార్జునరావు

నీ మొంగం, నీవు పడు.

కృష్ణరావు

నెక్స్టు సీన్. అక్కడ వురుస్తుంది. వెంకట సుబ్బయ్యా! హార్మోనియం ఆతట్టుకు బట్టు.

[తెర పడును.] (సశేషము.)

---

అక్కరకు రాని వస్తువును విడువజాలక

# మొఘల్ సామ్రాజ్యపతనము

జనమంచి వెంకటరామయ్యాగారు

౧

భారతవర్షమా! సకలభాగ్యనిధానమ! సర్వశాస్త్రవి
ద్యారమణీయధామమ! సమస్తకళావిభవాభిరామమా!
పరహితైకచింత గల పావనధార్మిక జీవనంబు చే
కూరుచు నాత్మశాంతి యెదఁ గోరెడి నాదగు మాతృదేశమా!

కూరిమి నీదుబిడ్డ లొగిఁ గ్రోలిన వెన్కను పాలబీదలౌ
చేరువయిండ్లపిల్లలకుఁ జేఁపితి వేయమృతంబు జీవనా
ధారము గాఁగ నయ్యది కృతఘ్నుల కయ్యె విషమ్మె యమ్మరో!
క్రూరులు నీదు చన్గుడిచి రొమ్మునె గ్రుద్దుచు నున్కి చూడఁగా.

చేరిచె మీఁదిచేటు మదిఁ జేరిచి చూడక, "వర్తకంబు, వ్యా
పార మొనర్తు మే" మనుచు వంగి సలాములు సేయు నుబ్బి, ద
ర్బారుగ పాదుసా నిజనివాసగృహంబున నోడదొంగలం—
జేరిచె నంత నీసిరియుఁ జెల్వును జేవయు లావు గంగనే.

౨

మంత్రము తంత్రమున్ హితసమాచరణప్రవణత్వమందు స
త్యరతము గుప్తమై యొదుఁగ, యంత్రబలంబును దోడు గాఁగ, సం
చింతితవాంఛితంబుల భుజించుటకై తఱి వేచియుండి ర
శ్రాంత మినావసానము శ్మశానసృగాలములట్ల కోరుచున్.

ఎఱుఁగరు నీదుబిడ్డ లిది యెల్లఁ బరస్పర నాశనోద్యమ
స్ఫురదసిజాలదీప్తి, మెఱుపుల్ బలెఁ గన్నులఁ గొల్ప మిర్మిటుల్,
మఱియును మందు గుండ్ల పొగమబ్బును గ్రమ్మ, ఫిరంగిబొబ్బలం
జొరకయుఁ బోవ సాధుహితసూచకవాచక మేమియుం జెవిన్.

నీడకయి పోరి ఫలముఁ బోనాడుకొన్న - వెఱ్ఱులే వైరి నీకన్న కొడుకులు మఱి
నీదు పెంపుడుకొడుకులున్ వాదు లాడి - భేదమే లేనిదానికై భేదబుద్ధి.....

ఒకతండ్రిబిడ్డ లయి, నీ-వొకతల్లివి చన్ను గుడిపి యోమఁగ సుఖ ముం
డక యకట! విమతు లయి, చం-పుకొనఁ దొడఁగి రొండొరులను మొకమోడకరే.

3

వ్రాలెను బాదుషా ముసలిపండయి, యాతనితోనె నేలపైఁ
గూలెను బావుటా, మును పకుంఠిత తేజుఁడు బాబ రెత్తఁగా
నోలిని మేటియక్బరు, గుణోన్నతుఁ డౌ మనుమండు షాజహా
నేలుచు దేని నింకఁ బయి కెత్తిరొ, యెయ్యది మేరుశృంగముం
బోలెఁ బ్రణామపాత్ర మయి పొల్చెనొ సర్వదిగీశకోటికిన్.

వ్రాలె నినుండు; రాష్ట్రము నరాజకమున్ బహునాయకంబు నై
వ్రీలెను; జిమ్మచీఁకటులపిండులు వోలె మరాటిదండులున్,
మూలలనుండి సిఖ్ఖులును, మూఁకలు గూడిన రోహిలాలు, సి
ద్దీలును రాజపుత్రులును, దేశము నొక్కట ముంపఁజొచ్చి రు
ద్వేలమహాసముద్రమటు, భీషణఘోషణ ముప్పతిల్లఁగాఁ;
బాలుగొనన్ ముఘల్ బలుదివాణపు దోఁపుడు పంపకంబునం,
గూలినగొడ్డుపైఁ గవియు క్రూరపురాఁబులుఁగుంగముల్ బలెన్.

వచ్చిరి యాంగిలేయు లటుపైని పరాసులు బుడ్తకీసులున్
వచ్చిరి డచ్చివారు, తమ వర్తకరక్షకుఁ గత్తి యెత్తుచుం
జొచ్చిరి విప్లవంబున "యశోధనలాభము రాజ్యలాభమున్
వచ్చు 'వరాలచెట్టు' దులుపం బయిపెచ్చుగ" నంచు నెంచుచున్.

వచ్చి, రొక్క-క్రియయె ద్వ్యర్థసంపాదకం-బయ్యె, మూఁడు ప్రావు లాఱు కాయ
లయ్యె, * ముందు చూతు మదియాట జనని! నీ - మేలుకొఱకు వారిమేలుకొఱకు.

౪

వ్రక్కలు చెక్కలై చెదరఁ బాఱిన యా మొగలాయి రాజ్యమం
దెక్కడఁ గన్న సంచలన మెక్కడ విన్న బలప్రశంసలే,
ఒక్కెడ నాశలన్ జెలఁగి యొక్కెడ భీతిఁ గలంగఁ బాఱె తాఁ
బెక్కు తెఱంగు లయ్యెఁ బ్రభువీరులచిత్తము తత్తఱించుచున్.

---

* కృతికర్త ముందు వ్రాయఁదలఁచుకొన్న "బ్రిటిష్‌సామ్రాజ్యవైభవము"లో నని యెఱుంగునది.

పుడమి చలించునట్లుగను బుట్టిన విప్లవమందుఁ గోటలన్
గడబిడ పుట్టెఁ గాని యొకగాసియుఁ జెందవు పేదవారి వౌ
గుడిసెలు, పెద్దగాలికిని గూలుఁ దలెత్తిన పెద్దమ్రాఁకు లే,
అడఁగి మడంగి యుండెడి తృణాదుల కెప్డదు నేమమే కదా!

అరిగాఁపులము గాము సరివారమే యంచుఁ గప్పంబు లెగఁబెట్టఁ గడఁగువారు
తమతండ్రి సింహాసనము నధిష్ఠింపంగ నన్యానుమతి యేల యనెడివారు
సరిహద్దురాజ్యాల బరవసంబున నాక్రమించి మించఁ దలంచి మిడుకువారు
రాజ్యార్హు లుండ నర్హత లేమి యెఱిఁగి రాజ్యంబు సంపాదింప నరయువారు
ప్రాఁతపగలు దీర్ప వాంఛించు వారును - గ్రొత్తసఖ్యములను గోరువారు
నగుచు ననుసరించి రాంగిలేయ పరాసు - ముఖ్యు లయిన శ్వేతముఖుల, దొరలు.

ఏనిక లందలాలు మఱి యెత్తగు నుత్తమఘోటకంబులున్
మానికముల్ సువర్ణములు మంచియమూల్యము లైన హారముల్
కానిక లిచ్చి యాదొరలఁ గానఁగ వచ్చెద రీదొరల్ కడుం
బూనికతో నభీష్టపరిపూర్తిని గీర్తి నపేక్ష సేయుచున్.

అడిగిన రేవులందుఁ దమయంగడిసాలలఁ గట్టనిచ్చి, త
మ్మడుగక సుంకముల్, సరకు లమ్ముకొనంగ ననుజ్ఞ యిచ్చి, తా
మొడఁబడి వారికై నలుపుయుద్ధపుఖర్చులు చెల్ల జాఘిరీ
లెడపక యిచ్చి, యిట్లు తము నెంతయు భూవిభు లాదరింపఁగన్.

పెరిఁగె వర్తకంబు, పెరిఁగెను రాజ్యంబు - పెరిఁగె సేన, రెండుఁ బెరుఁగుచుండ
నొకటి కొకటి సాయ మొనరింప నవి మూఁడు - నన్న దేహబలము లట్లు పెరిఁగె.

౫

హైదరు విక్రమించి మహిషాసురరాజ్యము నాక్రమించి, తాఁ
గాదని యెంత లెంతలను గర్వమునన్ విహరించుచుండ, నా
మీఁద మరాటు లెత్తి తనమీఁదికి వచ్చుచునుండ, హైదరా
బాదునిజాము నేరె నిరపాయసుఖస్థితి కాంగిలేయులన్.

మును పరిగాఁపులైన రసపుత్రులు ఢిల్లిని ద్రోసిరా జనన్,
"వెనుకటియట్ల కప్పములు పెట్టఁడు, చెల్లున వెల్ల మాకె" యం
చును మొన లెత్తి వచ్చి, తము శూరులు మేటిమరాటినాయకుల్
చెనకిన మిత్రమండలిగఁ జేరిరి వారును నాంగిలేయులన్.

# "క్రిస్మస్ వేడుకలు"

కోమట్రాజు వినాయకరావుగారు

౧

ఎళుంబూరులో వున్న "కలవల కన్నన్‌చెట్టి" గారి సత్రం, చెన్నపట్నానికొచ్చే పొరుగూరిజనములలో చాలమందికి ఆశ్రయ మివ్వడానికి చాలేటంత విశాలంగా నిర్మితమై యుండటంవల్ల, మద్రాసులో చాలా పేరుమ్రోగిన సత్రమనే చెప్పవచ్చు! అందులో "క్రిస్మస్" సెలవులు; 'పార్కు-ఫెయిర్'; నాటకాలు, సర్కసులు, బయస్కోపులు, యింకా ఏవేవో చెప్పరానన్ని చిల్లరవినోదాలతోను వేడుకలతోను వెల్లువెత్తిపొర్లేరోజులు కూడా నివి! ఎక్కడెక్కడి జనం యీవేడుకల్ని చూద్దామనే ఉబలాటంతో వొచ్చిపడతారీవారంరోజులూ. అసలే ఆరులక్షలజనసంఖ్యతో తహతహలాడుతున్న చెన్నపట్నం, యీవారంరోజులూ ఎక్కడెక్కడి జనం వొచ్చిపడటంవల్ల మరింత 'గడబిడ'తో నిండి 'గజిబిజి'గా నుండ ఆరంభించింది. అందులో తెలుగుదేశస్థులకు యిక లెక్కే లేదు! సత్రమంతా తెనుగుమయం! తెనుగురాజ్యం! కమ్మ, వెలమ, రెడ్డి, కోమటి మొదలైన అనేకకులస్థులతో కిటకిటలాడుతోంది సత్రం.

సత్రంలో ఒకచిన్న టిక్కీలో కమ్మ సూరమ్మా, కమ్మ ఈరయ్యా చాపమీద కూర్చుని కులాసాగా ప్రసంగిస్తున్నారేమిటో.

"నాయుడుగారు బలే మంచిమనిషల్లే ఉన్నాడు బావా!"

"దేముడుమల్లే మనకు ప్రాప్తమయ్యాడే—నిజంగా! అతనికడుపు చల్లగాను! 'సత్రం మేనేజరు'తో ఇంగిలీసు మాట్లాడి పదిహేనురోజులదాకా యీ 'టిక్కీ' నిప్పించాడు."

"అసలు మూడురోజులకంటే ఉంటానికీడ వీల్లేదంటగా?"

"జానే పిల్లా! నేను సెప్పిం దేమిటే? రామయ్య నాయుడు 'సిఫారస్' చేసి ఇప్పించాడు కొట్టు. డాక్టర్ దొరతో కబుర్లు చెప్పి ఆదొరోర్ని బుట్టలో వేసుకొన్నాడు; బుట్టలో వేసుకొన్నాడు కాబట్టే అంత దబ్బున్నే మీ అత్తమ్మను 'కన్నాసుపత్రి'లో చేర్చుకున్నారు! దేముడిమల్లే ప్రాప్తమయ్యాడు పాపం!"

"సర్లే కాని బావా! వేడుక లెప్పుడూ సూడటం? వొచ్చి అప్పుడే అయిదారోజు లయిందన్నమాటే—! అత్తమ్మకు బువ్వ తీసుకపోవడంలో తెల్లారుతోంది బతుకు!"

"ఎందుకో యింత కోపం? పిల్లా! తీసుకెళ్తాను గా—ఓపికపట్టలే వింకొంచెం?"

"ఇదంతా తెలుస్తే వొచ్చేదాన్నే కాదు; ముమ్మాటికీ! ఏదో 'సంబరాలు' చూద్దామనేనా వొచ్చింది? కొట్లో యీడ మురుగుదామంటూనా?"

"చాల్లే పిల్లా! అట్టే కోబ్బడకు!" అన్నాడు, ముప్పయిఅయిదేండ్ల ఈరయ్య, సూరమ్మ పాలబుగ్గల ఒకటిరెండుసార్లు నవ్వుతూ పట్టి పిండి.

"చాలు బావా! మోటసర్సా" అన్నది భార్య సూరమ్మ కస్సున, కెంపుబారి కొద్దిగా ఉబికిన బుగ్గల్ని చేత్తో తడుముకుంటూ. అంతట్లోకే యెవ్వరో యింకో మనిషి ఆకొట్టుద్వారందగ్గిర నిల్చుని మహా పరిచయం ఉన్నవాడిలాగా పలకరించాడు దంపతుల్ని.

"ఓహో తమరా! కూకోండి బాబూ!" అన్నాడు ఈరయ్య; ఓమాటు కన్నెత్తింది సూరమ్మ. ఆచూపులో ఆశ్చర్యం, భయం, సంకోచం, అమాంకత్వం, అన్నీ యిమిడి ఉన్నాయి; 'నిజంగా నాయుడుగారు నవమన్మథు డబ్బా!' అన్నాయా అన్నట్టు పింఛినై సూరమ్మకండ్లలోని తళతళలూ, మిలమిలలూ రామయ్యనాయుడు డొక్క-చిరునవ్వుతో చతికిలబడ్డాడు.

రామయ్యనాయుడు అరవ్వాడూ కాదు, యిటు తెనుగువాడూ కాదు! నాయుడుగారికి అరవం బాగా తెలుసు; తెలుగూ తెలుసు! ఐతే మొత్తంమీద తెనుగులక్షణాలు తక్కువ; ముప్పాతికముప్వీసం అరవ లక్షణాలే ఉట్టిపడుతున్నాయి, నాయుడుమొహం, జుట్టూ, బొట్టూ, కట్టూబట్టీ చూస్తే! సన్నని పాల 'గ్లాస్గో'మల్లు గూడకట్టుక్రింద చుట్టుకున్నాడు; నీలపు 'సర్జి'కోటు తొడుక్కున్నాడు. తల కిరువైపులా గొఱ్ఱెపొట్టేళ్ళ కొమ్ములమల్లే క్రాపు రెండు పాయలుగా చీలింది. తీర్చినట్టూ ముక్కు; ఎప్పుడూ నవ్వుతూన్న కండ్లు; చక్కని అంతగా ముదరని మొహం; చేతులో బుల్లి బంగారు 'రిస్టు'వాచి! నోట్లో యేవేళా సిగరేటూ! మొత్తంమీద నవమన్మథుని అవతారం మల్లే కనిపించాడు రామయ్యనాయుడు, సూరమ్మకళ్ళల్లో! కళ్లు వాల్చింది; తల వంచుకుంది సూరమ్మ.

"పార్కువేడికై యెప్పుడుదా చూడబోతారు దా?"

"ఔను, నాయుడుగారూ! మాకూ చూడా లంటూనే ఉంది; ఐతే అమ్మకోసం మనసులో వొకే సీకులాట!"

"అదే! ఎందుకుదా భయందా? పెద్దడాక్టర్‌తో చేస్దా చెప్తినే? పైత్యకారుగా ఉండావే!"

"ఎబ్బెబ్బే! అది గాదండీ నాయుడుగారూ! తమరిసాయ్యం మరుస్తామా — ఋణాన్నిబోసూ మరుస్తే! అట్టాగే పోదాం! సూరమ్మకూ సూపించాల్లెండి; ఊరుకోదు సూపియ్యకపోతే. ఏమంటావే పిల్లా? సాయంకాలంగా పోదాం" అని ముగించాడు ఈరయ్య, పెండ్లికూతురికిమల్లే సిగ్గులు చిందుతూన్న సూరమ్మ వదనబింబానికేసి చూస్తు. సూరమ్మ మారు మాట్లాళ్లే; మూతి బిగించి శిరస్సాంచింది.

"నాకు వేళై వుంది; పోవాలా! ఈదినం నాల్గుగంటకి వేడికై సూడ వూడుస్తా" మంటూ నాయుడు చాపమీదనుంచి లేచి నిల్చుని గడపదాకా వెళ్ళి, ఏకో అడిగేందుకు మరిచిపోయినవాడిలాగా చివాలున మళ్ళీ తిరిగి — "ఈరయ్యగారో! అర్జంటుగా నాకు దా అరవై రూపాయి అవసరం. ఉండాదా? రేపుదా యిస్తాన్దా" నంటూ చిటికేశాడు.

"చిత్తం! అట్టాగే లెండి! అంతకంటేనా!" అంటూ ఈరయ్య పెట్టెలో వున్న నోట్లకట్ట విప్పి ఆరునోట్లు లెక్కపెట్టి నాయుడుచేతుల్లో పెట్టాడు.

"సెబాస్స"ంటూ నాయుడు సగర్వంగా పేము బెత్తం గిరగిరా తిప్పుకుంటూ చక్కాపొయ్యాడు, ఓమాటుమాత్రం భుజంమీదికి తల తిప్పి సూరమ్మకేసి చూసి. సూరమ్మ చకాచకా వెళ్లిపోతోన్న నాయుడుగారివే పాకమారు మాత్రం చూపు పరపింది; అమాయికత్వంలో భయమూ, ఆశ్చర్యమూ సమ్మిళితమయి ఉన్నాయి, ఆ చూపు తళతళలో!

౨

మధ్యాహ్నం వొంటిగంటకు ప్రారంభించిన పందాలింకా సాయంత్రం నాలుగున్నరకైనా ముగియక జయప్రదంగా సాగుతునే ఉన్నాయి! గుఱ్ఱాల పోటీలు వొంటిగంటన్నరకల్లా అయిపోయినై; వొంటెద్దుబండ్ల పోటీ, సైకిళ్ల పందెం, కత్తుల సామూ, నాల్గుమైళ్ల రన్నింగ్ రేసూ, మొదలైన పోటీ లింకేవో అప్పటికే జరిగినై. 'రేఖ్‌లా' రేసు ప్రస్తుతం జరుగుతోంది పెద్ద సున్నలాంటి గుండ్రటి మైదానం చుట్టూ కిటకిట లాడిపోతూన్నారు జనం! అవ్వాళ "గవర్నరుగారి రోజు" అవడంవల్ల మరింత తోపిడి, అలజడీ, అల్లరీను! ఆ మనుష్యుల గుంపులలో ఒకచోట కట్టగట్టుకుని సూరమ్మా ఈరయ్యా చూస్తూన్నా రాశ్చర్యం కనపరుస్తూ. పందెముపైన అంతగా మోజు కనబరచడం లేదంటూ స్పష్టంగా తెలుపుతోంది ఈరయ్య పక్కనే కూర్చున్న నాయుడుగారి ప్రవర్తన. మహాశ్చర్యంతో, వట్టి అమాయికత్వం కురుస్తూ ఉన్న ఆనందంతో కలిసిమెలిసి కట్టగట్టుకుని ప్రజలందరితోబాటు తామూ 'రేఖ్లా' రేసుమీదే దృష్టి యావత్తూ నిల్పిన యీ తెనుగుదంపతు లిద్దరినీ, మధ్యమధ్య లేరిపార

జూస్తూ వేళాకోళంగా పెదవులు మెలివేసుకుంటూ, "కానివ్వం డికెంత సేపులే!" అన్నట్టు మందహాసం చేస్తూ, తనలో తా నేమో ఆలోచిస్తున్నాడు నాయుడుగారు! మంచి యౌవనపటుత్వంలో ఉన్న యిరువైయేళ్ల సూరమ్మ ముఖారవిందం ఒకే గుటకలో మింగేసే వాటిమల్లే మెరిసేవి నాయుడిచుట్లు రెండూను, ఆమె మీది కాతడు చూపు బరపినపుడల్లా! ఆవీక్షలో యేదో కాముకవికారం స్ఫురిస్తోంది; ఆమందహాసం — అమృతముఖగరళభాండాన్ని తలపుకు తెస్తోంది; మొత్తంమీద నాయుడుగారి అప్పటి పరధ్యానమూ, బొమముడుపులూ, పెదిమలమెలికలూ, విస్మయసంవలిత వీక్షలూ — యివన్నీకూడా యేవో ఉత్పాతాలమల్లే ప్రేక్షకులకు స్ఫురించే తీరుతవి!

"అప్పి! ఆడికడుపు చల్లగాను! ఎంతతొరగా తోల్తున్నాడో బావా!"

"నిజం పిల్లా! ఏంసిత్రం?"

"కోసపాల్లో యిట్టాటిసిత్రం ఓరో జైనా చూశాం? అరరరే! వెనకున్నోడు ముందరివోణ్ణి దాటి బలేగా వొస్తున్నాడే!"

"అరరరే!"

"బావోయ్! బావోయ్! ఆడ — దూరాన జరీపందిట్లో కూకున్న దొరాదొర్సా నెవ్వళ్లో? చెప్పే?"

"నాకేం తెల్సే పిల్లా! ఐనా రామయ్యనాయుడుగార్నడుగుదాం; తెలిసినోడు"–"నాయుడుగారూ!" అనేపిలుపు విసిరేశాడు ఈరయ్య, పరధ్యాన్నంగా ఉన్న నాయుడుగా రులికిపడేటట్టు! నాయుడొక తియ్యనినవ్వు రువ్వాడు ప్రత్యుత్తరంగా.

"ఓ — ఆడ పందిట్లో కుర్చీలోనున్న ఆ — దొరాదొర్సా నెవ్వరండీ?"

"సెభాస్! ఏమిదా మీకు తెలుసుదా? ఆ దొరై గవర్నర్, దొర్సాని గవర్నర్ భారియదా!" అన్నాడు నాయుడు దబాయించి సగర్వంగా.

"అర్రి! అట్టాగా! చూశావే పిల్లా?"

"అప్పి, గొ—వొ—ర్నరా!" అంది సూరమ్మ నోరు కాస్తా తెరుచుకుని ఆశ్చర్యాచేతనావస్థలో. నాయుడుగారి కండ్ల మెరుములు తనశరీరంలో ఉరిమినట్టయింది సూరమ్మకు! బెదరిన జింకమల్లే మొహం తిప్పేసుకుం దింకోవేపుకి.

* * * * *

చీకటి పడింది; అంతా విద్యుద్దీప తేజోమయంగా మారింది! మైదానంలో పందాలు చూసిన యావత్తు ప్రజా చెదరి చిందరవందరయింది; తుపానుపట్టిన గభీర సాగరంలా అక్కడికక్కడికి తోసుకుని వస్తూ పోతూ న్నారు జనం! ఆ విద్యుద్దీప తేజంలో 'తళతళా', 'పెళపెళా' మెరసిపోతున్నాయి స్త్రీలవజ్రహారాలు, వజ్రపుకమ్మలు, బంగారపు వడ్డాణాలు, గాజులు, జరీచీరెలూ, చక్కని శరీరచ్ఛాయలూ, తదితరవేషాలంకృతులూనూ! యౌవన ప్రేమికు లెందరెందరో చేతులుకలుపుకుని, అన్యోన్యాలాపనా నిమగ్నులౌతూ ఆయువర్ణశోభిత రుచిరాంబరవర్ణ కల్లోలినీతరంగమాలాజాలంలో లీనమైపోతున్నారు!

* * * * *

ఒక గుడారంముందర బ్యాండు వాయిస్తున్నారు. గుడారంలోనుంచి జనం వస్తూ పోతూ ఉన్నారు. సూరమ్మ పట్టుదలమీద ఈరయ్య పావలా టిక్కట్లు పుచ్చుకున్నాడు; ఏదో చూద్దామనే అపేక్షతో సూరమ్మ 'గబగబా' గుడారములో దూరికింది!

లోప లేమీ లేవు చూడబోతే! ఉత్తి అద్దాల మయం డేరా లోపలిభాగమంతానూ! "ఆ–సిం లేనా?" అనుకుని చిన్నబుచ్చుకున్న తనవదన మొక దఫా పొడుగాటి అద్దంలో చూసుకుంది; సూరమ్మకు పట్టలేనంత నవ్వొచ్చింది; తా నాఅద్దంలో ఒంటెలా సాగిపోతున్నది వికారంగా! ఈరయ్య వెడల్పాంటి వలయాకారదర్పణంలో చూసుకుంటూ పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుకుంటున్నాడు; "పిల్లా! పిల్లా! ఈడకి రా! చూసుకుందాం మనిద్దరి అందం" అని పిలిచాడు పట్టరాని నవ్వులో ఊగిసలాడుతోన్న కంఠస్వరంతో; సూరమ్మ

రివ్వున భావను చేరుకుంది. ఇక నవ్వుకు అంతమే లేదు! వొక్కటే నవ్వడం! — ముసిముసినవ్వులూ, పకపక నవ్వులూ — పొట్ట లుబ్బి పొయ్యేటట్టు!

"ఒసే! పిల్లా! ఎంచక్కా ఉన్నావో? గాబులా బలిసి — పక్కలు తన్ని!"

"బావోయ్! మా బాగా వున్నావ్లే! గుండ్రాయి మల్లె, దున్నపోతల్లె — పొట్టా, మొహం, ముక్కు, చెవ్వూ వాచిపోయి!"

పైరిథంగా ఈరయ్యా సూరమ్మా అన్నిఅద్దాల ముందు నుంచుని చూసుకుంటున్నారు తమనికారాకారాల్ని — విసుకు విరామం లేకుండా! అదేమిటో చిత్రం? నాయుడుగారుమాత్ర మంత ఉదారంగా, ఆపల్లెదంపతులతో బాటు నవ్వులదావం చేసుకోలే! కొంచెం విసుకుతోనూ, అలక్ష్యంతోనూ, "పద్దా! పూదుస్తాం రా! తమాషా శావా చూడనాలా. కన్నాడి లత్తై సారి చూస్తిని" అన్నాడు నాయుడుగారు ఈరయ్య నుద్దేశించి.

* * * * *

రాత్రి తొమ్మిదిన్నరయినది; పదిగంటలనుంచి పన్నెండున్నరవరకు ఆరోజున "ఫయర్ వర్కు" ల ప్రదర్శనం; బాణసంచాలు కాలేటందుకు సిద్ధపడుతున్నాయి. నాయుడుగారి కడుపు చల్లగాను! సూరిమ్మకూ, ఈరయ్యకూ ఎనిమిదిగంటలకల్లా తోటలోనే ఉన్న "కోమలవిలాసం" లో తృప్తికరంగా వేడివేడి నాజూకుఫలహారా లిప్పించాడు, కాఫీ భోయించాడు; తానూ తాగాడు రెండుకప్పుల "స్పెషల్" కాఫీ; చివరకు 'బిల్లు' మూడురూపాయలైనా ఏమాత్రం గొణుగుడు గాని, సణుగుడు గాని లేకుండా హోటలయ్యరి చేతిలో నిర్లక్ష్యంతో పదిరూపాయలనోటు గిరాటేశాడు.

తరువాతికర్చంతా నాయుడిదే! బలవంతాన అన్నితమాషాలకూ తానే యిచ్చాడు! మునపటిమల్లే పరధ్యానంగా లే డిప్పుడు; కండ్లు నవ్వుతునై; నోరు నవ్వుతోంది; ముఖాన కళ హెచ్చింది; కాలు స్తున్న 'సిగరె' ట్లిన్నని చెప్పడానికి వీల్లేదు. అబ్బా! యీమారు పిల్లా వొచ్చిందో? ఎందు కొచ్చిందో?

* * * * *

సూరమ్మ కింకా పిల్లచేష్టలు పూర్తిగా పోలేదు. బొత్తిగా పెద్ద నాబహానీ కాలేదు! మధ్యావస్థలో కొట్టుకలాడుతూం దింకాను. పట్టణవాస అనుభవం లేదన్న మాటే గాని, సాధారణంగా పల్లెటూరిపిల్ల లెరుగని, నవనాగరికత క్రింద గణింపబడుతున్న — నవనాగరికం అన్న లిది కానే కాదు!— ఫేస్ పౌడర్లు, ప్యారిస్ సబ్బులు, ఆటో దిల్ బహార్లు, కేశరంజనీ నూనెలు, తలపిన్నులు, లోలక్కులు, చీ-కా-కు-గాజులూ — యీ సామగ్రి ప్రయోగంలో సూరమ్మ ఆరితేరింది! చంకలమట్టుకున్న 'V' కత్తిరింపు జాకెట్టు తొడుక్కుంది, క్రిక్కిరిసి ఉబ్బుగా ఉన్న దోరకొమ్మ సగం కనబడేటట్టు! తళతళా మెరిసే పట్టుచీర; రెండుజతల 'S' గాజులు; మెళ్లో బంగారంగొలుసు నాజూగ్గా! చెవులకి లోలక్కులు; యిరపై సూదులతో పొడిచిన రొత్తయిన జుత్తుముడి; మొహమంతా పౌడర్ అంగుళం దట్టంగా మెత్తిన తెల్లనిపౌడి; నడుముకు పాములాంటి వడ్డాణమూ! నాయుడుగా రిలాంటి పిల్లదానిమీద కన్నేశారంటే అదొక ఆశ్చర్యంలో చేరినసంగతి కాదు. ఆరాత్రి సూరమ్మ తమాషాలలో వొళ్లే మరిచింది; చీనాపాటలు పాడుతూ విద్యుచ్ఛక్తి వల్ల నడిచే 'రంకులరాట' మెక్కింది; గిరగిరా, గిరగిరా, తిరిగింది తల తిరిగేదాకా! "ఏరోప్లేను" చక్రంలో కొంతసేపు గడిపింది; పెంకిపట్టు పట్టి సర్కసు కాస్తా మూడగంగింది! లాటరీ అంగళ్లలో పావుగంటవరకు జూదమాడింది. అంతా కొత్తే! అంతా వింతే! పాపం! ఇంకా యేవేవో మాడ్డామనే ఉబలాట! ఎల్లాగైతేనేం, బలవంతంమీద భార్యతో బయటబడేలోపల ఈరయ్యకు తలప్రాణం తోకకొచ్చింది. "ఊ! ఊ! ఊ!" అంటూ తన అప్రియాన్నీ, అసమ్మతినీ, తెలుపక పోలేదు సూరమ్మ మొగుడితో.

* * * * *

బాణసంచావేడుకలు విజృంభించాయి! 'ఢమ ఢమా' మంటూ గుండె లదిరిపోయేటట్టు మారు|మోగు తున్నాయి; ఆకాశంలో ఎరుపు, తెలుపు, పసుపు, ఆకుపచ్చరంగుల పూలు కనుపంపుగా, వానలా కురుస్తున్నాయి; ఒకమూల 'లంకాదహన' బాణసంచాలు మండి భస్మమౌతున్నాయి. ఆరో తెలాంటిదో కాని, ఉన్నట్టు ఉండి కాకీక్లబ్బుపాకవైపునుంచి పొగా, మంటలూ బయలుదేరినై; కాకీక్లబ్బు తగలబడిపోతోంది. గాలి అపరిమితంగా వెయ్యడంవల్ల కాకీక్లబ్బుమంటలు 'సర్కసు' డేరా కాల్చేసినై; సర్కసుడేరానుంచి మంటలు వ్యాపించి యింకేవేవో పాకలమీది కురుక జూస్తున్నాయి! అస లెట్లా అంటుకుందో కాకీక్లబ్బు పాక? ఎవ్వరికీ తెలీదు! ఏదుండగీ డంటించాడో? ఎక్కడా గందరగోళం! గగ్గోలు! ఇంతట్లోకే విద్యుద్దీపాలొక్కదఫా ఆరినై! ఎట్టగా, భయంకరంగా ఆకాశంలోని కుటుకుతూన్న ఆవేశిమంటలు రక్తప్రభా సుతంగా మార్చివేసిన వాదిమ్మటికట్లను! ప్రాణాలు దక్కించుకునే ఉద్దేశంతో మనుష్యు లటూ యిటూ, అడ్డంగా దిడ్డంగా పరుగులుతీస్తున్నారు.

"పిల్లా! సూరీ! ఓపిల్లా! ఓసూరీ!" అని గద్గదకంఠంతో అరుస్తూ పిచ్చివాడిమల్లె ఈరయ్య ఆత్రోక్కడిలో బడి అక్కడి కిక్కడికి తోసుకుని సూరమ్మను వెసుకుతున్నాడు. పాపం! సూరమ్మ ఏమయిందో! నాయుడుగా రేరీ?

* * * * *

"బావో! మరి?"

"ఎక్కి కూసొ్క! కూసొ్క! కూసొ్క!"

"అమ్మో! బాబో! బావో!"

'బావో' 'బావో' అంటూ గద్గదస్వరంతో రోదిస్తూ భయంచేత వణికిపోతూ, ఏమి చెయ్యడానికి తోచక, ఎల్లాగో అల్లాగా, పాపం, సూరమ్మ జట్కా బం డెక్కి కూర్చుంది.

"ఎంగ పార్?"

"మింట్ స్ట్రీట్" అంటూ జట్కావాడికి సమాధానం చెప్పి, అటూ ఇటూ ఓమారు సంశయంతోను భయంతోను గాలించి నాయుడుగారు జట్కా రెక్కి కూర్చున్నాడు. జట్కాబండి కదిలింది!

* * * * *

గగ్గోలు పెడుతూ ఆకాశం ఊడిపడేటట్టు రేడుస్తూ 'చెన్నపట్టం టక్కరీ! లంజకొడకా! అగో! అగో!' అని గర్జిస్తూ రివ్వున వొచ్చి జట్కా వెనకాలే కూర్చునిఉన్న నాయుడుగారి చెయ్యట్టుకుని గుభిలున క్రిందికి లాగేశాడు ఈరయ్య! నాయుడు మట్టిమీద చతికిలబడ్డాడు; పెద్దగుంపు మూగింది; 'దభీదభీ' చతికిలబడ్డ నాయుణ్ణి ఈరయ్య చితకబొడిచాడు; మూగిన జనానికి జరిగినమోసం తెలిసింది. అంద రా 'టక్కరి' మీద కెగబడ్డారు. అక్కడే ఉన్న ఒక పోలీసు దొర నాయుడుగారి నిలా సన్మానించారు — "డామ్ రాస్కల్! అంబుటియ్య! ఉంబేర్ రా-మా-యా-దా నే? బద్మాష్! 'ఫోర్జరీ' పోరబిల్లి యో? పొణ్ణు గూడే వేణామో? బద్మాష్!"

నేనూ అప్పు డక్కడ ఉండటం తటస్థించడంవల్ల ఏమిటో కథ కనుక్కుందా మనుకున్నా. రామయ్య నాయు డొక పెద్దమోసగాడనీ, బోగంకులస్థుడనీ, యీలా చక్కని అమాయికపుపడుచు పిల్లల నెందరినో మోసం జేసి తీసుకెళ్లి నిర్బంధించి పశుప్రవృత్తిలోనికి దింపి తద్వారా ధన మార్జించుతున్నాడనీ, ఇదివరకే ఫోర్జరీ చేసి నాలుగై దేళ్లు కఠినశిక్ష ననుభవించాడనిన్నీ అక్కడ గుంపులు గుంపులుగా పోగైనవా ళ్లందరూ చెప్పుకుంటూంటే నేను విన్నా.

# ప్రాకృత గాథలు

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు

(అనువృత్తము)

గాయపడినవారికే యగు నొప్పియు
ననెడు పలుకసత్య మయ్యెఁ జూడు!
చెక్కులందుఁ బంటినొక్కు దానికిఁ గల్గ
సవతులకు జనించెఁ జాల నొవ్వు.

—కావ్యప్రదీపము, ఉ. ౧౦. పు. ౩౬౫.

చనవుమెయి నిరుగేలఁ బట్టిన యశోద
గుబ్బపాలింటి మొన మోవిఁ గూర్చువేళఁ
బాంచజన్యమ్ము మదిని దలంచుకొన్న
ముద్దుకృష్ణు గగుర్పాటు బ్రొక్కుఁడీకు.

—అదే, పు. ౩౮౨.

చెలువ! యిందు రమ్ము; చెడునింద యొకటి జ
నించె నీకు; నాలకించి పొమ్ము
చాటుచున్నవారు చంద్రుఁడు సరి యంచు
మోటువారు నీదు మోముతోడ.

—అదే, పు. ౧౮౩.

అదియె నెలవుకొనియె మదిని; చూపులయందు
నదియె; మాటలందు నదియె నీకు
నన్నుఁ బోని పాపినాతుల కచ్చోట
నందు దొరకు టెట్టు లందకాఁడ!

—అదే, పు. ౩౮౬.

మేనిమెఱుఁగు లెందు మినమినలాడఁ బ్రా
యంపుమగల మనసు లన్ని దోఁచి
యందు నిండుఁ దిరుగులాడెడు దీని నీ
పల్లెటూర నాఁపువాఁడు లేఁడొ!

—అదే, పు. ౩౮౯.

కొమిరెవయసు తిమురు గొని పచ్చిపచ్చిగఁ
బలుకుచున్న దదిగొ పల్లెపడుచు!
చెవులు మూసికొనుచుఁ జెంగటియిల్లాండ్రు
చనిరి తొలఁగి చూడ వినఁగ లేక.

—రసార్ణవసుధాకరము, విలాసము. ౨.

ఇంటిచెంతఁ బొదలనెల్లఁ గాల్చుచు నుండు
మామగారిఁ జూచి మనసు విఱిగి,
ఎన్నిమాఱు లఱచుచున్నను గోడలి
కత్తమాట చెవులనైనఁ బడదు.

—అదే, విలా ౨.

అలుక గొని యేడ్చు జవరాలి యశ్రుజలము
కనుల చెక్కుళ్ళ కెమ్మోవి కాంతి, బెరసి
చక్కనగు నింద్రదు విలువోలె జాలువాఱఁ
దడవు గనుచుండె దయితుఁడు దనివి సనక.

—విశ్వేశ్వరుని యలంకారకౌస్తుభము, పు. ౮౦౩.

అడిగి పడసినవ్వు, డడుగక బల్మి ము
ద్దాడినపుడు, చెలి తనంత వలచి
మో మొసంగినపుడు, మోవి యొక్కటి నైన
వేఱు వేఱు చవులు వెలయుఁ జూవె!

—మంఖుకుని అలంకారసర్వస్వము, పు. ౯౬.

విస మగుఁ గొందఱకు; నమృత
రస మగుఁ గొందఱకు; గొందఱకు నమృతంబుఁ
విసము నగుఁ గొందఱకు మఱి
విసమును నమృతమును గాక వెడలును బ్రదుకుల్

—అదే, పు. ౬౫.

(సశేషము.)

3. పక్షియాకారమున నున్న విమానము
క్రొత్తరకము. బెర్లినువద్ద నున్నది.

G. S. A.



౪. "కదలకు, కదలకు"

G. S. A.



౫. "ఎండిన మనిషి"

సెయింటు జేమ్సు చర్చిలో గలదు. ౨౫౦ ఏండ్లకుపూర్వపుమనిషి తాలూకు అస్థిపంజరమట. దానికి శుష్కమాంసము గలదు. ౧౬౬౬ లో సంభవించిన అగ్నిప్రళయమున కాలిపోయిన ప్రాతచర్చి బలిపీఠముక్రింద పూడియుండినది.

G. S. A.

# పేరంటం



పూడిపెద్ది వెంకటరమణయ్యగారు

పసుపూ కుంకానికీ పిలువవచ్చిన జానకిని చూచి రాజమ్మ నివ్వెరపడ్డాది. ఆమె కట్టుకున్న నేలంపట్టుచీర దీపపువెలుగులో తళ తళ లాడుతూంది. ఊదా, ఎఱుపూ, పట్టంచులు జలతారుపువ్వులతో జిలజిలలాడుతున్నాయి. పైట చెరగు కమ్మీలో జల్తారు మొలనున్న మువ్వలవడ్డాణంతో ముచ్చటిస్తూంది. మెడలో హారాలవరసలు చీరపట్టంచులతో పంతా లాడుతున్నాయి. చేతుల గాజులూ, చేతిలో వెండిభరిణా, వ్రేళ్ళ ఉంగరాలూ ఇవన్నీ చూచి రాజమ్మకన్నులు మిలమిలా మెరిసేయి. జానకిని చూచి పేద నవ్వు నవ్వింది. జానకి మొలలో చేతిరుమాలు తీసికొని పౌడరుపూతలో మొగం మెల్లగా అద్దుకుంటూ,

"మీఆయన ఊళ్లో ఉన్నారా?" అంది.

రాజమ్మ—ఊళ్లోనే ఉన్నారు. ఎక్కడకో వెళ్లేరు. ఇంకా ఇంటికి రాలేదు.

జానకి—సరే, వెళతా మమ్మా—ప్రొద్దుపోయిందా? ఇంకా ఊరంతా పిలవాలి. అన్నట్టు రాజమ్మా, నీ వెప్పుడూ మాయింటికి రానే లేదు. రేపు తప్పకుండా రావాలి. ముత్తైదువవు గదా, పేరంటానికీ రాకూడదా? వస్తావా?

రాజమ్మకన్నులు కొంచెంచెమ్మగిల్లేయి.

"అలాగేనమ్మా! మీ రన్నిసార్లడగాలా?"

జానకి "నీవుండమ్మా, మేము వెళతాం" అని వెళ్లిపోయింది. రాజమ్మ వంటింట్లోకి వెళ్లి ఉడుకుపట్టిన అన్నం పదును చూస్తూంది.

రాఘవయ్య మెల్లగా లోన ప్రవేశించి చిఱునగవుతో, "ఏమేవ్ రాజ్యం! రేపు డాబుకొట్ట వన్నమాట! పేరంటం, విందూ, పాటలూ, వాయనాలూ! ఓ! రేపు సందడంతా మీఆడువాళ్ల దే! ఎప్పుడూ ఇలా ఇంట్లో కూర్చుంటే ప్రపంచం ఎలా చూస్తావు? వెళ్లొకమాటూ! నీకేం మాట రాదా? మంతి రాదా? మర్యాదా మప్పితం ఎఱుగవా?" అన్నాడు.

రాజమ్మ— అయ్యో! ఎఱుగకపోవడమేమీ? అన్నీ ఎఱుగుదును. ఏమీ తెలియకుండా ఇంతదాన్నెలా అయ్యేను! పెంటచ్చిలాగు నేను వెళ్లి అక్కడ నిలబడితేనే గాని వాళ్లింట పేరంటకం సాగదు. కలకల లాడేవాళ్లమధ్య నొకదిష్టిబొమ్మ ఉండొద్దూ?

రాఘవయ్య—ఎందు కలా అంటావూ? వాళ్లందర్లిలోనూ నీపాటి అందమైన ఆడుది ఒక్కర్తె ఉందీ? నీ ముందే వాళ్లందరూ దిష్టి

బొమ్మల్లా గుంటారు. నీ వెప్పుడేనా అద్దం దగ్గర నిలబడి నీరూపం పరీక్షించుకున్నా ?

రాజమ్మ—అద్ద మెక్కడ? ఇంతకీ ఏలా పరీక్షించుకోడం ? దిన్నబోయిన విగ్రహాన్ని చూచుకొని మరింత దిగులుపడ డానికా!

రాఘవయ్య కొంచెం చిన్నపుచ్చుకున్నాడు. ఔను పాపం! చెప్పడానికి తగిన దొక్కనగైనా ఈమెకు లేదు. చేతులకు నల్లనివి రెండుపట్టుగాజులూ, మెడలో పచ్చని బొందూ, రెండుపుస్తెలూ, చెవులకు రెండుకటకంపూలూ, చిన్నయెఱ్ఱపొడిముక్కుపుడకా—పుణ్యస్త్రీలక్షణాలు చెడకుండా ఆమె కున్న నగ లివే! ఇంట్లో నిత్యమూ కట్టుకోడానికి రెండు గువ్వకన్నుచీరలూ, తొడుక్కోడానికి రెండు బొంబాయితూలురవికలూ—వీనిని విడిచి ఆమె కేమీ సింగారాలు గాని, చీరమడతలు గాని లేవు. పేరంటానికి వెళ్లంటే యెలా వెళుతుంది? ఏంచీర కట్టుకుంటుంది? ఏం నగలు పెట్టుకుంటుంది? ఈసంగతు లన్నీ తట్టగానే రాఘవయ్యమనస్సు చివుక్కుమంది. ఏం చేస్తాడు పాపం! తాణాలో అతని కిచ్చే పాతిక రూపాయీలతోనూ జీవనం గడవడమే కష్టమయిపోతూంది, అట్టే ఆలోచించేడు.

“ రాజ్యం! ఇంత సౌందర్యవంతురాలివి నీవే యిలా బాధపడుతూఉంటే పుట్టెడేసి లోపా లున్న వాళ్లందరూ యెలా పరితపించాలో! కాంతాలోకానికి భూషణానివైన నీకే భూషణాలకోసం ఇంతతహతహా ?”

రాజమ్మ—అయితే మీరుకూడా రేపు నాతో రండి. ఈ బట్టముక్కలు నాలుగూ అక్కడ ఏకరవుపెడుదురు గాని ..నా గువ్వకన్నుచీర చూస్తే వాళ్లగుండెలు పగిలిపోతాయి. వెడవెడపోతూన్న యీనాతూలు రవిక చూస్తే వాళ్లందరూ తూలి పడిపోతారు...పోనిస్తురూ, నాలాంటిదానికి పేరంటం ఏమిటి? ఎంత చేసుకుంటే అంతే గాని యెక్కువ రమ్మంటే యెలా వస్తుంది? మీకే యెక్కువగా డబ్బుంటే మీరే నన్ను పెళ్లాడకపోయియుందురేమో. నాపెండ్లికోసం పాపం, మానాయన ఎన్నిబాధలు పడ్డాడు! ఎందరికాళ్లు పట్టుకున్నాడు! పేదవానికడుపున పుట్టడంచేత గదా నన్నేగొప్పవాళ్లూ చేసుకున్నారు కారు? మీధర్మమా అని మీ రంగీకరించేరు గాని, మీలాగే ఉన్నా మీరు కాస్త బళ్లోకి వెళుతున్నా రనేగర్వం చేత మీనాయనగారు కట్నంకోసం కళవళపడ్డారు కారూ? ఏలా యిప్పు డవన్నీనీ? నాకు మీతో సుఖంగా కాలక్షేపం వెళుతూంది. ఎక్కడికీ. ఇలాటి కోరికలకు హద్దేమిటి? ఇప్పుడు మిమ్మల్ని బాధపెడితే మాత్రం మీ రెక్కడనుండి తెస్తారూ? ఏ పేరంటకాలూ వద్దూ. ఇలా కాలక్షేపం చేయనిద్దురూ!

రాజ్యంమాటలు వింటూ ఆనందపరవశుడయిపోయేడు రాఘవయ్య. ఆమెతొగరు పెదవుల వణకూ, పెద్దకనురెప్పల తొణకూ, చెక్కుటద్దాల తళుకూ, చికురాల బెళుకూ,

కంఠంసొంపూ, చేదీగచూపూ, ఎత్తు పెడదయదరూ, చిన్ని నడుంపెదరూ, ఇవన్నీ ఆమెకు విశేషాలంకారాలుగా ఊహించేడు. కాని ఆమె కేమీ నగలు పెట్టలేకపోయేడు గదా అని విచారించేడు. నగలదాకా యెందుకూ, పేరంటానికి వెళ్లినప్పుడయినా కట్టుకుందికి ఒకఖరీదయిన చీరయినా కొనలేకపోయేడు. ఎలా వస్తుంది! నిరుపేదకి నీళ్లూ, అన్నమే పంచభక్ష్యాలున్నూ. రాఘవయ్య అట్టే ఆలోచించేడు.

"రాజ్యం, రేపు నీ వెలాగయినా పేరంటానికి వెళ్లక తప్ప" దన్నాడు

రాజమ్మ—ఈకుళ్లుగుడ్డలతో నేనా? నేను వెళ్లలేను సుమండీ! మనదర్రిద్ర మేదో మనం నాలుగుగోడలనడుమనూ పడుతున్నాం చాలదూ? ఊళ్లవెంట వెళ్లబొయ్యా లేమిటి?... ఉండండి, అన్నం చ మిడిపోతూంది.

రాఘవయ్య—రాజ్యం, సత్యవంతులకు పేదరికం విలాసం అవుతుంది. నీలాటి సహజ సౌందర్యవంతురాలికి విశేషభూషణమౌతుంది. జ్ఞానుల కది స్వర్గతుల్యమే. దర్రిద్రం పాపం కాదు గదా?

రాజమ్మ—పేరంటానికి వెళ్లి పేదరికం మీద లెక్చరిచ్చేదా యేమిటి?

రాఘవయ్య—అది కాదు. నీకు నచ్చ చెబుతున్నాను.

రాజమ్మ—నా కేలా నచ్చచెప్పడం? ఈదర్రిద్రం నా కివాళ క్రొత్తగా వచ్చిందా యేమిటి? వేయిమంది గొప్పవాళ్లల్లో ఒక పేదరాలి నెవరు చూస్తారు? ఎవరు పలుకరిస్తారు? ఎవరు లక్ష్యంపెడతారు?

రాఘవయ్య—వాళ్లందరూ చూచి మాత్రం నీ కేం చెయ్యాలి? కావ్యాలు వ్రాస్తారా, కనకాభిషేకం జేస్తారా? అంత అలాగు ముస్తాబులయి వచ్చినవాళ్లకయినా యేం చేస్తారు? పట్టుచీర కట్టుకోడానికి పేదరికం గాని పసుబూ కుంకానికీ పేదరికమా? ఇంతకీ నే నేదో చీర తెచ్చి యిస్తాను కదూ; నేను చెప్పినట్టూ ముస్తాబయి వెళుదూ, నిన్నెవ రేమంటారో చూస్తాను.

రాజమ్మ పకపకా నవ్వింది.

౨

సీతమ్మ చిత్రకారుని రంగులనాడెపుపలకలాగు, సీతాకోకచిలుకరెక్కలాగు రంగురంగుల చీరా, రంగురంగుల రవికా, నల్లని మొగం, తెల్లనిపౌడరూ, ఊదాకుంకుమబొట్టూ, ఎఱ్ఱని ముక్కుపుడకా, తెల్లనిపండ్లూ, పచ్చని నగలూ వీనితో తళతళలాడుతూంది.

నాగమ్మ ఒక్కటే గొలుసూ, ఒక్కటే గాజుల జతా, ఒక్కటే ముక్కుపుడకా, ఒక్కటే ఉంగరం, మెలిపడ్డ ముంగురులూ, మెడనిండా పౌడరు, భుజా లంటిపోయిన రవికా, ముంజేతిమీదికి పైటా, కాలికి పట్టీల జతా, కట్టకపు నవరపు వ్రేల్జడా, వీనితో, రూపం యెలా ఉన్నా లోపం లేదన్నట్టు త్రిప్పుకుంటూంది.

శ్యామల కట్టుకున్నది గానో గాగ్రావో, చీరో పంచో, తెలియదు; కొంచెం మీగాళ్లు దాటి గూడారులాగు వ్రేలాడుతూంది; భుజాల కెగసిపోయిన పొట్టిచేతుల కచ్చా దానికి కుట్టినట్టుంది. మొలకు తెల్లని పట్టీ. ఆపట్టీలోనుండి మొలచినట్టు పై కెగసిన మూరెడు పైటచెరగూ; ఆచెరగు కుచ్చెళ్లన్నీ కూడబెట్టి యెడమభుజం కొనను, మిలమిలా మెరసే కల్లపొళ్ల సూదిలో నిమిడ్చింది. సన్నని వెండిపట్టీలు రెండు సగం పాదాలమీదికి జారవిడిచింది. చీపురుపుడకలలాటి బంగారుకడియాలు రెండుమండలమీదికీ దొరలిపోతున్నాయి. తలవెండ్రుకలాటి బంగారు తీగతో అల్లిన గొలుసు పైటమీద కదులుతూంది.

సుందరమ్మా, చెంప కొప్పూ, పండ్ల కప్పూ, మొగంనిండా పసుప్పూ, సుద్దగన్నేరు రేకులాటి బొట్టూ, చెవులపువ్వులూ, చేతులకు గుత్తంగా నల్ల గాజులూ, ముందుకు మురుగులూ, ముక్కున హంసా, నీలిరవికా, తూలుచీరా, కాళ్ల సందెలు కడియాలూ గొలుసులూ, కళ్లనిండా కాటుకా, కట్టినట్టి పాపట బొట్టూ, కాలి వ్రేళ్లకు మట్టెలూ, కొప్పులో గన్నేరుపువ్వూ, బుగ్గను తాంబూలం, వీనితో వెనుకటి కాలాన్ని తలపిస్తూంది.

మంజరి, సేలం చీరా, మధుర రవికా, పుదుచ్చేరి గొలుసులూ, బెంగుళూరు గాజులూ, చెన్నపట్నం ముక్కుపుడకా, సీమకమలాల దుద్దులూ, ప్యారిస్ ముత్యాలదండా, వీనితో అన్ని దేశాలనుండీ అలంకారాలు సేకరించుకుంది.

కమలమ్మా, కట్టుకాసులపేరూ, గజ్జల వడ్డాణం, పలకసరిపేటలూ, పదిపేటల గడియారపు గొలుసూ, గజ్జల పట్టెడా, జిగినీ గొలుసూ, చేతికి నాలుగుజతల గాజులూ, పలకల మురుగులూ మురిడీగొలుసులూ, పది వ్రేళ్లకూ ఉంగరాలూ, చెవుల దుద్దులలో లోలక్కులూ, కాలికి కడియాలూ గొలుసులూ, తలమీద నాగరం, వ్రేల్జడ కొనను నగిషీ జడగంటలూ, చిన్నిబొట్టూ, చేప కొలుకుల కాటుకా, వ్రేలికొనలకు గోరంటా, పెదవికి చినాలీరంగు, వెడల్పుజలతారు మైజారు చెరగూ, తామరపువ్వులంతేసి బుటాలచీరా, వెన్నుచుట్టిన జల్తారూ ముఖమలు పూవుల నక్కీచేతులూ గల రవికా వీనితో కండ్లు పులిమినట్టు కలకలలాడుతూంది.

అలంకారవిధానాలకు వీళ్లు తలమానికాలలాటి వాళ్లు. తక్కినవాళ్లందరూ వీరి నక్కడక్కడ అనుకరిస్తూ వెలితిపడుతూ వెలవెలబోతూ, అందులో అందులోనే సర్దుకుంటూ అలంకరించుకున్నారు.

ఆనాడు జానకియింటినడువాకిలి ఉద్యానవనంలా గుంది. చిలుకలపంజరంలా గుంది. నవ్వుమొగాలతో పూలచెట్టులాగు విరిసింది. సౌందర్యదేవతల్ల నాట్యశాల అయింది. ఆ ముత్తైదువలనడుమ జానకి వనదేవతలాగుంది.

అత్తరు దోహదం పెడుతూంది. పన్నీటి తుంపురులు చల్లుతూంది. వారిచేసీగలకొనల తమలపుటాకుగుత్తు లమరుస్తూంది. కోకిలయి పలుకరిస్తూంది. చిలుకయి పలుకుతూంది. తుమ్మెదై త్రుళ్లుతూంది. చకచక లాడుతూంది.

* * * *

అందరిచూడ్కులూ ఒక్కమాటు వీథి గుమ్మంవైపు మరలేయి. "ఊఁహూ" అని, "అబ్బో" యని, "ఏమి టీవింత" అని, ఇలాంటిమాటలు మెల్లమెల్లగా వెడలేయి. రాజమ్మ వెనుకనుండి మరలించిన పైటచెరగు చేతులతో పట్టుకొని లేతగా నవ్వుతూ, తాపీగా నడుస్తూ, లలితంగా కనురెప్ప లల్లాగుస్తూ, సిగ్గుచేత చెక్కి లొత్తుకుంటూ, పేదరికం తలచుకొని పెదవి వడకిస్తూ, నలుగురు మధ్యకూ వచ్చి నిలుచుంది. అందరు పేరంటాళ్లూ ఆమె నట్టే యెగాదిగా చూచేరు తలంటి నీళ్లు పోసుకున్న జుట్టు నున్నగా దువ్వుకొని వ్రేలుముడి వేసికొంది. తెల్లని నందివర్ధనం పువ్వు ఒక్కటే ఆ ముడిమీద నమర్చుకుంది. మొగాన్న చిన్ని కుంకుమపు బొట్టు చిఱునవ్వు నవ్వుతూంది. కన్నుల కాటుకరేకలు కలువ రేకులను తలపిస్తున్నాయి. చెక్కులతళుకులలో సింధూరరేఖలు తారులాడుతున్నాయి. కంఠంలో యేదో కదలుతూన్నట్టు కనిపిస్తూంది. ఖద్దరు రవిక చేతులనుండి వ్రేలాడే అరటి దూటలలాంటి ఆమెచేతులు సంగోగు మలచి మెరుగుపెడుతూన్న చంద్రకాంతశిలావిగ్రహాన్ని తలపిస్తున్నాయి. వక్షంమీది పైటలో పసుపు బొందు పైకి కనబడడానికి సిగ్గుపడుతూంది. వాడిన పొగడపూలదండ పలపలా పరిమళిస్తూంది. ఆదండతో దంకలయి ఖద్దరుపైట మడతలు కదలుతున్నాయి. గోరంచు గోధుమ రంగు ఖద్దరుచీర మెత్త మెత్తగా బరువు బరువుగా మడతలుపడి కుచ్చెళ్లు పాదాలను ముద్దుపెట్టుకుంటున్నాయి. అందరూ ఒక్కమాటుగా ఆశ్చర్యం పై కొలికించేరు.

'రండి, రండి', 'కూర్చోండి, కూర్చోండి' అని అందరూ అన్నారు. అందరికంటె ఆమెతో కొంచె మెక్కువపరిచయము గల కామాక్షి నిలువలేక యెదురుగా వెళ్లి ఆమెను కౌగలించుకొంది. కొంచెం వయస్సు మళ్లిన కనకమ్మకన్నులు చెమ్మగిల్లేయి. రాజమ్మను చూచి జానకి పొంగిపోయింది. ఎదురుగా వెళ్లి ఆమె సౌందర్యాన్ని అట్టే కౌగలించుకొని తోడ్కొని వచ్చి ఆమెను తివాచీమీద కూర్చుండబెట్టింది.

ప్రొద్దు వాలింది. పేరటాం డ్రెవరూ కదలలేదు. రాజమ్మను చూస్తూ, మెచ్చుకుంటూ ముచ్చటిస్తూ మాటాడిస్తూ అలా కూర్చున్నారు. సంధ్యారాగ మలమింది. రాజమ్మ చెక్కులు గులాబిమొగ్గలు తొడిగేయి.

రాజమ్మ—ప్రొద్దుపోయింది జానకమ్మగారూ, వండుకోవాలి. ఇక శల విప్పిస్తారా?

జానకమ్మ—ఉండండీ, వెళుదురు గాని.

చంద్రోదయం అయింది. సంధ్యారాగం వైరాగ్యం పూని సాత్త్వికంలో పడ్డాది. రాజమ్మచెక్కిలు మల్లెపూలు విరుస్తున్నాయి. ముత్తైదువ లొక్కరొక్కరే లేచి వెళుతున్నారు. "నేను వెళుదునా!" అంది రాజమ్మ. "ఇదిగో వస్తున్నా"అని జానకి లోపలినుండీ బదులు చెప్పింది. అమ్మలక్క లందరూ వెళ్లేరు. రాజమ్మ అలా నిలబడ్డది. జానకి దాసీ చేతికి పళ్లెమూ లాంతరూ ఇచ్చి, "రామీ, రాజమ్మగారిని వారింటికి దిగబెట్టిరా" అంది. "వెన్నెలా, లాంతరెందుకూ" అంది రాజమ్మ. "ఉండనిద్దురూ" అంది జానకి.

వీధిగుమ్మములో రాజమ్మచేతికి పళ్లెమందించి, "అమ్మా, చెలవా"అని రామి వెళ్లిపోయింది. చావటిలో దీపందగ్గర కూర్చొని రాఘవయ్య ఏదో నవల చదువుకుంటున్నాడు. అదే ధ్యానంతో చూస్తూన్నాడేమో, గుమ్మంలో అడుగులచడి కాగానే అటు చూచేడు. "రాజ్యం" అన్నాడు.

రాజమ్మ—వచ్చాను. అబ్బ! ఆమె యెప్పటికీ వదిలింది కాదు! దులుపుగో వచ్చేస్తే బాగుండదు. వండుకోలేదు. పాపం! ఇవాళ మీకు భోజనం ఆలస్యం చేసేశాను. ఇందుకే యెక్కడకు వెళ్లడమన్నా నే నిష్టపడను.

రాఘవయ్య—ఇప్పుడేమయింది? ఏమిటాపళ్లెంలో?

కప్పుతువాలు తీసి చూచేడు. నాలుగు పెద్ద లాడూఉండలూ, నాలు గరటిపళ్లూ, పిడికెడు ఢాకులూ చెక్కలూ, పసుపూ కుంకుమా ఉన్నాయి. రాఘవయ్య వానిని పరీక్షించి రాజమ్మముఖం చూచేడు. రాజ్యం కలకలలాడుతూంది. దీపపువెలుగున తళతళ లాడుతూంది. అత్తరుపన్నీరువాసనలతో ఘుమఘుమ లాడుతూంది. వంట కాలేదని తహతహ లాడుతూంది. రాఘవయ్యహృదయం విరిసిపోయింది. ఒడలు నిలువునా పులకించేసింది. "ఇప్పుడు మళ్లీ వంట చేయకు రాజ్యం! ఈఉండలు పళ్లూ తిని పా· త్రాగి పడుక్కుందాం!"

రాజ్యం—అయ్యో!

రాఘవయ్య — అయ్యో యేమిటి? ఇంకా మరి వంట యెందుకూ? నా కక్కరలేదు. నీకు కావాలా?

రాజ్యం—నాకు మొదలే వద్దూ! ఆ జానకమ్మ ఆదరణతో నాకు కడుపు నిండిపోయినట్టుంది.

రాఘవయ్య—చూచేవా? నేను చెప్పినమాట నిజమేనా?

రాజ్యం—నిజమే.

అని పెదవి వడకిస్తూ చేతులు రెండూ జోడించి భర్తకు నమస్కారం చేసింది. చెక్కిలమీద ఆనందబాష్పాలు జారేయి. ఆ అవస్థలో రాజ్యం రాఘవయ్యకు సరిక్రొత్తగా కనబడింది. అనుకోకుండా ఆయన చెక్కిలమీదకూడా ఆనందబాష్పాలు దొరలేయి. నిలువనీయని వింతఆందోళనేదో వాని

హృదయం కలచేసింది. ప్రేమతో అతని ప్రతి రక్తనాళమున్నూ టకటకా కొట్టుకొంది. అతడు పరవశుడయిన ట్టలా నిలబడ్డాడు.

రాజ్యాన్ని తీక్ష్ణంగా చూచేడు. చేతులు రెండూ చాచేడు.

"అయితే, యిలా రా మరి?" అన్నాడు.

---

## శకుంతల

కె. అన్నమరాజ శర్మ గారు

అమ్మ, శైశవమాదిగ నాడుకొన్న
ఈనికుంజాలయంబుల నీమనోజ్ఞ
శాద్వలంబుల కాననస్థలుల విడిచి
చనఁగ నాపాదములు ముందు సాగకుండె.

ఆశ్రమాంతరతరువరేణ్యమ్ములార,
సురభివేళల క్రీడించి సొలసి మీదు
శీతలచ్ఛాయలందు వసించునట్టి
స్మరణరమణీయసౌఖ్యమ్ము మఱవవలసె.

ప్రత్యుషస్సుల కమలాకరమ్ములందు
సంచపిండులతో నడయాడుచుంటి,
పరభృతాంగనలకు మాఱువలుకుచుంటి,
కాని, యవియెల్ల నేఁటితోఁ గలలు కావె.

పిన్నతనముననుండియుఁ బెంచి నోటి
గాయముల మాన్పుచుంటిని గారనూనె,
కన్నతల్లిగ భావించు కారణమున
కాళ్ల బెనఁగొనుచున్న దీ కన్నె లేడి.

గర్భవతియయినకురంగి కన్నపిదప
నాకు శుభవార్త పంపుమా నాన్న, నేను
చూచిపోయెద నీ నిండుచూలునందు [ము.
దయను మఱవకు ననువోలెఁ దలఁచికొను

నెచ్చెలీ, అనసూయ, నే నిండుప్రేమఁ
బెంచి నీరు వోసిన మాధవీకుమారి
ప్రసవసమయంబుదాఁకను ప్రతిదినంబు
ఆదరింపుము వారిని బాదు నింపి.

సఖి, ప్రియంవదా, ప్రియమున సాఁకినట్టి
ఈవనజ్యోత్స్నఁ బోషింప నీవ యింక
పోయివచ్చెద సెలవిమ్ము పోమ్ము మఱలి
ఎంతదూరమ్ము వచ్చిన నేమి కలదు?

చలికి వెఱవక లేచి యుషస్సులందె
స్నాన మొనరించి యీయేటిచాయలందు
చిత్రచిత్రంపు ముగ్గు రచించుచుంటి
మెడఁదలే సాక్షి మనస్నేహవృత్తి కింక.

ప్రాణసములార, దూరస్థురాల నగుచు
పోయివచ్చెద, నాకయి పొగులవలదు;
మాలినీసరిజ్జలముల మఱల మనము
స్నానమొనరించుభాగ్యమెన్నాళ్లకగునో?
ఆర్యసీమంతినీ ధర్మ మాచరించు
చతిథిపూజానిమగ్నత నలరునట్లు
వందనము తండ్రి, దీవింప వందనములు,
ఆశ్రమక్షేమ మెఱిఁగింపు మప్పుడపుడు.

---

# కనకరాజు

పనుమర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు

కనకరాజను నొక నియోగి చిన్నవాఁడు: తలిదండ్రుల కొక్కఁడు: ఒక్క చిన్న గ్రామమునకుఁ గరణము. తండ్రి యుండినపుడే, చిన్నతనముననే పెండిలి యైనది. భార్య నిన్న మొన్ననే కాఁపురమునకు వచ్చి యున్నది: చాల చక్కనిపిల్ల. ఒక చిన్న సామాన్యమగు పూరియిల్లు, ఏడెనిమిది యెకరముల నేల, పదిపన్నెండు పశువులు, పాత్రసామాను మాత్రమే కనకరాజునకు జనకునివలని యాస్తి. తల్లి మాటదాఁటక 'పిల్ల'ను మల్లెపూవువలెఁ జూచుకొనుచుఁ గరణం కనకరాజు పంతులు కాఁపురముఁ జేయ నారంభించెను. పాపము పదునెనిమిదేండ్లవాఁడు; కాని భారముమాత్రము పెద్దది. ఇఁక నుద్యోగమో, ఆదినములలోఁ గరణపు టుద్యోగము ఒకచేయి వెండియు, మరియొకచేయి బంగారమును. ఈ పడుచువాఁడు తండ్రివంటి బ్రభ్రాజమానుఁడు కాఁడు: మంచి చురుకుగలవాఁడు! అసలు నియోగిబిడ్డఁడు! అప్పుడప్పుడు తల్లితో, "నాన్న యీడీ తాగనేరని వాఁడు! పాపము" అని విచారించును. తల్లియు నూర్జితమంతుఁడగు కొడుకుం జూచుకొని సంతోషపడుట సహజమే కదా. "నాయనా, మీ నాన్న అన్నాళ్లు కరిణీకం చేశారన్నమాటే కాని పట్టుమని పదితులాల తొక్కు నావొంటిమీద పెట్టినపాపాన పోలేదు. నీవు మాత్రం ఆలాగ చేయకు. రత్నంలాంటిబిడ్డ, కోరి మా తమ్ముడు నీ కిచ్చినందుకు దానిముద్దూ ముచ్చటా తీర్చు. నామాటకేఁ" అని యప్పుడప్పుడు హితోపదేశము చేయుచుండును. అది యూరకపోలేదు. ఐదాఱేఁడు లగునప్పటికి 'పిల్ల' కాళ్లకు కడియాలు, అందెలు, గొలుసులు, పావడాలు, తనకట్లతావళము, వ్రేలి కుంగరమును తయారైనవి; అంతేనా! పంతులు, పదిమందిలోఁ దిరుగుచుండును గనుకఁ జేతికి గడియారమును, చెవులకు మంచి యంటుపోఁగులును జేయించుకొనెను. ఆపై సంవత్సరము దైవకటాక్షమువల్లఁ 'పిల్ల' నీళ్లు పోసుకొన్నది. పంతులు హాస్యమునకుఁ గాఁబోలు, "కొడుకును కంటే గొలుసుపేట చేయిస్తానో పిల్లా" యనెను. ఆవేళావిశేషముఁ బట్టి, హాస్యము నిజముగానే యైనది. పంతులుమాత్రము పలికి తప్పునా? బారసాలనాఁటికి గొలుసుపేటలును, బిల్లవానిచేతికిఁ జిన్న యొత్తులును జేయించెను. బంధువు లందఱును వచ్చిరి. "ఇదంతా దాని కాలిచలవయేనే యక్కా" యని పంతులుగారి మేనమామ యెంతో సంతోషించుచుండెను.

'వాఁడు' దయ దలఁచిన మనుష్యుఁడు బాగుపడుట కెంతకాలము పట్టును! ఆతరువాత మరి పదేండ్లగునప్పటికిఁ గరణంగారికి మరియొక కుమారుఁడును గుమార్తెయుఁ బుట్టిరి. పలుకుబడియా చెప్పఁదరము కాదు. ఆచుట్టుపట్టుల నెట్టివిషయము గాని వానిచెవిఁ బడకుండదు. తాసిల్దారులు, మేస్ట్రీటులు మున్నగు పెద్దపెద్ద యుద్యోగులు గూడ, వానికి రొంటిలోని పొడుముకాయలు. రెవిన్యూ, సివిలు, క్రిమినలు వ్యవహారములలో వాఁడు ముమ్ముందు నిలువఁబడవలె; లేకున్న నవి తీరవు.

పూరిల్లు పెంకుటిల్లయినది. పొలములు, తోఁటలు, దొడ్లు చెప్పఁదగినంత వృద్ధినొందినవి. వెండి బంగారములు కూడఁ దక్కువ గావు. ఇవి యన్నియు నిటులున్నవి. కాని పంతులు తల్లి మాత్రము కళ్లు మూసినది. అది యొక్కటే విచారము. పార్వతమ్మయే యిప్పు డింటిలోని మంచిచెడ్డ లన్నియుఁ జూచుకొన మొదలుపెట్టినది. తెచ్చి పడవేయుటయే పంతులుగారి పని: ఇంకఁ దక్కిన దంతయుఁ బార్వతమ్మదే. "ఈ దిక్కుమాలిన కరణంపని మానేస్తేనే గాని ఆయనకు తిండి వొంటపట్టదమ్మా" యని యామె పలుమారు విసుగు నొందుచుండును. "ఉండవే!! దానితరుణం రావొద్దూ? మన చేతిలో మాటలా? మనరోజులు కలిసి వస్తే నేను తాలూకాబోర్డు మెంబర్నే ఔతాను; అప్పు డీకరణంపని యేలాగూ మానుకోవాలి" యని పంతులు పార్వతమ్మను

క్షేమ విచార ననునయించును. మగపిల్లల చదువుమాట యొక్కచే తప్ప నితర వ్యవహారములనుగల కేవిధమగు చింతయును లేదు. అదియును తీరినది. ఒక "మెట్రిక్యులేటు" కుదిరినాఁడు— భోజనం కాక నెల కిరువది యైదు రూపాయలు—చౌక బేరమే కదా. ఇంకఁ బిల్ల పెండ్లియా? సంబంధము సిద్ధముగా నే యున్నది.

పార్వతమ్మ నిశ్చయముగాఁ గాలిచలువ గల దియే. కాకున్న నిల్లు దినదినాభివృద్ధి నొందఁగలఁడా పంతులు? తలఁచుకొన్నట్టే తాలూకాబోర్డు మెంబరైనాఁడు. "దిక్కుమాలిన కరణంపని"కిఁ దిలోదకము లివ్వఁబడెను; కాని యిప్పు డొక్క యన్నము వంట పట్టకపోవుటయే కాక నిద్దుర కూడఁ బట్టుటలేదు. అయినఁ బార్వతమ్మ మాత్రము, మునుపటివలె విసుగుఁ జెందదు. "రాచకార్యాల్లో తిరిగేవాళ్ళకు నిద్దరపోతూ వుంటే యేలాగ?" "చేయఁగల కార్యాలన్నీ ముందే యున్నవి. పిల్లలకు నొడుగులు కావాలి—వాళ్ళ తరువాత పిల్ల పెళ్ళి—తరువాత వాళ్ళ పెళ్ళిళ్లూ!!" "నిద్రపట్టడం మాటలా!" "ఆయన కాఁబట్టి నిభాయించుకుని వొస్తూవున్నారు; యింకొకళ్లయితే తెలిసివొచ్చును" అని యామె తనసానుభూతిఁ దెలుపుచు నప్పుడప్పుడు "కరిణేషు మంత్రీ" యనుమాటచొప్పునఁ జేయుచుండును.

అటుగాఁ నదృష్టవంతుఁ డైతే, ఆసు రెండు వాళ్లతో ఆట యెత్తినను గెలుచును. ఏలాగు?— అనుగున రాజు, రాణి, జాకీ, దహిలాలు కలియుటవలన. అటుల గెలుపొందినవా రెంతమంది లేరు!! అలాటిదే మానవునిజీవితమును. అది మనపంతులుగారియెడ నెంతయు నొప్పియున్నది. అతని కిల్లాలే అదృష్టదేవత; కరణీక మాను; కలిసి వచ్చినవి జిల్లా తాలూకాబోర్డుల యందు సభ్యత్వములు మొదలగునవి. గొప్పవారితో వియ్యములు, దొరలతో నెయ్యములు, మరియు బంధుమిత్రుల తియ్యములు—ఆహాహా! యేముహూర్తమునఁ గలము పట్టినాఁడో కాని, యాబ్రాహ్మణుఁడు వ్రాసిన దంతయు శాసనమే యగుచుండెను. అట్టివానికిఁ బట్టిన దంతయు బంగారమగుట యాశ్చర్యమా? ఇంగ్లీషు రాదన్న లోపము లేను. లేనే లేదు. భాగ్యదేవతకు భాషాపారుపాములతోఁ బని యుండదు. ఆమెకటాక్షమే మూలము; కాని, యది యెప్పు డెవనిపై నెందులకై పారునో యెవరును జెప్పఁజాలరు కదా!!

కాలక్రమమునఁ గోడం డ్రిద్దఱును వచ్చిరి. కూఁతు రత్తవారింటికిఁ బోయినది. పార్వతమ్మభాగ్యమే భాగ్యము! వంట చేయుట చిరకాలముక్రిందటనే వదలిపోయినది. ఐనను, అప్పుడప్పు డాయింటికి వచ్చుచుండు పట్టవాసస్థులకుఁ దెలుఁగువారి గోంగూరపచ్చడి, అరవవాళ్ల మాటుకొళంబులు, మహారాష్ట్రుల మజ్జిగపులుసు మొదలగునవి వండి స్వయముగ వడ్డించును. ఐశ్వర్యాభివృద్ధియైనకొలంది సందఱును రావలెననియే యామె కోరుచుండును. ఆమెయాదరణముఁ బట్టియే యాచుట్టుపట్టుల నున్న యువ్వలు వచ్చి, "ఆపనీ యీపని" చేయుచు సహాయపడి పదేసిపూఁటలు ఉండిపోవుచుందురు. నిజమే! ఇల్లాలిమంచితనమే, యింటికి వాసనఁ దెచ్చునది. హిందూసంఘమునకు సారమే యిల్లాలు.

మనకనకరాజుపంతు లీరీతిగ నేఁబదితొమ్మిదేండ్లు గడిపెను. అఱువదియవయేఁడును వచ్చెను. అంతవఱ కాయింట నొకరైనను బాధ నొందియుండ లేదు. మొత్తముమీఁద సుజనుఁడనియే వాడుకపడి నాఁడు. కాఁబట్టి యిట్టివానికి షష్టిపూర్తిమహోత్సవముఁ జేయుటకు బంధుమిత్రు లందఱు నేకగ్రీవముగా నిశ్చయించిరి. తిథివారసుముహూర్తములను నిశ్చయింపఁబడెను. బంధుమిత్రులకు శుభలేఖలు వ్రాయఁబడెను.— పుష్యశుద్ధపంచమి భానువారమునాఁటికి. ఇదియును పెండ్లివంటిదే కదా! అంతకంటె నింక నెక్కువయే యనవచ్చును. పార్వతమ్మకొఱకు బనారసు పట్టుచీరయు, బంగారపుపంకెలును సిద్ధమైనవి. ఇటులే తక్కినవారికిని యథోచితాలంకారములను, పట్టుబట్టలును సిద్ధము చేయఁబడెను. బంధువు లందఱును ద్వితీయ-నాఁటికే వచ్చి యిల్లు నిండిరి. బహుదూరాగ్రహారములనుండి బ్రాహ్మణ సమూహమ్ములును విచ్చేయుచుండెను. పంచమియు వచ్చినది. ఆనాఁడు, తెల్లని పార్వతమ్మ యెఱ్ఱని పట్టుచీరఁ

గట్టుకొని, వల్లని బనారసురవికపైఁ బచ్చని బంగారు వంకీలు పెట్టుకొని పంతులుగారిప్రక్కఁ గూరుచుం డెను. ఆహాఁ యాదంపతులఁ జూచి యానందింపనివాఁ డుండఁడు కదా! నాగరకత నియోగులసొమ్ము. ఆపసుపు, ఆకుంకుమబొట్టు, ఆకాటుక, ఆకొప్పుముడి, ఆచీరకట్టు, ఆమట్టు!! ఆహా! ఎంత చూచినను దనివి తీరదు. ఒడిఁ జేరి దుడుకుఁదనముఁ జేయు మనుమని సవరించుచుఁ గూఁతులతోఁ గోడలితోఁ గోడండ్రతోఁ గులదేవతవలెఁ దనప్రక్కనున్న యాజాయను జూచు కొనుచుఁ బంతులు, పడుచుఁదనపు ముచ్చటలు జ్ఞాపకము వచ్చి పరవశుఁడై కాఁబోలు పండుమీసములు పట్టి పట్టి దిద్దుకొనుచుండెను. బ్రాహ్మణాశీర్వాద మైనవెనుక నొకరూపాయి మొదలు పదిరూపాయలవఱకు యోగ్యతానుసారముగ ప్రసంభావన ఈయఁబడెను. పంచ భక్ష్య పరమాన్నములతోఁ బీటలు వంగునట్లు భోజనము లొనరించి, బ్రేవుమని త్రేన్చుచు నందఱు లేవలేక లేచిరి. ఆయజమాను లిరువురు మాత్రము మిగిలియుండిరి. అట్టి రోజు నకస్మాత్తుగ "భవతి భిక్షాం దేహి" యని వీధి లోనుండి వినఁబడెను. వెంటనే పంతులు వీధి తలుపుఁ దెఱచి చూచెను; వచ్చియున్న యతఁ డొకసన్యాసి. పంతులు చేతులు జోడించుకొనుచు "స్వామీ, దయ చేయుఁడు" అని లోనికిఁ దోడ్కొనిపోయెను.

దంపతు లిరువురును భోజనము సేయకుండుట మంచిదే యైనది. వారిరువురు సన్యాసిపాదములఁ గడిగి చక్కఁగాఁ దుడిచి, యాతనిఁ దోడి తెచ్చి వెండిపూవుల పీటపైఁ గూరుచుండఁ బెట్టిరి. "మీ రుభయులుఁ గూడఁ గూరుచొని భుజింపవచ్చును. నా కది యిష్ట" మని స్వామి యాన తిచ్చెను; కాఁబట్టి యది యట్లె జరిగెను. స్వామి కాలము తీరినవాఁడే; మంచి స్ఫుర ద్రూపి; ముఖమున మంచి తేజస్సు గలవాఁడు. "నా యనా, మీరు జ్ఞానధనము నార్జించుకొంట కిది మొదలు పాటుపడుదురు గాక! ఇది భగవదాజ్ఞ" యని యీ మాటలు మాత్రమే యాతనినోట వచ్చినవి. మరియొక మాట యేదియు లేదు. పదిమంది పదివిధముల బహు ప్రశ్నలు వేయఁజొచ్చిరి కాని యాతఁడు మారుపలుక లేదు. భోజనమైనను, గొంచెము మజ్జిగయు నన్నమును, ఒకటిరెం డరఁటిపండ్లు తప్ప మరేమియుఁ దినలేదు. లడ్డు, పరమాన్నము, చక్కి, పెరుఁగుగారెలు, పూరీలు, పచ్చళ్లు మొదలగునవి పెట్టినవి పెట్టినట్లే యుండెను. భోజనానంతరము వెంటనే యాసన్యాసి, "శ్రీమన్నా రాయణ" యనుచు వీథిలోనికి తిన్నఁగ నడచుచుం డెను. యజమానులును వెంటనంటి యుండిరి. "నేఁ జెప్పినది జ్ఞాపకముండునని నాసమ్మకము: మంచిది" యని గడప దిగి యాదంపతులఁ జూచి, బిరబిరఁ దనదారిం బోయెను.

సరియే. ఇది యైనతరువాత మరియొకటి రెండు నెలల కాయింట నత్తకును పెద్దకోడలికిని హరిః ఓమ్మని యారంభమైనది తగ వొకటి—అత్తగారి నగలన్నియు నాఁడుపడుచునకేనా యని. అది రాఁజిరాఁజి పొగగమ్మి భగ్గున మండి కుండ పగులఁగొట్టినది. పెద్దబాబు తన వంతుఁ బుచ్చుకొని యత్తవారిపొత్తునకుఁ బోయెను. కాల మంతయు నొకరీతిగఁ గడచుట యెంతవానికి?: ఇఁకఁ జిన్నబాబో—చెన్నపురిలో నొకభీమాకంపెనీకి ఏజంటుగా నుండఁగోరి యైదువేలు ధరావత్తు కట్టి, భార్యతోఁ గూడఁ బట్టమునకుఁ బోయెను. పంతులుగారి కింక దిక్కెవరు? భావమఱఁది యొకఁడు, బహుకుటుంబీకుఁడు, పిల్లలతో వచ్చి యక్కగారియాశ్రయమున నుండఁగోరెను. ఇదివఱకు గుమాస్తాలుగా నున్నవారు మరియొకచోట వడ్డివ్యాపారముఁ జేసికొనఁ బోయిరి. పశువు లొకటివెనుక నొకటిగ బలహీనములై వ్యాధి కాహుతము లైనవి. ఆభార్యాభర్త లిట్టియెడ సన్యాసి కిని బలుమారులు తలఁచుకొనఁజొచ్చిరి. ఇది యంతయు నొకయెత్తు: పెద్దబాబువలని విచార మొక్క టియు నొక్కయెత్తు. వంతులు సరిగా నీయఁబడలేదని వాఁడు తండ్రికి రిజిష్టరీయుత్తరముల వ్రాసి వ్రాసి చివ రకు దావా వేసెను. చిన్నబాబుమాత్రము తండ్రికిఁ బ్రతికూలముగా నుండక యప్పుడప్పుడు తనకుఁ గావ[illegible] వచ్చుచుండిన నూఁటయో రెండువందలో యాతనికడ నుండి తెప్పించుకొనుచుఁ దనజీతబత్తెములలో నెట్టు టులో బ్రతుకుచుండెను.

ఇటులఁ జెప్పవలయునని యెంతయో యుండును గదా! అది యంతయు నేల? అదృష్టదేవత యాతని నంతతో విడిచెనని చెప్పుట చాలు. ఇంకఁ బూవులు ముడిచిన యూరఁ గట్టెలమ్ముట కట్టివాఁడైన నిష్ట పడునా? అటులని మరేమి చేయవచ్చును? అఱువది యేండు సంవత్సరములు దాఁటుచున్నవే! అక్కటా! మూఁడుదశ లెవ్వఁడైన నెట్టులైనఁ గనుఁగొనఁగలఁడు; కాని ముసలితనము మాత్రము—రామరామా—యెట్టివారి నైనను జుట్టు పట్టి వంచును. అది పండ్లులేనిపులి!! చప్పున నమలి మ్రింగిన బాధ లేదు. కాని, యది యట్లు చేయదు. చప్పరించి చప్పరించి, పిప్పిచేసి పిండి పిండి యావల మెల్ల మెల్లఁగ దిగమ్రింగును. అట్టియెడ శరణ్య మేది? జ్ఞానము. అది యప్పటి కప్పుడు వచ్చునది కాదు. తెచ్చిపెట్టుకొందా మన్నను ఇమడదు. కాఁబట్టి యే కన్ను గలిగి, కాలుసేతులు గట్టిగా నున్నప్పుడే పట్టు పట్టి దానిని సంపాదింపవలయును. వివేకు లటులే చేయుదురు.

ఇదికూ ప్రపంచక మని వా రప్పటినుండి యను కొన సాగిరి. అంతే కాదు: అంతియుఁ బోయినది. పోఁగా మిగిలిన యాయిల్లును గనిపెట్టుకొనియున్న యాబావమఱఁది కిచ్చి, పంతులు భార్యను వెంటఁ బెట్టుకొని భద్రాచలము దారిఁ బట్టెను. కొన్ని మాసములకు వారు రాజమహేంద్రవరముఁ జేరి యొకసత్రములో బసచేసియుండిరి. ఒకటిరెండు దినము లైన తరువాత నొకశెట్టి యాసత్రమునకు వచ్చి యాత్రికుల నందఱినిఁ జూచుకొని, వా రున్నయెడకు వచ్చెను. అతఁ డా భార్యాభర్తలను జూచి, యేదియో యడుగఁబోయెను; గాని, యేలనో యడుగ లేదు. వారును అతనివైపుఁ జూచియుఁ జూడనట్లూరకుండిరి. శెట్టి మరి యైదుపది నిముసము లచ్చటనే యుండి యింటికిఁ బోయెను.

ఒకయరగంట యైనతరువాత నాతఁడు తనయిల్లాలితోఁ గూడ వచ్చి, "బాబూ, తా ముభయులును మాబసకు దయచేయండి. నే నిందాకానే చెప్పుదును కాని అమ్మగారిని పిలుచుట కెవరూ లేరని యింటికి వెళ్లి మళ్లీ వచ్చాను" అని యాబ్రాహ్మణుని గోరెను. శెట్టిభార్యయుఁ బార్వతమ్మను బహు మరియాదగ, రమ్మని బ్రతిమాలెను. నవరత్నములకు వెల నిర్ణయింప వచ్చుఁ గాని నరునకు వెల నిర్ణయింపలేముకదా. ఆ వైశ్యదంపతులయాహ్వానము నంగీకరించి, పంతులును భార్యయు వారియింటికిఁ బోయిరి. శెట్టియును దన యింటి పొరుగుననే యున్న తనచిన్నయింటిలో వారిని దింపి, వారికిఁ గావలసియున్న దంతయు నిచ్చుటకుఁ దనగుమాస్తాను నియమించెను.

మూఁడునాలుగు దినము లైన వెనుకఁ, బంతులు శెట్టి యొద్ద సెలవు దీసుకొని, భద్రాచలయాత్ర సాగింప నెంచెను; కాని, శెట్టి వినయుఁడై, "మంచిది: వెళ్లవచ్చును— మన మందఱమును గలిసియే వెళ్లుదాం లెండి, చైత్రమాసం రానియ్యండి. అంతవరకూ మీరు దయచేసి యిక్కడనే యుండుమని నామనవి" యని యత్యంత ప్రేమఁ జూపెను. పంతులు వెంటనే యేమియుఁ జెప్పలేక యూరకుండెను; కాని, మరి యొకటి రెండు దినము లైన తరువాత నాతఁడు శెట్టిని గలసికొని, "అయ్యా, మీ రెందుకు శ్రమ పడుచున్నారో నాకు తెలియదు. నాకు చాలా కష్టముగా నున్నది మనసులో" ననుచు, నేమేమో యింకను జెప్పఁబోవుచుండెను. శెట్టి దాని కభ్యంతరము కలిగించి, "మీ రేమీ విచారించవద్దు. నేను మీ రెవరో బాగుగా నెఱుఁగుదును; కాని, మీరు నన్నెఱుఁగరు. నేను తమ యింట్లో— ఒకప్పుడు వేరుశెనగకాయల బేరమునకు వచ్చినప్పుడు, తమయింట్లో మూఁడునాలుగుపూట లున్నాను. ఆయమ్మగారి యాదరణమూ, ఆమెగారు పెట్టిన యన్నమూ మరచిపోలేను. మీ రప్పుడూళ్లో లేరు. ఎందుకు లెండి యిప్పుడదంతా" అని కటకటఁబడి కంట నీరు విడిచెను. పంతులు తల వంచుకొని యూరకుండెను. శెట్టియుఁ గొంచముసే పూరకుండి మరల, "అబ్బాయి లిద్దరు బాగున్నారా బాబూ" యని యడిగెను. ఈప్రశ్నవలనఁ బంతు లించుక చకితుఁడై, "నాయనా, యెందు కాప్రశ్న? ఏమని చెప్పఁగలను? నాతో వేరుపడి నామీద వ్యాజ్యములు వేసి నన్ను కోర్టు కీడ్పించి ఆఖరి కర్తవారిపంచను చచ్చినాఁడు పెద్దవాడు. చిన్నవాడు చెన్నాపట్టంలో నుండెను.

ఏమైనాడో తెలియదు—ఇంకా నా కెందుకు వాళ్ల యేడుపు?" అని యొక పెద్దనిట్టూరుపు విడిచెను. ఆనాఁటి కా ప్రసంగము చాలింపఁబడెను.

ఆవెనుక మరియొకటిరెండుమారు లిట్టిసంభాషణలు జరిగెను. దానివలన శెట్టికిని పంతులుగారికి నొక యపూర్వానుబంధము సంభవించెను. మరియు రాను రాను పంతులు మునుపటిపంతులు కాఁడు: మారిపోవుచున్నాఁడు. ఇపు డాదంపతులమోములు, సంతోషముఁ గురియుచుండును. ఇరువురును ప్రాతఃకాలముననే గోదావరిలో స్నాన మొనరించి వత్తురు: ఆవెనుక, గీతాపారాయణము: ఆవెనుక వంటయు భోజనము: తరువాత నించుక విశ్రాంతి: యనంతరము శెట్టిగారి చావడిలో నాతఁడు పురాణకాలక్షేపముఁ జేయును. అదియైన తరువాత శెట్టి కొట్టుమీఁదఁ బనిఁజూచుకొనఁ బోవును. బ్రాహ్మణుఁడు గోదావరియొడ్డునకుఁ బోయి దీపారాధన చేయునంతవఱకు నచటఁ గూరుచొని యుండును. పార్వతమ్మ పురాణమైనవెనుకఁ గొంచెము సేపు పాటలు పాడును. ఆయమ్మ పాడుచుండెనేని యధ్యాత్మరామాయణ కీర్తనలను వినుటకు దూరవీథుల నుండియును పెక్కండ్రు స్త్రీలు వచ్చుచుందురు. అది నిజముగ నాధ్యాత్మికగానమే కాఁబట్టి యట్టి యాకర్షణశక్తి దానియం దున్నది. అది యైనతరువాత, నచట నున్నవా రందఱును గలసి లక్ష్మీపూజ సేయుదురు. ఆపనియం దిదివఱ కారితేరియున్నదే కాదా పార్వతమ్మ. అందువలన నిపు డామె యక్కార్యమునఁ బౌరోహిత్యము తనపైఁ బెట్టుకొనినది; కాని యప్పటికిని ఇప్పటికిని భేదమొకటి యున్నది: —అప్పు డామె తన కుండిన నగల నన్నిటినిఁ బెట్టి పూజ సేయుచుండినది: ఇప్పు డది లేదు; అప్పు డామె స్వార్థపరురాలు: ఇప్పు డన్నదో లోకకళ్యాణముఁ గోరుచున్నది. సరే! యిది యైనవెనుక నెవరిండ్లకు వారు పోదురు. పార్వతమ్మయు నింటికి వచ్చును. అంతలో నాముసలాయనయు గోదావరినుండి యింటికి వచ్చును. రాత్రి వా రిరువురును భుజింపరు. కాఁబట్టి మరల వంటలేదు. నిద్రవచ్చువఱకు హాయిగా నేదోయొక సత్కాలక్షేపముఁ జేయుదురు.

ఉదారబుద్ధియగు శెట్టియాదరణమున వా రిట్లు జీవయాత్ర సేయుచుండ, నంతలోఁ జైత్రమాసము వచ్చినది. ఇదివఱ కనుకొన్నట్లు శెట్టి కుటుంబముతోఁ గూడ బయలుదేఱెను. అందఱును భద్రాచలరాముని సేవించుకొని భద్రముగా మరలివచ్చిరి. కనకరాజుగా రచ్చటనే యుండఁ దలఁచిరి కాని శెట్టి యందుల కిష్టపడలేదు.

కాలక్రమమున శెట్టియైశ్వర్యము పెంపొందుచు వచ్చెను. ఇపు డాతనికిఁ గనకరాజే గురువు ఆతని యుపదేశానుసారముగ శెట్టి యెన్నో ధర్మకార్యములఁ జేసెను. కనకరాజుగా రొక్క శెట్టికే గురువు గాఁడు; గోదావరియొడ్డున నాతఁడు గూరుచొని యుండునపుడు యువకు లనేకు లాతనిఁ జుట్టుకొందురు. అప్పు డాతఁడు, "తల్లిదండ్రులది తీరనియప్పు", "కులవృత్తి సేయుట మెప్పు," "దాస్యము సేయుట గొప్ప తప్పు" మొదలగు నిట్టి 'యరగాకుంబా' మాట లేవియో పలుకుచుండును. కొన్ని సమయములలోఁ బడవలవాండ్రు, జెస్తలు, మొదలగువారును గూడ నా ముసలివానికడకు వచ్చి దండములు పెట్టి దూరముగాఁ గూరుచుందురు. ఆతఁడును నిండుమనస్సుతో వారి నాశీర్వదించును. "నాయనా, మీరు గోదావరికి ముద్దుకొడుకులు! మీదే ధన్యజీవనము. మీరు కష్టజీవులు. అక్కఱకు మాలిన జనజంభాలఁ లేవు మీకు. మీవిలువ మీకు తెలియదు. ఆ 'తెల్లగుడ్డలు గట్టుకొను దివ్యమూర్తులు' మిమ్ము లక్ష్యము సేయరు. అయ్యో, నిజము వారికిఁ దెలియకపోఁబట్టి కదా!! మీవంటివారు లేకున్న వారు చత్తురు. వారు లేకున్న మీకు నష్టము లేదు. సృష్టిలో నెండవానలు మీకొఱకే కాని వారికొఱకుఁ గాదు; కాఁబట్టి వారు గొడుగు లడ్డుపెట్టుకొందురు. చలి వారిని విడువదు. వారు దుప్పటులలోఁ గట్టి దానినిఁ బెంచుచున్నారు. మీ కవి లేవు కాఁబట్టి యా పెనుభూతము మీ కాళ్ల జోఁతఁబెట్టి పోయినది. ఇఁక రోగములో—మీ పేరు విన్నంతమాత్రమున దూరముగా పోవును! వారికో-విడువవు. వారు వాటికి మంచాలు వేసి మరియాదా చేయుదురు. ఇంకేల, నాయనా, మీవంటివారి బ్రతుకులు తెలుసుకొన్నకొలఁది, నా కేడుపు వచ్చుచున్నది. నే

స్వర్గవర్ణము గలవాఁడ నను దురభిమానము నిదే త్రెంచు కొనుచున్నాను—" అనుచు నొకవాఁ డా బ్రాహ్మణుఁడు పెద్ద యావేశము నొంది జంధెమును ద్రెంచి గోదావరిలోఁ బారవైచెను.

నిజమే! "జగ మెఱిఁగిన బ్రాహ్మణునకు జంధెం బేలా" యని యప్రహతముగా వినుచున్నమాట నిజమే!! కాని లోకములో—? యోగ్యతాయోగ్యతలఁ జూడరే!...

'నాస్తికుఁడు', 'ముసలి కొంగ,' 'కర్మభ్రష్టుఁడు', 'భోసిపులి' మొదలగు తిట్టిమాటల కన్నిటికో సరియైనవాఁడు కదా పాప మా ముసలివాఁడు! వినలేక శెట్టికిఁ జెవులు చిల్లులుపడినవి. "ఇతడ్ని పంపించండి అవతలి కింక", "ఇతనిగాలి సోఁకితే, సచేలస్నానమాచరేత్" అను నీమాటలే, శెట్టి యెవనినోటనుండి విన్నను. శెట్టి స్థిరచిత్తుఁడు కాఁబట్టి సరిపోయినది గాని, లేకున్న కనకాచలంగారి కథ కంచికి వెళ్లవలసినదే యీపాటికి! ఇంక నీ "కూకాళపతివ్యవహారము"లోఁ బార్వతమ్మ మాత్రము పడక తప్పుకొనవలెనా? అమ్మలక్క లూరకుందురా!!—కాని రెండు వెంటలే మేమి యనుచున్నను, ఆభార్యాభర్తలు మాత్రము నోరెత్తరైరి! అదియును తప్పేకదా! "చేయరానిపని చేసి మీఁదుమిక్కిలి మానవుఁడయా?" "అంతకంటె మరే ముందును?"—

మార్కండేయస్వామివారి యాలయములో వైదికసభ చేయ నిశ్చయింపఁబడెను. దినవారములను నిర్ణయించుకొనిరి. శ్రీ మచ్ఛంకరాచార్యులవారి కీవృత్తాంతము వ్రాయఁబడెను. ఈగడచిన దన్నియుఁ జూచి శెట్టి యూరకుండెను. కులమునుండి వెలివేయుదు మనుబెదరింపు లాతనికిని వినఁబడినవి. తప్పలేదు. కాని, యాతఁడు కదలలేదు. "వైదికసభవారు నిర్ణయించిన ప్రాయశ్చిత్తమును చేయించుకొని మాదివ్యపాదుకలకు నూటపదార్లు అపరాధముగా చెల్లించునది" యని స్వాములవారి శ్రీముఖము కనకరాజుగారికిని సభాధిపతులకును వచ్చినది. సభవారు దాని నూరేగించిరి. కనకరాజుగారు శెట్టికి దానిం జూపి చించివైచెను. శెట్టి యాతనికాళ్లపైఁబడి, "మీరు పెద్దలు, మీకు తెలియనిది లేదు. కాని, నామనవి వినండి; నే నానూటపదార్లు పంపుకొనగలను. మీ కేల యీరట్టు? ప్రాయశ్చిత్తము చేయించుకొనరాదా" యని యింక నేమో చెప్పఁబోవుచుండెను; కాని, కనకరాజుగారు వారించి యిట్లనిరి:—"నాయనా, నేను ప్రాయశ్చిత్తమునే చేసుకొన్నాను. కూటికై కులవృత్తిని గూల్చిన గూళకు జన్నిదమా? అంతరాత్మను వంచింపు మందువా? వద్దు. మోసపోకు. ధర్మమే గొడుగు, పాపమే పిడుగు. రేపేకదా సభ. వాలో రమ్ము; నాయుదంతము—నిజమైనది—విందువు. నా బ్రతుకును, నాసంసారమును, నీవు చూచియుంటివేమో! నీవు చూచినదానికిని, వినినదానికిని, అచ్చమైన సత్యమునకును ఎంత వారడి యుండునో నీకే యెఱుకపడఁగలదు. గొఱ్ఱెదాటు బేరము వద్దు. పరమేశ్వరుఁడు నీయంతరాత్మలో నున్నాఁడు. వానిని మెప్పించి తిరుగు: సన్యాసులకు నూటపదార్లిచ్చుసమయము కాదిది" యని. శెట్టి మరియేమియు ననలేదు.

మఱునాఁడు మధ్యాహ్నము మూఁడుగంట లగునప్పటికే మార్కండేయస్వామి యాలయమునకు జనులు గుంపులుగుంపులుగా బయలుదేఱిరి—వేడుక కదా! నాలుగుగంటలకు సభ యారంభింపఁబడనున్న దనఁగాఁ గనకరాజుగారును, శెట్టియును, వారి ననుసరించినవారు మరి యొకగుంపును లోనఁ బ్రవేశించిరి. మరి యెట్టియాలస్యము నేయ నేల యని పంతులు, వెంటనే పైనున్న బట్ట నడుమునకుఁ జుట్టుకొని, యగ్రపీఠమును సమీపించి చేతులు ముడుచుకొని యిటు లుపన్యసింపఁదొడఁగెను:—

"మహాజనులారా,

"మీయందఱికిని నమస్కారములు. మీకుఁగల మతాభిమానమునకు నే నెంతో సంతోషపడుచున్నాను. మీ కూరక శ్రమ కలుగ నేల యని నేను ముందుగా వచ్చియున్నందుకు నన్ను మన్నించండి. నాకథ నేను వినిపించవలయునని యిచట నిలువఁబడి యున్నాను. నామాటలన్నీ విని యావెనుక మీయిష్టము వచ్చినట్లు మాటాడుకొన వచ్చును.

"నాజీవిత మెటు లుండెనో యది యెఱింగి యున్నవారు కొంతమంది యీపథియందున్నారని నే నెఱుంగుదును. నా కెఱింగియున్నది కేవలము నాబాహ్య చరిత్ర. అది కాదు నేను మీతో చెప్పవలసియున్నది. నాయంతశ్చరిత్రమునే నేను చెప్ప నిశ్చయించుకొన్నాను దీనిని చెప్పుటవలన నా కేదియో లేనిపోని యొకగుణమో దోషమో యారోపించవద్దని నామనవి. నేను పడుచున్న పశ్చాత్తాపము వెలిఁబుచ్చి పదిమందిలో నాపాపములను బోఁగొట్టుకొనుటయే నాముఖ్యోద్దేశము. ఇంక మీయిష్టము. ఇదిగో వినుండు.

"నే నొక చిన్నయధికారికిఁ గరణమునై యుంటిని. నాతండ్రి యుంచినదానితో నా కేమాత్రపు తృప్తి యును కలుగలేదు. కాఁబట్టి నేను డబ్బు సూటగట్టుటకు నిశ్చయించుకొంటిని. అప్పటినుండి యారంభించితిని నాలౌక్య మంతయు:—అమాయికులగు రైతుల కళ్లలో దుమ్ముగొట్టితిని: తలలు మార్చితిని: తగవులు పెంచితిని: దొంగదస్తావేజులు పుట్టించితిని. నేను ముట్టించినకొంప లింకను మండుచుండును. అయ్యా, ప్రజాసేవఁ జేయుదునని తాలూకాబోర్డులో తలఁబెట్టితిని. కష్టజీవులగు ప్రజలసొమ్ము పప్పుబెల్లములవలె తినుచుంటిని. నే నాడుచుండిన దంతయు బొంకే; చేయుచుండినదంతయు స్వలాభము కొఱకే!! నా పెద్దమనిషితరహా, యిది, ద్రోహము, వంచన, అసత్యము, అప్రమాణము—ఇవి నా పెద్దమనిషితరహాకు ముఖ్యలక్షణములు. విన్నారా— ఇదియే లౌక్యము! ఇఁక నావైదికమో?—నే నెన్నఁడు గాని నన్ను పొగడని బాపనయ్య కొకదమ్మిడీ యివ్వలేదు. దంభముతో సంతర్పణలు చేసితిని. అహంకారముతో నే దినములు వెళ్లఁబుచ్చితిని గాని మరియొక సుగుణమునకై యాశించియుండలేదు. ఇది యంతయు దేని కొఱకు?—డబ్బుకొఱకు. సరియే—యేఁబదివేలు గడించితిని—తృప్తి తీరినదా?—లేదు! మీఁదుమిక్కిలి నాకొడుకే నాకు శత్రువై న్యాయస్థానముల కీడ్చినాఁడు. నాషష్టిపూర్తితో నాపాపపూర్తి యైనది. అది యెట్లు వచ్చినదో యట్లే పోయినది. ఆడబ్బు పోవుటయే మంచిది యైనది. రాత్రులయందు నిద్ర పట్టించినది కాదు. అన్నము దిననిచ్చినది కాదు! అయ్యయ్యో. ఇఁక నాభార్య, అదిగో—నాభార్య!! నగ లన్నియును పోయినతరువాతనే మాకు నిజమైన పరస్పరప్రేమ కలిగినది. అంతకు ముందో?—నన్నామె నమ్మదు,—నే నామెను నమ్మను. మాకిప్పుడు వివాదములే లేవు. బంధువులు మాకొఱకు రారు. విచారము నన్ను విడిచి పోయినది. కొట్టినకర్మమా యని పెట్టుచున్న యన్నము నొకపూఁట దిని హాయిగ నున్నాము.

"నేను నిశ్చయముగా దేవాలయములోనికి రాఁగూడని వాఁడను—మీరు నమ్మండి, నమ్మక పొండి!! ఇటువంటివానకు జన్నిదము లేదని మీరు పరితాపపడుచున్నారా! రామరామా!! వద్దువద్దు. మాదుట కొక మాలిపోఁగే యది. వినను, దానియం దొకప్పు డద్భుతశక్తి యుండెడిది. ప్రస్తుతము, పుష్టికి ముఖ్యచిహ్నమే యైనను, అది పూర్వము మహాపవిత్రమై యుండెడిది. నిర్వీర్యుఁడను, అపవిత్రుఁడను, అసత్యపరుఁడను నేను: నా మెడలో నట్టిమహాసూత్ర ముండరాదు. నిజముగా నుండరాదు!! కాఁబట్టి దానిం ద్రెంచి గోదావరిలో వేసితిని. నా కింక నేల దురభిమానము? వద్దు వద్దు! ఇంకనూ ఆత్మవంచనమా! చిన్నపిల్లవానిచేతికి చిక్కిన కత్తివలె, అయోగ్యుఁడనగు నాకంఠమున నుండి యా దివ్యసూత్రము నాకు బాధ కలిగించినదే!! నే నేదో గొప్పవాఁడ ననుకొనుచుంటిని. ఎవరికష్టము వలన నేను బ్రతుకుదునో యట్టి వారిని ముట్టుకొనుటకుఁ గూడ నసహ్యపడుచుంటిని!! కాయకష్టమువల్ల నే కడుపు నింపుకొను పరమయోగ్యులచే కాళ్లు పట్టించుకొంటిని: కష్టపడ నిష్టము లేక "గప్పా"లు కొట్టుచుండుట నాకొక వృత్తియైనది. సిగ్గు! సిగ్గు—తలఁచుకొన్న కొలఁది రోఁత—మరి వద్దు, మరి వద్దు. నన్ను నేను సవరించుకొన్న తరువాత చూచుకొందును. ఇప్పటికిది తగియున్నది.

"అయ్యా! ఇఁక నాకు సెలవా?- మీ కే కీ వృథాప్రయాసము? నాకర్మ మిది. నామర్మ మిది. ఇఁక మీధర్మ మేదో చూచుకోవచ్చును. సెలవు సెలవు!!!" అని మెల్లగా దారి చేసుకొని వచ్చి యీవలఁ బడెను.

ఇఁక మరి సభ యేల? ఎట్లు జరుగును? సదస్యులు గొల్లు పెట్టి యావలకు వచ్చుచుండిరి. ముసలివానిని విమర్శించినను గులెంది వారిలో నొకఁడైనను వెనుకదీయ లేదు: మతముమాత్ర మూరకుండునా? కల్ల!! ఐన మన ధోరణి మరియొకలా గుండవచ్చును. "పశ్చాత్తాపము కలుగుట యరుదు. పూర్వపుణ్యవశమున నది కలిగెనా, మన బ్రతుకు బంగారమే యగును. మనమే దేవతల మగుదుము" అని. కాని దురభిమానపిశాచమో?— ఇది పోతే గాని అది రాదు. అది రాకపోతే యిది పోదు. ఇంతకు నీశ్వరానుగ్రహ మున్న యెడల నన్నియుఁ జిన్న పడును.

ఆ మఱునాఁడు కనకరాజుగారు శెట్టియును దమచావడిలోఁ గూర్చొని యేదియో మాటాడుకొను చుండిరి. అప్పుడప్పుడే బజారులు తెరువఁ బడుచుండెను. అట్టియెడ నొకయువకుఁడు, తొమ్మిది పదియేఁడులు గల మరియొక బాలకుని వెంట నిడుకొని, యాచావడిలోనికి వచ్చి, "మామగారూ, నమస్కారము. నాన్నా, తాత గారికి నమస్కారం చెయ్యి" అని నిలుచఁబడెను. "రండి—కూర్చోండి. నాయనా, మీ రెవ్వరు?—పోల్చ లేను, మనుపటిలాగ" అని కనకరాజుగారు వారిని గూరుచుండఁబెట్టిరి.

శెట్టి— బాబూ, మన కేవూరు?

యువ— మాది విజయనగరం.

శెట్టి— ఈ అబ్బాయి మన కేం కావాలి?

యువ—నా మేనల్లుడు—అక్కకొడుకు; కనకరాజుగారి పెద్దకుమారుని కొడుకు.

కనక—ఇక్కడి కెందు కొచ్చారు నాయనా?

యువ—నే నీవూళ్లో బియ్యే క్లాసులో చదువు కుంటున్నాను; మాఅక్కయ్య కూడా నాకు సంరక్షణ కోసం వచ్చింది:— బండిలో వుంది, పిలుచుకొస్తాను.

అని యామెను దీసికొని వచ్చెను ఆమెపేరు కమల. ఆమె ముఖమునకు సగము చాటు పెట్టుకొని మెల్ల మెల్లగ వచ్చి తలుపుచాటున నిలుచఁబడఁగనే కనకరాజుగారు "పార్వతీ" యని భార్యను బిలిచెను. పార్వతమ్మగారు వచ్చి చావడిలోఁ గాలు పెట్టియుఁ బెట్టక మునుపే కమల యామెకంఠమును గట్టిగఁ బట్టుకొని, "అత్తా అత్తా" యని యేడువఁ దొడంగెను. తాతగారు, "అమ్మా! యేడుస్తా వెందుకు? దైవవిలాసం. పార్వతీ! లోపలికి వెళ్లండి" యని వారిం బంపెను. శెట్టియుఁ దనకార్యములఁ జూచుకొనఁబోయెను. ఆనాఁటికి వారందఱు వచ్చుట నుండిరి.

మరునాఁడుదయమునఁ దనతమ్ముఁడు బండితెచ్చి వాకిటఁబెట్టి కమలను రమ్మనెను. కాని యామె వెళ్ల లేదు. తమ్ముని వంటపూఁటియింట భోజనము చేయు చుండుమని చెప్పి పంపినది; ఆనాఁటినుండియు నత్త మామలను గనిపెట్టుకొని, శెట్టికి నిజముగ సోదరి యై, సుఖముగ బ్రతుక నారంభించెను. పిల్లవానికిఁ దాత గారే చదువు చెప్ప నారంభించిరి. వానిపేరును దన పేరే. హరికటాక్షమువలన వారు సుఖముగా నున్నారు. ఇటుల నొక నెలదినము లైనతరువాతఁ గమల యత్త మామలఁ గూర్చుండఁబెట్టి యిట్లనెను:— "నా తండ్రి న న్నేదో వుద్ధరిస్తానని చెప్పినమాట లన్నీ వట్టి బూట కాలు. నామనస్సులో ఆందోళనమంతా పోయింది. కాబట్టి నే నిప్పుడు మాట్లాడగలను. ఇన్నాళ్లూ మాట్లాడ లేదు. నాకథ మీతో చెప్పక తీరదు. మీరు నన్ను మళ్లీ రానిస్తారని నేను కలలోకూడా అనుకోలేదు. కాని మీరు గతించినదానిని కడుపులో పెట్టుకోకుండా, సుందరమ్మనులాగే న న్నాదరించారు. పిల్లవా డెది గితే చూదాం అని నాడబ్బంతా గుటకాయస్వాహా చేశారు మా నాన్నగారు. చివరకు మీరు రాయించి యిచ్చిన కరణపుమాన్యం మాత్రమే దక్కినది—మీ నాయనగారిదని మీరు మీ పెద్దకొడుకుగారి కిచ్చింది. అదికూడా అమ్మతా నన్నాడు మా అన్నయ్య. కాని నే నొప్పుకోలేదు పిల్లవా డద్దాన్న మైపోకుండా దైవం కాపాడి మీకంటఁ బెట్టినందుకు నేను ధన్యాత్మురాల్నే. ఆపొలం తాలూకు కాగితాలు నాదగ్గర్నే పెట్టు కున్నాను. నా కెందు కవి? మీ కడుపులోవాడే వాడు. మీపెద్దలపేరుగా వా డున్నాడు. ఇంక నేను

మీ యుభయులకు నౌకరును గాని స్వతంత్రురాలను కాను."

ఆమాట కా దంపతు లేమియు ననలేదు. పెద్ద నిట్టూరుపు విడిచి కొంతసేపటికి తాతగారు, "అమ్మా, సత్యమే జయము. చూడు, మానాయన యెంత యోగ్యుఁడో. కష్టార్జితమే నాకిచ్చినాడు: కాఁబట్టియే యది నిలిచినది. ఆహా, సర్వేశ్వరా" యనెను.

కొంతకాలముతరువాతఁ గనకరాజుగారు కండ్లు మూసిరి. వారివెనుకఁ బార్వతమ్మయుఁ గాలముచేసినది. దయావిశిష్టుఁడగు శెట్టి యాదంపతులపేరుగ నొకమఠము గట్టించెను. ఆవెనుకఁ జిన్నకనకరాజును వాని తల్లిని వారిస్వగ్రామమునకుఁ దోడ్కొనిపోయి వారియింటఁ బ్రవేశపెట్టెను. ఆయింటనుండిన వారు పార్వతమ్మగారి మఱఁదలును, ఆమెపిల్లలును. శెట్టి వారికి మఱొకయిల్లాయూరనే కొనిపెట్టి వెడలిపోయెను.

కనకరాజుగారు విడిచిపెట్టిన కరణీకమును చిన్నపెద్దలసహాయమువలనఁ జిన్నకనకరాజు సంపాదించుకొని, వివాహితుఁడై, తల్లిమాట దాఁటక, ధర్మము దప్పక, ఆయింటిపేరు నిలువఁబెట్టుకొనెను.

అనంతరమునఁ గొంతకాలమునకుఁ బినతండ్రియు, పినతల్లియుఁ గూడ వచ్చి యాపితృగృహమునందే తమ జీవితములఁ గడిపిరి.

---



విఠోబా దేవాలయగోపురము, పండరిపురము

సుమనమశోభనమూర్తుల-సమానురాగమునఁ బ్రణయజగ మేలెడి శ్రీ
రమణీరమణుల కీకృతి - సమర్పణముఁ జేసికొంటి సౌభాగ్యమునన్.

వెలయు భారతమున వింధ్యాద్రి, దానికి - దక్షిణమున వెలయు దండనగము,
దానిఁ జుట్టియుండు దారుణమరుభూమి; - దండగిరియె మనకథాస్థలంబు.

ప్రొద్దుంజాయలవేలుపు - ముద్దియ యొక్కర్తు, తూర్పుమొగ, గగనముపైఁ
బ్రొద్దుపొడుపును న్నొకనాఁ - డద్దెస నేతెంచుచుండె నవసీస్థలికిన్.

కటికిచీఁకటిమేలుకట్టుపందిళ్లపైఁ వెన్నెలతీవలు విరిసినట్లు,
నిద్దంపుమబ్బుల నీలిచేలములపైఁ గ్రొమ్మించుపువ్వులు గురిసినట్లు,
ననదమ్మిదొర యేట్కొనుచాయ కురులపై వాఁముత్తెపుసరుల్ వ్రాలినట్లు,
మున్నీటితరఁగలముద్దుటుయ్యేలలపై నక్షత్రనౌకలు నడచినట్లు,
కొనలు సాఁగి విరిసి గోళికలై ప్రాఁకి - కడలఁ దేరుగట్టి, కారుక్రమ్మి,
నిండి, నింగినెలఁత నెమ్మేనికాంతులు - పుడమి నద్భుతముగఁ బొడవుసూపె.

కానని వారలు, కాన - న్గానగు, గంగావతరణనాటక మిట, గౌ
రీనాథుం డాశైలముఁ - గానంబడెనేని వేల్పుగతితకు గుఱిగాన్.

తలఁపులమెఱపో యనఁగా - వెలఁదుక భూమ్యంతరాళవీథిం దిగుచున్
దలఁపుల మెఱపులు మదిలోఁ - దలతల మెఱయంగ నిట్లు తలఁపందొడఁగెన్—

కసవ్రమొ క్కొకటైనఁ గంటికిఁ గనరాదు, చెట్టుచేమలమాట చెప్పనేల?
చిఱుదోమ యొకటైనఁ జెంగటఁ గనరాదు, చిలుకపక్షులమాట చెప్పనేల?
చలిచీమ యొకటైన సన్నిధిఁ గనరాదు, గొప్పజంతులమాట చెప్పనేల?
చప్పరం బొకటైనఁ జక్కటిఁ గనరాదు, చిగురుటిండులమాట చెప్పనేల?
చాఁపరాలికొండలోఁపల గుహా యొండుఁ-గాక వేఱు గానరాకయుండె,
సమరయోగి యుండు నాశ్రమమా యిది? - యనుచుఁ గాంత భూమి కవతరించి.

క్రమముగ గుహాలోనికిఁ జని - సమాధినిష్ఠుఁడగు నొక్కసంయమిచంద్రున్
విమలప్రేమానందుని - సమానుపానంత తేజు నవలోకించెన్.

కని వాని తపోనిష్ఠకు - ఘనతేజంబునకు వెఱఁగుఁ గాంచుచు, ద్వారం
బున నిలిచియుండి, యాతఁడు - కను విచ్చిన వెనుక మ్రొక్కి కామిని యనియెన్.

గంగ యొక్కటి లేదు గాని, యాదలమీఁద, సరికట్టునిడువాలుజడలచుట్టు,
కాఁక కన్నొక్కటి లేకయున్నది గాని, నొసటఁ గస్తుట్టు సిందూరపుబొట్టు,
పాఁపపేరొకటి తోఁపదు గాని గళమునఁ, బొడకట్టు రుదురాకపూసకట్టు,
గజచర్మ మొక్కటి కానకున్నది గాని, కటిచుట్టుఁ గనవచ్చుఁ గావిపట్టు,
పూవుటమ్ములవాని పోలుపెల్లఁ జెఱిచియు - మంచుకొండపట్టి మఱవలేక,
తపముసేయు శివుని తలఁపించునీకు నా-ధన్యవాదము లివె తాపసేంద్ర!

సారతరాత్మయోగమున సంయమచిత్తుఁడవై సమస్తసం
సారము సారహీన మనుచాడ్పున జానపదంబు వీడి కాం
తారములందు కర్కశపథంబుల నొంటిగ నుండి ప్రేమసం
చారము సేయు నీచరణసన్నిధిఁ గంటిని దాపసోత్తమా!

అన విని, యోగివరేణ్యుఁడు - మనమున నద్భుతరసంబు మల్లడిగొనఁగాఁ
దనలో నడంచికొని, య-వ్వనజాక్షిం గాంచి పలికె వాత్సల్యమునన్—

కలికి, యోగినివయి కన్పట్టుచుంటిని యెందుండి వచ్చితి విచటి కిపుడు?
పరు లెవ్వరును రాని మరుభూమి నేకాంతవాసినై యున్ననావలన నీకుఁ
గాఁగలకార్యంబు గలదె? సర్వంబును విడిచిన నా కేమి గొడవ లింకఁ?
బరమార్థ మొక్కటి పలికెద నీధన్యవాదంబు లొల్లనివాఁడు గలఁడె?
గ్రాహ్య మది గాదు, పూర్వమర్యాద గాని - మరల నాశీర్వదించనిమాట గాని,
వానితోడి నిమిత్తంబు వదలిపోయె - సకియ! యవియెల్లఁ బూర్వాపతములు నాకు.

తనదగు కష్టమో సుఖమొ దగ్గఱజీవి కెఱుంగఁ జేయులే
మనుజుని నైజ; మట్లగుట మానవుఁ డొంటరిజీవి కాఁడు; నా
యనుభవ మట్లు గాక, నడయాడఁగరాని మనోరథంబుపై
నునిచిన దేవమూర్తి కయి యుందు నిదే విజనస్థలంబునన్.

ఈమనోరథ మొకచోటి కేఁగకుండ - జాఱినది కాలవారిధిఁ జక్ర మొకటి,
జీవసంకులరణ మింకఁ జేరరాక - విఱిచియుంచితి దీని నీవిజనసీమ.

సారథి యేమి యయ్యెనొ, యసాధ్యపుగుఱ్ఱము లెందు చిక్కెనో
నేర వచింప; నానిలుచు నిర్జనవాటికి నేఁటి కెవ్వరున్

రారు; పథంబు దప్పి యిటు రావుగదమ్మ! ప్రపూజ్యురాల వే
తీరున గౌరవింతు నినుఁ, దీఅసివిస్మృతితీరవాసినై.

అతిథిమర్యాదలను మఱచితిని; సకల-లౌకికాచారములకు(జలంబు లిడితిఁ
బాఱవైచితి మున్నె యాపరికరముల,-నే గృహస్థుఁడఁ గాను మన్నింపు మమ్మ!

అన విని యోగినీతిలక, మార్య సపర్యలు, సానుభూతిసాం
త్వనములు, గౌరవాదిబిరుదంబులు నొందఁగ వచ్చియుంటినే!
విను మవిమెల్ల వింగడపువిత్తులు; వానికినై వివేక లే
మని మనసుంతు, రయ్యవి సమస్తము వచ్చె, హితోక్తి చాలదే?

నే వచ్చితి నినుఁ జూడఁగఁ-గోవిద! జగదేకమాతఁ గొలిచెడిపని కం
తేవాసినులగు యోగిను-లీవాసంబునకుఁ బంప నెంతయుఁ బ్రీతిన్.

నీయున్నచోటుఁ గంటిని-నీయున్నతభావములను నినుఁ గనుఁగొంటిన్
నాయుల్లము చల్లపడెన్ - ధీయుత! నను వినుము కార్యనీక్షిత నగుటన్.

భౌతికభోగభాగ్యముల పాయనిచింతలఁ జేసి, దైవని
ర్ణీతపథంబు డాసి, ధరణీస్థలిఁ బాసిన నేను, యోగవి
ద్యాతిశయప్రభావమున నూర్ధ్వజగంబుల కేఁగి, యోగినీ
వ్రాతముఁ జేరి మాతృపదవారిజముల్ భజియింతు నిచ్చలున్.

తనకూర్మిజగతి కంతకుఁ దల్లియై యొప్ప నిఖలేశ్వరిని గొల్చి నెగడు దానఁ
దనపేర్మి లోకసంతతి కొజ్జయై యొప్ప కల్యాణిపదపూజఁ గ్రాలుదానఁ
దనలీల భువనభద్రత కూఁతయై యొప్ప సర్వమంగళ సేవ సలుపుదానఁ
దనఖేల విశ్వపాలన కెల్లయై యొప్ప పున్నెంపుసతి నోముచున్నదాన,
వనజగర్భుని ఘనవేదవల్లిలోని,-వలిమలల్లుని సుజ్ఞానవల్లిలోని,
వనజనాభుని యానందవల్లిలోని-కుసుమముల లోకజనయిత్రిఁ గొలుచుదాన.

కానక యేని తెమ్మెరల కౌఁగిలి కందనితావిపూలు, సుం
తేనియు నాలితుమ్మెదల యెంగిలి నొందనితేనెపూలు, సం
తానమనోజ్ఞపుష్పసముదాయముకంటెను మేలిపూలు, నీ
కోన లభించునా జననిఁ గొల్వఁగ? నా విని యోగి యిట్లనున్.

దగ్ధహృదయుండనైన నాతనువుపోలె-నామెలంగెడి యీమరుభూమి కూడ
నుగ్రసంతాపరూపమై యున్నయపుడు-కోన నా కేడ? పూవులగొడవ యేడ?

అని విరాగవృత్తి నాయోగి పలుకంగ-నాలకించి భావ మాకళించి
కనికరమున నతనిఁ గాంచి యాదర ముంచి-యమరలోక కాంత యనియె నిట్లు—

కాము నే మదిలోనొ కట్టిపెట్టితి గాని వదలనివయ నేమి వ్రాలెనయ్య
కోర్కె లేపాదిలోనొ గ్రుచ్చియుంచితి గాని మఱవనిమన నేమి మాఱెనయ్య
ఆస లేగుదిలోనొ యణఁచియుంచితి గాని తిరుగనిమన నేమి తీఱెనయ్య
భావ మేగదిలోనొ పట్టియుంచితి గాని మ్రొగ్గనివల పేమి తగ్గెనయ్య
అనుభవమునఁ గాక యడఁగునే కర్మంబు-మెసవు టుడిగి కాన మెలఁగినంత?
యొడలు చిక్కఁబెట్టి యొంటెడిఫల మేమి? - యిట్టిముక్కుమూఁత లేటికయ్య?—

అనుచుఁ గాంత వలుక, నంతరంగంబునఁ-గొంత చింత నొంది, కొంత కనలి,
తాను యుపశమిల్లి తాపసుఁ డిట్లను-భావభంగి కొంత బైటఁబడఁగ.—

పరసతి వీవు, నిన్నుఁ గని పల్కఁగ భావ్యము గాదు నాకుఁ, దీ
వరముగ నంతరంగమున వ్రచ్చి కనుంగొనినట్లె మాటలం
జరపెదు; జీవి కేది యవసానమొ? కర్మము దేనియందు రూ
పఱునొ? నిరాశపేరిటితపం బది గంటి నిదే వియోగి నై.—

మును జనకుఁ బరీక్షింపఁగఁ - జనుదెంచినసులభ వగుచుఁ జతురోక్తులతో
నను జంకించెదు చెలువా! - జనకుఁ డగుట నాకు సులభసాధ్యమె! యనినన్.

అనఘ! జనకుండవైన నీ వగుదువేమొ! - కల్ల గా దేను సులభను గాఁ జుమయ్య!
పుణ్యనిధులైన మీవంటి బుధుల కరుణ - నంటఁ బూజించు దాసురా లగుదుఁ గాని.

ఏదొ! వియోగినంచు వచియించెదు, దానికి నావిరాగమే
కాదొ ఫలంబు? దానికయి గట్టినిరాశ ఘటింపఁజేయఁగా
రాదొ? నివృత్తిమార్గమున రానిది కర్మము కాదొ? కర్మముల్
గాదన నేల? యీ తపము కర్మము కాదొ? తలంచి చూడుమా!

చంచలంబులు చర్వితచర్వణములు - భద్రరహితంబులును సుఖాభాసములును
నైన భౌతిక భోగభాగ్యములకొఱకు - భావమునఁ బ్రాజ్ఞుఁ డెవ్వాఁడు పరితపించు?

నా విని తాపసోత్తముఁడు నాతిఁ గనుంగొని పల్కె నిట్లు—నీ
భావము మోక్షమార్గమునఁ బర్విడుచున్నది; ముక్తిమార్గ మేఁ
గావలె నంచుఁ గోరుకొను కర్కశచిత్తుఁడఁ గాను; ప్రేమసం
భావితభావలోకము తపంబునఁ గాంచితి శాశ్వతంబుగన్.

ఉన్నది నిరాశ భౌతిక - మన్నది, యదియే నివృత్తి యగుటనె కాదా
మన్నది భావజగంబై - కన్నది ప్రణయామృతముగఁ గైకొనఁ గంటిౘ.

వెగటు దోఁపఁగవచ్చు వీణానినాదంబు విడువక నిరతంబు విందువేని
చేఁదు దోఁపఁగవచ్చుఁ జిన్నిపూఁదేనియ తిరుగక సతతంబుఁ దిందువేని
కుందు దోఁపఁగవచ్చుఁ జందురు నునుఁగాంతి కదలక యనయంబుఁ గందువేని
అలసు దోఁపఁగవచ్చు నామనియందంబు కొదుకక యేప్రొద్దుఁ గొందువేని
భౌతికంబు విరక్తికిఁ బ్రాపకంబు; - అమృతనాదంబు, దివ్యరసాయనంబు,
అమృతతేజంబు, దివ్యసిద్ధామధంబు - భావలోకంబు నిత్యసౌఖ్యావహంబు.

ఊరక నవ్వెనో? మెఱిఁగియుండియు నాజడదారిమాటలౘ
జీరికిఁ దేక నవ్వెనొ? వచింపఁగ నేరము గాని, యంతలో
మారిచి మోము చిన్నెలకు హాసము దిద్ది, లతాంగి వాతెఱం
జేరిచి తర్జనిౘ, దపసిచిత్తము నొత్తక యొత్తి యిట్లనుౘ —

తలఁగిపోకుండునే తళుకులమెఱుపది కనుమూయునంతలో గంతు వైచి,
మెసిపోకుండునే యింద్రధను స్సది తిలకించునంతలో దివముఁ బాసి
కలసిపోకుండునే కళ లీను చుక్కది పరికించునంతలో బాటఁ దప్పి
వాడిపోకుండునే వలపులపూవది వీక్షించునంతలో వృంత మెడలి
బాహ్యజగమున కది పరిపాటి యగుట - భావజగమున కదియె స్వభావ మగుటఁ
దలఁచి చూచియు నావినోదములకొఱకుఁ - బరితపించుట వట్టివిభ్రాంతి కాదె? —

నావుడు నిట్టూర్పుచు, దృఢ - భావంబునఁ దపసి పలుకుఁ బకఁతిం గనుచుౘ
నీ వన్నది, నా కన్నది - భావింపమిఁ గనమిఁ గాదె పావనచరితా!

చూపులఁ దోఁచు నీజగతి శూన్యము నశ్వర మంచుఁగాక, నా
లోపలి క్రొమ్మెఱుంగులును, లోపలి యింద్రధనుర్విలాసముల్
లోపలిచుక్కచుక్కలును, లోపలి నాపువుఁగమ్మఁదావులుౘ
లోపలి దివ్యలోకపు వెలుంగులుఁ జూచిన నట్టు లందువే? —

నాచందమామయందమ్ము చూతువు గాని నే నున్న నింగిపై నిలువు మమ్మ!
నారత్నహారంపు నాడె మెంతువు గాని నే నున్న కడలిపై నిలువు మమ్మ!
నారాజహంసికనడక లెన్నుదు గాని నే నున్న కొలనిపై నిలువు మమ్మ!
నా మించుఁబ్రొందీవగో మెంచుదువు గాని నే నున్న మబ్బుపై నిలువు మమ్మ!

పటుకృశత లేదు, పార్థివంబును గాదు, - మానసంబు విడదు, మాయఁ గనదు,
దివ్యభావరూప తేజోజగం బది - నిలుతు వమ్మ! చూడఁ దలఁతు వమ్మ!—

నామనోరథకేతనంబున నలరారు నాసువర్ణపదవిలాస మెంచి
నాయంతరంగవీణాస్వనంబునఁ దేలు నారాగవృత్తవిహార మెంచి
నాహృదయనికేతనద్వారమునఁ గ్రాలు నాదళపుటరూపకాదు లెంచి
నాభావసింహాసనాస్థాని విలసిల్లు నాకృతి శుభమూర్తి నాకళించి
మించఁగలవేని తనకటాక్షాంచలములఁ - బ్రణయవిశ్వాస శాశ్వతపదవి నుంచి
భావసౌభాగ్యభారతీ భాగ్యలక్ష్మి - నీకు సాక్షాత్కరింపదే నెలఁతమిన్న!—

తాను యోగినియఁట! వియత్తలముఁ దొట్టి-భూతలమునకు వచ్చిన ప్రోడయఁట!
యోగి భావజగ మిటు రూపొందినట్లు - తెలుపఁ, జూడంగఁ దలఁపదే! వెలఁది గాదె!

తాపసిపలుకులు తలఁ పూఁపఁ గాఁబోలుఁ! దల యూఁచి యంతలోఁ దాల్మిఁ దాల్చు,
జడదారిమాటలు పరిదాఁకఁ గాఁబోలుఁ! బులకించి యంతలో నిలువరించు,
నగవాసిచూపులు మన మొత్తఁ గాఁబోలు! నిట్టూర్చి యంతలో నిమ్మళించు,
బైరాగిసుద్దులు పస నాటఁ గాఁబోలుఁ! గంపించి యంతలోఁ గాలు ద్రొక్కు,
నబల తా నెంతయోగినియైన నేమి? - యూర్ధ్వజగముల వసియించుచున్న నేమి?
యావియోగిమనోయోగ మరసి యరసి - తెలిసి, తన్వియై, యెట్లు చింతింపకుండు?

యోగివరేణ్యుఁ డంత హృదయోత్థిత భావతరంగమాలికా
వేగము నాఁపలేమి నెద విచ్చుటయుఁ, దదుపాసనాసుధా
సాగరసంభవప్రణయసారసనూతనచిత్రకాంతు లా
భూగగనాంతరాళమున బోరన నిండి వెలింగె నంతటన్.

ఆవిమలాబ్జమధ్యమున నద్భుతతేజముతోడఁ దోఁచు దే
వీవరచిత్రమూర్తిఁ గను వెక్కసపాటునఁ జూచి చూచి, సం
భావనఁ జేసిచేసి, సులభంబుగ నయ్యది స్వీయమూర్తిగా
భావమునన్ గ్రహించి సమభాగిని యోగిని లేచి యిట్లనున్—

ఈగైరికాంబరం బిటు వెట్టి, సన్ననిచలువ ధరింప నచ్చముగ నేన!
ఈయవుదల జడ లిటు విప్పి, కురులకు మెఱుఁగువెట్టంగ నమ్మికగ నేన!
ఈరుదురాకల నిటు వీడి, ముత్యాలదండ దాల్పంగ సత్యముగ నేన!
ఈభూతిభస్మంబు నిటు వాపి, పనసార్పి గంద మలంద నిక్కముగ నేన!

తలఁప నామూర్తిదివ్యచిత్రంబు నేనె! - నాథునిహృదబ్జసింహాసనమున నేనె!
ఘనతరప్రేమపూజలఁ గంటి నేనె! - అతివలందెల్ల ధన్యాత్మురాల నేనె!

మాఱిపోయెద నేమొ జాఱిపోవకుమమ్మ! భగవతీ! ధాత్రి! నన్ బట్టు మమ్మ!
సోలిపోయెద నేమొ! తేలిపోవకుమమ్మ! ఆకాశలక్ష్మి! నన్నరయు మమ్మ!
తూలిపోయెద నేమొ! తొలఁగిపోవకుఁడమ్మ! యోగినీసఖులు! నన్నోముఁ డమ్మ!
కరఁగిపోయెద నేమొ! కదలిపోవకుమమ్మ! భువనమాతా! నన్నుఁ బ్రోవు మమ్మ!
పడఁతి నైయున్న నానోము పండెనమ్మ! - ప్రణయసంతానమునఁ బండు పండె నమ్మ!
పతి ప్రణయదీక్ష నాలోనఁ బండెనమ్మ! - పట్టరానియానందంబు పండె నమ్మ!

కన్నులచీఁకటి విరిసెనో? - పున్నమవెన్నెలలు మేనఁ బొరసెనో? మెఱుఁగుం
గ్రొన్నన లెదలో మెఱసెనో?-మన్ననుమి న్నెఱుఁగరానిమత మేమనుచున్.

నిలువలేక కరఁగి నీరయ్యె యోగిని-యదియె, గంగ, యమున, యాదిగాఁగఁ
బుణ్యనదులరూపుఁ బొందెనో! కాకున్న-వాని కంతమహిమ వచ్చుటెట్లు?—

కుప్పసంబు విడినకొందమునాగముభాతి-మబ్బు విడినచందమామరీతిఁ
బ్రణయమహానిమేనిఁ బాసి ప్రాణజ్యోతి-మెఱుఁగుఁబువ్వులీల మెఱసె నంత.

తెఱవింటి లోకమాతకు-సరి కుత్తుక నెనఁగురత్నసరము లనంగా
మెఱుఁగులవెన్నెలపువ్వులు-గుఱికొని క్రొమ్మించుఁదీవ కోవల మెఱసెన్.

ఆవిశ్వమాతృమహాదేవిగళమున హారంబు లైనవి తారలో, ఘ
నాఘనంబులఁ దోఁచు నవ్యతటిల్లతలో, నూత్నకనకవిమానగతుల
విహరించు త్రిదశులవిమలనేత్రద్యుతులో, నిరతప్రణయానురాగ
నిశ్చలులగు ధర్మనిర్మలమూర్తుల మహితపూజాపుష్పమాలలో, వి
శదఘణితిఁ దెలిసికొనుట శక్యమగునె? - తనివి దీఱఁ గనుట మనతరమె? వత్స
లత్వ మెనయ నాదేవియె తత్త్వ మెఱిఁగి - యెలమి నొక చెవి కుపదేశ మీయకున్న.

గణియింప నెంతప్రియమో - మణు లుండఁగ, దివ్యభాగ్యమణు లుండఁగ, నా
ప్రణయంపుఁ జిన్నిపూవులె - గుణవల్లి జగంబుతల్లి కోరి ధరించెన్.

ఓప్రణయసుమములారా! - చూపట్టితి రాత్మభావశోభనలతఁ, బూ
జాపుష్పహార మైతిరి - మీపేరిమి లోకమాత మిమ్ము ధరింపన్.

నులిమంచు వెన్నెలనోళుల కందని పొత్తుల సరిక్రొత్తపూవులార!
ప్రొద్దుకెంజాయల ముద్దుల కందని పొన్నారిపొందళ్కు పూవులార!
కమ్మనిగాడ్పుల కౌఁగిలి కందని పొలపంపునెత్తావి పూవులార!
ఎలదేఁటికొదమల యెంగిలి కందని పున్నెంపుఁ గ్రొందేనె పూవులార!
పురు డెఱుంగని కానుపుఁ బూవులార! - పుట్టి గిట్టని ప్రణయంపుఁ బూవులార!
భువనమాతను సేవించుపూవులార! - పుణ్యజగ మేలుఁ డీకఁ బైఁడిపూవులార!

ప్రేమమయి యగు మాతృమూర్తిగళమందు - వారిరువురుఁ బూజాపుష్పహార మైరి;
యెవ్వ రేపేట నున్నారొ యేర్పరించి - చెప్పఁడీ మాత మెవరైన నెప్పుడైన?—
జగము లేలు ప్రణయజననికృపాలేశ - మింత గలుగఁ జూచినంతలోనె
యులరుఁగోనసీమ యయ్యెను మరుభూమి! - దండశైల మమృతకుండ మయ్యె!

మీసామీప్యము సౌఖ్యము, - మీసాలోక్యంబు ప్రేమమిళితము, శుభసా
మీసారూప్యము, మోక్షము - మీసాయుజ్యంబు ప్రణయమిథునములారా!

ఫ ల శ్రు తి

పసదనమున కని గానీ - అసమున కని గాని చూడ కార్యలు సుగుణా
భ్యసనాసక్తుల శ్రుతులకు - రసాయనమొనర్తు రాదరసరిససూక్తిన్.

తల్లిదండ్రులప్రేమతత్త్వ మందనవారు కన్నబిడ్డలప్రేమఁ గన్నవారు,
కొలముపెద్దలప్రేమ గుర్తెఱింగినవారు తోడివారలప్రేమఁ గూడువారు
ఆఁడుబిడ్డలప్రేమ నందికోఁగలవారు చుట్టాలప్రేమను జూచువారు
ఆలుమగలప్రేమ నర్మిలిఁ గనువారు చెలికాండ్రప్రేమ నీక్షించువారు
విశ్వమే ప్రేమగాఁ జూచి వెలయువారు - దేవదేవునిప్రేమను దెలియువారు
ప్రేమయే జీవనంబుగాఁ బెరుఁగువారు - పరమపుణ్యపూజాపుష్ప మరయువారు.



౬. ‘ఆల్ప్సు’ అను పర్వతములయందు మంచుగోడ కెగఁబ్రాకుట

G. S. A.



౭. రాజసౌధ సింహద్వారము-కార్వేటినగరము



౮. ప్రతిబింబములు

ఛాయాచిత్రకారుడు : శ్రీ సూర్యగారు, చెన్నపురి.




## ఆకారం హ్రస్వం

'శివమ్'

అనగా అనగా ఒక రాజు. ఆయన గొప్ప పండితుడు; పేరెత్తిన దాత. ఆయనకొలువున మంచి దిగ్దంతులవంటి పండితు లుండే వారు. వారిలో ఒక పండితుడు చక్కని యుక్తి శాలి కూడ.

ఒకనాడు మధ్యాహ్నం రాజు నిండు కొలువున ఉండగా మరొక దేశంనుండి కొత్త పండితుడు వచ్చి అక్కడి పండితులను వాదానికి పిలిచినాడు. క్రమంగా అందరితో వాదించి గెలిచినాడు. యుక్తిశాలి అయిన పండితుడు నాడు సభకు రాలేదు. 'ఆయనతో వాదం కోసం' అని సభ మరునాటికి ఆపినారు. మరునాడు తప్పక కొలువుకు రావలసిందని రాజు తమ పండితుడికి వార్త పంపినాడు. రాజు, పండితులు అందరు ఆయననే నమ్ముకొని ఉన్నారు. ఆయనవల్ల జయం కలుగుతుందని వారి ఆశ.

మరునాడు రాజుకొలువు నిండింది. కొత్తపండితుడు 'అట్టహాసం'గా కూర్చుని ఉన్నాడు. పొద్దయిపోతూ ఉంది. ఎంత సేపటికీ కూడా రాలేదు —రావలసిన పండితుడు. అదేపనిగా దోవవైపు కనుపెట్టుకొని ఉన్నారు. ఇంక నాలుగు బారలు పొద్దు ఉంది. చూచి చూచి విసుగెత్తుతూ ఉంది. అప్పటికి దూరంగా మేళాల చప్పుడు వినబడింది. కొంచెంసేపటికి ఒక పెద్దఉత్సవం కనబడింది. అది రాజుసభ వద్దకు వస్తూవుంది. దానిలో నడుమ పెద్ద ఏనుగుపై అంబారిలో ఒక బక్కపలచటి పొట్టి మనిషి కూర్చుని ఉన్నాడు. రాజు మొదలుకొని అందరూ ఉత్సవాన్ని ఆశ్చర్యంతో చూస్తూఉన్నారు. ఉత్సవం సభదగ్గరకు చేరింది. అంబారిలో ఉన్న ఆయన క్రిందకు దిగినాడు. 'మనపండితుడు వచ్చినాడు' అని అందరు గట్టిగా అరచినారు. కొత్త పండితుడు ఆయనను చూచి 'ఆకారం హ్రస్వం' అని గేలిచేసి నవ్వినాడు. ఆమాటను పట్టుకొని వెంటనే రాజుగారి పండితుడు "అయ్యా, 'ఆకారం హ్రస్వం' అన్నావే; ఏశాస్త్రంలో ఉందో చూపు. అవతల నీతో వాదిస్తాను" అన్నాడు. కొత్తపండితుడికి జబాబు ఏమీ తోచింది కాదు. చెప్పకుండా లేచి అదే పోకగా పోయినాడు. రాజు, పండితులు అందరూ 'శని వదిలిం'దని చాలా సంతోషించారు.

కథ కంచికి చేరింది. మనం ఇంటికి చేరుకున్నాము.

---

## దుగ్ధనివారణ

శింగరాజు వెంకటరమణయ్యగారు

మండు వేసవి. పదకొండు గంటలు మించినది. పాదరక్షలా లేవు. కాళ్లు గాలుచు నొక భట్రాజు కోసెడుదూరమున నున్న గమ్యస్థానమునకు జేరబోవుచుండెను. ఇసుకనేలను కొంతదూరము నడువవలసి వచ్చెను. భగ్గున మండునిసుకలో చిందులు ద్రొక్కుచు బోవు వతనికి గుఱ్ఱముమీద స్వారిచేయుచు నెదురుగా వచ్చుచు ఒక బాటసారి కన్పడెను. ఆ బాటసారి భట్రాజునవస్థకు జాలిగొని యడుగక మున్నె తన పాదరక్షలాతని కిచ్చి తన దారిని బోవుచుండెను.

భట్రాజునకు కాలు చల్లబడెను, గాని పది గజముల దూరము పోవునరి కాతడు "అడుగక మున్నె పాదరక్షలిచ్చిన యుదారుడు అడిగిన నశ్వము నీకకుండునా? ఇచ్చిన త్వరలో ఊరు చేరవచ్చుగదా" యని తలచెను. కాని, ఇచ్చునో యివ్వడో! యనుసందేహము బాధించుచుండ, 'అడుగనా, వద్దా' యని క్షణముసేపు వితర్కించుకొనెను. "ఒకవేళ ఇచ్చిన ఈయగూడదా? అడిగిన దప్పేమి? అడుగకున్న ఈసందేహము నివర్తికాదు" అని ఒక కేకవేసి గుఱ్ఱపురౌతును నిలిపెను. దగ్గరకు వెళ్లి మామూలు ముఖస్తుతులు చేసి, "మహారాజా, నడువ జాలకున్నాను. తమ రశ్వదానముగూడ చేసి యశమును పడయు" డనెను. ఆశ్చర్యాగ్రహములు ముడివడ రౌతు భట్రాజుముఖము చూచెను. చేతనున్న కొరడాతో ఒక్కవేటు వీపునయి మ్రోగించి తానిచ్చిన పాదరక్ష లూడబెరికికొనిపోయెను.

కొరడాదెబ్బకు భట్రాజు వీపున దద్దుపోయి మండుచున్నను "దద్దుపోయిన మానె గాని దుగ్ధనివారణ అయింది" అని తృప్తిని చెంది తనదారిని బోయెను.

కథ కంచికీ, మన మింటికీ.

---

## పాడులోకము!

ఆకుండి సత్యనారాయణగారు (కవితామండలి)

రాజుకి తెలివి తప్పిపోయింది. వైద్యులందరూ నిరాశ చెందేరు. చూచినవాళ్లందరూ మరి లాభం లేదని పెదవులు విరుస్తున్నారు. భార్య దీనవదనంతో పక్కనే కూచుని వలవలా యేడుస్తూంది. అందరు రాజుకేసే ఆతురతతో చూస్తున్నారు. కొంతసేపటికి రాజు కళ్లూ, నోరూ మూతలుపడ్డాయి. నాడి కూడా ఆగిపోయింది.

అర్ధరాత్రి దాటిపోయింది. రాజుకి తిరిగి చైతన్యం కలిగింది. మెల్లగా కళ్లు తెరిచి చూసేడు. ఆప్రదేశమంతా నిశ్శబ్దంగా ఉంది. పక్కనొక దీపం గంటలాగు వెలుగుతూంది.

అతని కంఠంవరకూ తెల్లనివస్త్రం ఒకటి కప్ప బడి ఉంది. చుట్టూ అయిదారుగురు సేవకులు తప్ప ఇంకెవరూ లేరు. వారయినా గాఢంగా నిద్రిస్తున్నారు. రాజు మెల్లగా లేచి కూచున్నాడు.

అంతకు కొంచెము ముందుగా జుట్టు విరియబోసుకొని నాలుక బైటికి చాచిన అనూహ్య భయంకరమూర్తితో మృత్యుదేవత అతణ్ణి సమీపించి తన చేతు లూపుతూ "నీకాలమయిపోయింది. పద వెళ్లిపోదాం" అంది. "నేను రాను" అన్నాడు. అతని జుట్టు పట్టుకొని యీడ్చింది. అతడు ఈండ్రపడి, ప్రజలందరూ తనకోసరం యెంతో పరితపిస్తూన్న [illegible] తన్నలా బలవంతపరచడం న్యాయం కాదని ఆమెతో వాదించేడు. అది విని ఆ వ్యక్తి జాలి చెంది, "అయితే నీ కింకో రెండుగడియల సేపు గడుపిస్తున్నాను. అంతటిలో నీ ప్రజల్లో గాని ఆప్తుల్లోగాని నిన్ను నిజంగా కోరే వార్ని ముగ్గుర్నయినా చూడగలిగితే తిరిగి నీవు జీవించవచ్చును" అని చెప్పి అతణ్ణి విడిచిపెట్టింది. ఆసంగతంతా రాజుకప్పుడు జ్ఞప్తికి వచ్చింది.

ఒక గడియ అయింది. రాజు చటాల్న లేచి కోటబైటికి వచ్చేడు. అతడు చాలా ఉదారహృదయుడు. అహోరాత్రములు కష్టప[illegible]ప్రజోపయోగకరములైన కార్యాలెన్నో చేసేడు. ఎలాంటివారినయినా ప్రేమతో, గౌరవంతో ఆదరించేవాడు. అందుచేత తానింకా జీవించాలని మనసారా కోరేవారు ముగ్గురే కాదు, వేలూ లక్షలూ కూడా ఉంటారని అతనికి ధైర్యం ఉంది.

మొట్టమొదట తాను బాల్యంనుంచీ యెంతో ప్రేమతో చూస్తూన్న ఒకమిత్రుని గృహానికి వెళ్లేడు. వీధితలుపు తీసే ఉంది. లోపలికి వెళ్లినాడు. ఎక్కడా స్నేహితుడు లేడు! ఏమయిపోయేడు! పాపం, తనకోసం యెంత తపిస్తున్నాడో! ఒకవేళ దుఃఖము పట్టజాలక ఆత్మహత్య చేసుకున్నాడేమో! అని తహతహలాడుతూ త్వరగా వెలుపలికి వచ్చేడు. వాకిట నిద్రిస్తూ ఉన్న ఒక సేవకుణ్ణి లేపి మెల్లగా "మీ యజమాని యెక్కడికి వెళ్లేడు?" అని అడిగేడు. "మా యజమాని రాజుగారు చనిపోయేరు కాదూ? అతనికి సంతానం లేదు. అందుచేత అతని జ్ఞాతి యేదో సలహాకోసమని కబురంపితే యేవో కాగితాలు పట్టుకొని యిప్పుడే వెళ్లేరు" అన్నాడు. ఆ మాట వినగానే రాజుశరీరము జల్లుమంది. గాలిలో తీగలాగు గడగడా వడకిపోయినాడు. మరి కాలహరణం చెయ్యక వెంటనే కోటకు బయలుదేరేడు.

దోవలో బీదలందరూ కూచుని యేమేమో మాటాడుకుంటున్నారు. రాజు చాటుగా నిలిచి విన్నాడు. వాళ్లందరూ రాజుదినవారాల్ని గురించి, వారికి దొరికే సంభావన్ల గురించి ఉత్సాహంతో మాటాడుకుంటున్నారు. ఆ మాటలతో రాజుమనస్సు చివుక్కుమంది. అక్కడినుంచి కోటలోకి వచ్చేడు.

ఇంకొక అరగడియ మిగిలి ఉంది. భార్య గదివైపు వెళ్లేడు. తలుపు వేసి ఉంది. కన్నం లోంచి లోపలికి చూసేడు. భార్య ఒంటరిగా పడకపైన కూచుని ఉంది. ఎదుట గంటలాగు దీపం వెలుగుతూంది.

ఇంతలో ఒక రహస్యద్వారం తెరిచి ఒక యౌవనపురుషుడు వచ్చి రాణీయెదుట నిలబడ్డాడు. రాజు వెలవెలపోయి చూస్తున్నాడు. ఆ నూతనపురుషుణ్ణి చూడడంతోనే రాణీ ముఖం వికసించింది. "శని వదలిపోయింది. ఇక మనం సుఖంగా కాలం గడపవచ్చును" అన్నది రాణీ. ఆపురుషుడు రాణీని కౌగిలించుకున్నాడు. అదిచూచి రాజు హతాశుడైనాడు.

అప్పుడు రాజు కీ ప్రపంచం ఎవరికోసం గానీ నిరీక్షింపదని, బాగా బోధపడింది. లోకం మీద విరక్తి కలిగిపోయింది........

వేగుజా మయింది. సేవకులందరు లేచి కళ్లు తెరచి చూచారు. రాజుకళేబరము యథాప్రకారముగానే చాపమీద పడి ఉంది.

కథ కంచికీ, మనం ఇంటికీ.

---

## పిచ్చితలలు—౧.

విశ్వనాథ సత్యనారాయణగారు

ఆస్థ విచిత్రలోభయిత, అన్నిటి కన్నిప్రతుల్ ఘటించి భా
విస్థవిరాశలన్ చిగిరిపించెడు పచ్చనిపల్లెటూళ్లగా;
అస్థలమం దయోగ్యవిషయంబున నక్రమమై మనస్సునం
దేస్థితియుం లయంబు గల పీ యనుభూతికిం గాని సౌఖ్యముల్.

సౌఖ్య మటన్నదానికి నిజంబుగ స్థానము కాని నేను నా
లేఖ్యగతాకృతింబలె వ్యళీకత పెంచినదాని దీనికై
సఖ్యము పొందెదన్, ధృతవిపచ్చట మాత్రపురాఘమాలికా
ముఖ్యము దైవికంబు పరిమూఢము దండమె తోఁచు నెచ్చటన్.

కర్మ బలీయ మైనను నెగాదిగ లాగుచు నల్పమైన నే
ధర్మము లల్ల వానిదెస దట్టపుటూహలనేఁత, ముఖ్యమే
ధర్మము, తద్వివేచనపథంబున పల్చని యూహ నేఁతగా,
శర్మము వేఱు నాబ్రదుకుచా లిది వేఱుగ సంతరించెడిన్.

తీక్ష్ణవిచారముల్ సలిపితిఁ బెనుగాలుల త్రోవలో, తతా
భీక్ష్ణ ము దారజీవితము వెంబడి శప్తునిరీతి ధీగత
శ్లక్ష్ణత పొంది వృద్ధకృకలాసముకై వడి డిల్లవోయితిఁ;
తీక్ష్ణకరుండు న న్ననుమతించెను వేసఁగిబెట్టనేలఁగన్.

ఓర్పు విచిత్రమా గుణ మహో, యిది నేనుగ మూర్తి కట్టె; సం
సర్పివిషచ్ఛటాసహము, మామక దేహగతాఖిలాణుమా
లార్పితమైనదిం బలెను నైనది; లోపల కాలి చిట్టమై
యేర్పడ, నేర్పుగా నభినయించెడు నామెద పచ్చిపచ్చనల్.

బ్రాహ్మణుఁ డింద్రియప్రతతిపై నధికారముకల్మిచే ననా
బ్రహ్మపదంబు పొందునఁట; బ్రాహ్మణతాచ్యుతిపాటుగా మనో
జిహ్మత, యింద్రియాపహృతచిత్తత, అన్ని ఘటిల్లె నింక నా
బ్రహ్మపదంబు తా నెవరొ, పాలసుఁ డే నెవరో నిజంబుగన్.

శప్తుఁడ నై పరాధవరసంబున కాప్తుఁడ నై మనోవ్యథా
లిప్తుఁడ నై మహాగ్నిపరిలీఢతనూసకలాణుపాళినై
ప్రాప్తము మించి యత్నులను బారలఁ జాఁచెద సిగ్గు వొందెదఁ,
తృప్తజనంబు లేనగవులీరుల చిక్కనినింద తోఁచఁగన్.

ఒక్క వంద వేయి యొకలక్ష యొకకోటి-బయలి లోని కట్టుబాట్లు చూడ,
ఇన్ని త్రెంచుకొంచు నెగురఁజాలని పక్షి-చాలనట్టి శక్తి కేల నవ్వ.

---




# కొమ్మ నెక్కెడు కోతి

కో. నరసింహాచారిగారు

నాలుగుఅంగుళముల నిడివియు, రెండు అంగుళముల వెడల్పును గల గట్టి అట్టముక్కలను నాలుగింటిని తీసికొనవలెను. వాటిలో నొకదానిపై చిత్రమునందలిరీతిగ, చేతులు గాని, కాళ్లు గాని, తోక గాని లేక, కోతి యొక్క శరీరము మాత్రము చిత్రించవలెను. దానిని గీత వెంబడి కత్తిరించి, ఆ కత్తిరించిన బొమ్మను తక్కిన మూడుముక్కలపై చేర్చి పట్టుకొని ఆ బొమ్మప్రకారము తక్కిన వాటిని గూడ కత్తిరించవలెను. అందు రెండుతును కలయందుమాత్రము క్రిందికొనయందు 2-వ చిత్రమునందు C వద్ద జూపిన విధముగ కత్తిరించివేయవలెను.

తర్వాత 3, 4, చిత్రములందలి విధముగ రెండుకాళ్లను, రెండుచేతులును, 5-వ చిత్రము నందలివిధముగ ఒకతోకయు అట్టముక్కలపై కత్తిరించవలెను.

A వంటి రెండుబత్తాసులను తీసికొని, ఒకబత్తాసునకు దారమును దూర్చి కట్టి, ఆదారముపై మొదట ఒకచేతిని, 1-వ చిత్రపు అట్టను ఒకదానిని, పిమ్మట 2-వ చిత్రపు అట్టలను రెంటిని, అటు పిమ్మట మరల 1-వ చిత్రపు అట్టను, తర్వాత రెండవచేతిని, కడపట రెండవ బత్తాసును దూర్చి కట్టవలెను. (ఇవన్నియు కోతిశరీరమునందు h గుర్తు వద్ద నుండవలెను.) అప్పుడు రెండు బత్తాసులమధ్య కోతిశరీరపు అట్టలు నాలుగును, రెండుచేతులును ఇమిడి చిత్రము B యందలి విధముగ నుండును.



పైరీతినే మఱిరెండు బత్తాసులను దీసికొని, వాటిలో ఒక బత్తాసునకు దారమును గట్టి దానిని మొదట ఒక కాలిలో (౩-వ చిత్రము) రంధ్రముగుండా దూర్చి, తర్వాత శరీరపు అట్టలలో మొదటిదానిగుండాను (1 అను రంధ్రముగుండా దూర్చవలెను), తర్వాత తోకగుండాను, తర్వాత శరీరపు నాలుగవ అట్టగుండాను, మరియొక కాలిగుండాను దూర్చికొని కడపట రెండవ బత్తాసును దూర్చి కట్టవలెను. మధ్యనుండు రెండుశరీరపు అట్టలలో క్రిందికొనలందు కొంత కత్తిరించినందున ఏర్పడిన సందునందు తోక సులభముగా వ్రేలాడగలిగియుండును (చిత్రము C).

ఒకఅడుగు పొడవుగల వెదురుబద్దను దీసికొని (చిత్రము 6), దాని యొకకొననుండి సగమువఱకు చీల్చి, చీల్చబడిన కొనలు ఎడమనుండుటకు చీలికలమధ్య ఒకటిరెండు చిన్న అట్టముక్కలను (చిత్రము 7 m) ఉంచి, ఒక గుండుసూదిని గ్రుచ్చి, సూదిమొనను జారిపోకుండునటుల వంచవలెను. తర్వాత కోతికాళ్లను వెదురుబద్దయందలి n గుర్తువద్ద (చిత్రము 8) బద్ద కిరువైపుల వెలుపలి ప్రక్కనుంచి ఒక గుండుసూదిని దూర్చి దాని మొనను వంచివేయవలెను. కోతిచేతులను వెదురుయొక్క చీలికలమధ్య o వద్ద (చిత్రము 8) నుంచి ఒక సూదిని దూర్చి దాని కొనను వంచవలెను.




పిమ్మట కోతియొక్క కడుపున s అనుచోట ఒక గట్టిదారమును కట్టి దారపుకొనను చేతుల మధ్య సూదిమీదుగా వెలుపలికి తీసికొనవలెను. ఈదారమును వదులుగా నుంచినయెడల కోతియొక్క బరువునకు అది క్రిందికి పడును (చిత్రము 8). దారమును లాగినయెడల కోతి పైకి లేచును (చిత్రము 9).

# చక్రవర్తి

కుందుర్తి నరసింహారావుగారు

[ఇది కల్పితము :

ఆక్షణమున లోకము లేలువాఁడు నభోమణి; అతనికన్నులు సంపూర్ణవికసితములై, ఆహవరంగమునందలి అరుణప్రభలచే మిఱుమిట్లుగొని, అశ్రువులు రాల్చినవి: ఆయెఱ్ఱనికన్నీరే రుధిరమన్నారాంధ్రసైనికులు. ఆవృష్టిలో రౌద్రమూర్తి రాజేంద్రుఁడు సుస్నాతుఁడైనాఁడు. పరసైనికుని గుండెలపై నున్న ఆతనిదృష్టిలో ప్రపంచజ్ఞానమే లేకపోయినను పౌరక్షేమమునకు ముడుపుగట్టిన మనశ్శక్తి మరల్చుకొనలేక, పొరపాటు తెచ్చినగాయపుతీపు మాన్పుకొనలేక, ప్రాణము బలియిచ్చి ప్రజను జూచుకొన్నాఁడు, వినుఁడు:—]

లేచినకంటిఱెప్ప ముకుళించినదా, కయికొన్నకత్తిపై
పూచిన సందెమొగ్గ విడిపోయినదా, అరిరాజుగుండెలో
వీచినగాలివాన సెలవిచ్చినదా, విజయైకనిత్యదీ
క్షాచలన ప్రభావవికసన్నవలోచనదీప్తి యారెడున్ !

ఇది చల్లారిన యగ్ని, వేడిపొగ లూరించున్ ; మహాసంగరం
బెదురై లోకము నెన్నినాళ్లిటుల మండించున్ ? జగద్రక్షణా
స్పదుఁడా వీరుఁడు నేఁడు భీకరవిపత్తమ్మోధిపాలికగ
ద్గదకంఠస్వనరోదనక్రమవిభేదంబేని పాటింపఁడే !

ఏమని చెప్పవాఁడ, కథలెల్ల భయంకరగాథ లయ్యె, నం
తే, మహనీయులెల్ల రణదీక్ష వహించిరి ; రాజరాజు సం
గ్రామమునందుఁ జిక్కె నెను కాడఁడు—పాడినపాట గాక యిం
కేమగు వ్రాయఁబోయిన నొకేఁపని చావులవెక్క చావులన్—

అట్టి మహాహవాంగణమునం దొకయేడుపు సన్నసన్నగా
పుట్టెను ; సింహగర్జనలఁబోని నిరంతరసైనికధ్వనుల్
పుట్టముగట్టి కొంత సరిపుచ్చెను దానిని ; తీక్ష్ణభావనం
ఘట్టన వెళ్లఁబెట్టినది గావున నిల్వద యెన్ని చెప్పినన్ ;

రాజు తదేకదీక్ష సమరం బొనరించెడివాఁడ ; యెన్నియో
రోజులు దాటిపోయిన విరోధుల కానలరోదనంబు లె
క్కా, జమ ! యేమి చెప్పెదు, శరాహతలోహితుఁడైనవానిచే
పూజలు గొన్నమాట తలపోయఁడురా నిజరాజ్యవాటికన్.

---



మొగలుల రాణివాసము

(శ్రీయుతులు యం. వెంకటరెడ్డిగారి ప్రాచీనచిత్రసంచయమునుండి)

# ఆయుర్వేదము

డాక్టర్ కే. యల్. నరసింహారావుగారు

[విజ్ఞప్తి:— ఆయుర్వేదాన్ని గురించిన గ్రంథాలకు కొదవలేదు. పూర్వగ్రంథాలుమాత్రమే కాక వాటిల్లోవిషయాలే చర్విత చర్వణంగా యితేవలవారు వ్రాసినవికూడా అనేకం వున్నాయి. కనుక నేను తిరిగి గతానుగతికంగా వ్రాయాలసిన అవసరం లేదు. ఆయుర్వేదంలో నేను చేసిన పరిశోధనాఫలితాలను ప్రచురపరచాలనుకున్నాను. కాని ఆయుర్వేదాన్ని నేనెట్లు గ్రహించానో ముందు కొంచం వ్యక్తపరిస్తేనే గాని నేను చేసిన పరిశోధనలను చదువరులు నాదృష్టితో చూడడానికి తగినంత అవకాశం వుండదు. కనుక ఆయుర్వేదాన్ని గురించిన్ని అందుకు సంబంధించిన యితర విషయాలను గురించిన్ని ముందుగా కొన్ని వ్యాసాలు వ్రాసి ప్రచురపరచదలచుకున్నాను.]

కొంతకాలంనుంచి "ఆయుర్వేదం" అనే మాటను యెవరికి తోచినట్టు వారు వాడుతూవున్నారు. అందుచేత "ఆయుర్వేదం" అంటే వేదమా, శాస్త్రమా, కళా అనే సందేహం సాధారణంగా కలుగుతూవుంటుంది. కాని యీమూడున్నూ స్వరూపాన్ని బట్టి వేరు వేరుగా కనబడ్డా, వాటికి మూలతత్వం వక్కటే. అన్నిటికంటే మొదటిది వేదం; దాన్ని బట్టి శాస్త్రం యేర్పడ్డది; తిరిగి ఆశాస్త్రమే కళారూపం వహించింది. క్రమవికాసం పొందడంలో అవి వేరు వేరురూపాలు వహించినా అన్నిటినీ బంధించేది వక్కటేసూత్రం.

"ఆయుర్వేద" అనే నాలుగక్షరాలపదంలో యెంతో గంభీరమైన అర్థం, విశాలమైనభావం యిమిడి వున్నాయి. అందుచేతనే తెలుగులోగాని యింగ్లీషులోగాని దానికి సరిఅయిన పర్యాయపదం దొరకడం కష్టం. ఆయువును గురించినజ్ఞానం అని చెపితే గాని శబ్దార్థం సరిపోతుందికాని దానివల్ల "ఆయుర్వేదం" అనే పదంలో రూఢం అయినభావార్థాలు యేమీ ద్యోతకం కావు.

ఆయుర్వేదదృష్టిలో, మనుష్యుడు ధర్మాన్ని సాధించాలంటే పరమేశ్వరుడు ప్రసాదించిన యీ మానవశరీరమే ముఖ్యమైన సాధనం. విశ్వమంతా సంగ్రహరూపంగా శరీరంలో యిమిడివుంది. విశ్వం యేవిధంగా పరమేశ్వరుని ఆలయమో కొద్దిలో మానవశరీరంకూడా అట్టిదే. అది బృహద్బ్రహ్మాండం, ఇది క్షుద్ర బ్రహ్మాండం. మానవుడు చిరంజీవిమాత్రమేకాక మృత్యుంజయుడుకూడా కాగలడని ఆయుర్వేదసాంప్రదాయం. ఆత్మ మనశ్శరీరాల కన్నిటికీ పరిపూర్ణత కలిగించడమే దాని ఆశయం.

సమస్త శాస్త్రాలకూ ఆయుర్వేదమే ప్రసూతిస్థానం. అవి దానిలో పుట్టి దానిలో పెరగాలసినవే. దానితో సంబంధం లేని శాస్త్రాలవలన ప్రయోజనం లేదు. అవి చిరకాలంనిలవనూలేవు. ఇది "ఆయుర్వేదం" అని చెప్పవనిన శాస్త్రం యేదీ లేదు. అన్నిటిలోను అది ఉన్నప్పటికీ, అన్నిటికీ అది అతీతమైంది. ప్రసూతిస్థానం, పరమావధీ వక్కటే కావడంవల్ల శాస్త్రాలన్నిటికీ యేకత్వం సిద్ధిస్తోంది. అన్నిటికీ పరస్పర సంబంధం వున్నదనీ, అన్నిటినీ వక్కసూత్రం బంధిస్తోందనీ స్పష్టమవుతోంది. ఆయుర్వేదం ఫలానా గ్రంథంలో గాని గ్రంథాల్లో గాని యిమిడివుందని చెప్పడానికి వీల్లేదు. భారత సారస్వతం అంతా — అందులోనూ వేదశాస్త్రపురాణాలు, ఆయుర్వేదవిషయాలతో నిండివున్నాయి.

ఆయుర్వేదం ప్రకారం ఆత్మ మనశ్శరీరాలు మూడూ కలిస్తే మనుష్యుడౌతాడు. మానవశరీరం అంగాంగీ న్యాయాన్ననుసరించి పరస్పర జీవసంబంధం గల వివిధావయవాల కూడిక్కాని కేవలం యంత్రం కాదు. అది వక చిన్నవిశ్వం, సంగ్రహ ప్రపంచం. ఈప్రపంచం పరమాత్మకు శరీరం, ఉపాధి యెలా అయిందో అదేవిధంగా జీవాత్మకు సంగ్రహప్రపంచం అయిన మానవశరీరమే ఉపాధి. మానవుడూ బాహ్య

ప్రకృతీ వేరులాగ కనిపించినా రెంటికీ జీవసంబంధం వుంది. మాతాశిశువులను నాభినాళం యెల్లా బంధిస్తుందో, అటువంటిదే ప్రకృతినీ మానవుణ్ణీ బంధిస్తోంది కాని అది చర్మచక్షువులకు గోచరం అయ్యేది కాదు. కనుక ప్రకృతీ, మానవుడూ, యీశ్వరుడూ యీమూటినీగూర్చి ఆయుర్వేదం చెపుతుంది. మానవుడే విధంగా తన జీవితాన్ని నిర్దుష్టంగా చేసికొని యీశ్వరుణ్ణి చేరగలడో అది బోధిస్తుంది. ఆత్మ మనశ్శరీరాలు నిజంగా ఒక్కటే. అందుచేతనే ఒకటి మార్పు చెందితే మిగిలినవీ చెందుతాయి. సూక్ష్మరూపం గల మనస్సుకు శరీరమే స్థూలరూపం. తిరిగీ శరీరానికీ ఆత్మకూ మధ్యవర్తి అయి అనుసంధానకర్త అయి వ్యవహారం నడిపించేదీ మనస్సే.

ఆయుర్వేదంయొక్క గొప్పతనం అంతా దానిలో అంతర్గతమయివున్న అద్వైతభావంలో వుంది. అందుచేతనే ఆయుర్వేదాన్ని నాశనం చేయాలని యెంతెంతప్రయత్నం చేసినా అది నాశనం కాదు. అది చిరస్థాయిగా వుండాలసిందే. అద్వైతం, ఆరోగ్యం, ఆనందం యీమూటికీ భేదం శబ్దంలోనే కాని భావంలో లేదు. భిన్నత్వం ఎరగని ఐక్యస్థితే నిజమైన ఆరోగ్యం, ఆనందం. ఏక్షణంలో ఐక్యస్థితికి భంగం కలిగి భేదభావం ఉదయిస్తుందో అప్పుడు నిజమైన ఆరోగ్యం లేదు, ఆనంద ం లేదు. పరమాత్మనుండి జీవాత్మకు సంభవించే వియోగమే భవరోగం. అదే మనుష్యజన్మకు కారణం. అదేవిధంగా శరీరాంతర్గతం అయి దాని వ్యాపారాలను చక్కబెడుతూన్న త్రిదోషాల సమస్థితికి భంగం కలగడంచేత విషమస్థితి యేర్పడి వ్యాధిరూపకమైన బాధ కలుగుతుంది. స్వపరజ్ఞానమైన అశాంతి ఆత్మకు బాధగా యెట్లా పరిణమిస్తుందో అట్లే దేహసంబంధమైనబాధ వివిధావయవాలకూ గల ఐక్యభావానికి భంగం కలిగించి వాటిలో భేదభావం యేర్పడేలాగు చేస్తుంది. మానవుడు సమాధ్యవస్థలో తన్ను తా నెట్లా మరచిపోతాడో, అదే విధంగా అతడు సంపూర్ణారోగ్యంలో తన శరీరం తాను మరుస్తాడు. అశాంతివల్ల ఆత్మకు బాధ యెలా కలుగుతుందో ఆలాగే బాధవల్ల దేహానికి అశాంతి కలుగుతుంది. ఈ రెండుసందర్భాల్లోను, కేంద్రం చలించి యేకత్వానికి భంగం కలిగి భేదభావం ఉదయిస్తుంది. మానవుని యీ ఉభయపరాలకు సామరస్యం కల్పించి ఏకత్వం సిద్ధింపచేయడమే ఆయుర్వేదంయొక్క ఆశయం. ప్రతిమానవుడూ ఒకవిధంగా భగవంతుని అవతారమే గనక, మానవుని ఆత్మవికాసంవల్ల యీశ్వరసాక్షాత్కారం సిద్ధిస్తుంది. కనుక మానవజన్మ పరమపవిత్రమైందనీ, మానవ శరీరరక్షణం పరమధర్మం అనీ బోధింపబడ్డాయి.

తనకు సంభవించిన లోపాలను తనంతట తానే సవరించుకోగల చిత్రమైనశక్తి ఒకటి ప్రకృతికి వుంది. సృష్టికారణం యెక్కడవుందో లయానికారణమూ అక్కడే వుంది. జీవాత్మ శరీరంలో బంధింపబడిన మాట నిజమే కాని బంధాలను తెంచుకుని పరమాత్మను చేరగల ఆత్మశక్తికూడా దానికే వుంది. అదే విధంగా త్రిదోషాల సమస్థితికి భంగం కలిగినమాత్రాన వ్యాధిగ్రస్తమయ్యే మానవశరీరంలోకూడా వాటికి సమస్థితి సమకూర్చి ఆరోగ్యాన్ని పునఃప్రతిష్ఠాపితం చేయగల ప్రాణశక్తి వక టుంది. అంతే కాక ఆత్మా, శరీరమూ ఒకదాని కొకటి సహకారంగా వుంటాయే గాని విరుద్ధంగా వర్తించవు. కనుక ఒకదానికి కలిగే లాభనష్టాలు రెండవదానికి సంక్రమిస్తాయి.

ఆయుర్వేదం కేవలం ఔషధాలను గురించీన్నీ ఆహారాన్ని గురించిన్నీ మాత్రమే చెప్తుం దనుకోవడం చాలా పొరపా టభిప్రాయం. అది చాలా గంభీరమైందీ, ఉన్నతమైందీ, విశాలమైందిన్నీ. మనప్రాప్తికంటే దానివ్యాప్తి హెచ్చు. చర్మచక్షువులకు గోచరమయ్యే భౌతికపదార్థాలను గూర్చిమాత్రమే కాక వాటి కతీతమైన ఆధ్యాత్మికవిషయాలనుగూర్చికూడా బోధిస్తుంది; ఆత్మానాత్మలకు సంబంధం కలుపుతుంది. ప్రతిమానవుడూ సాత్విక జీవితాన్ని అవలంబించి, ఉదారభావాలు కలిగివుండా లంటుంది. దేహధారణార్థం తినా లంటుంది కాని యథేచ్ఛగా తినడంకోరకే బ్రతకాలనదు. దానిదృష్టిలో బలం వేరు, ఆరోగ్యం వేరు. ఒక్క మనిషియందే రెండూ యేకకాలమందు కలిసివుండ

వచ్చునుగాని అట్లుండవలెనను సిద్ధాంతంలేదు. ఆరోగ్యం లేనిబలం యెంతో కాలం నిలవలేదు. అది పునాది లేని యింటివంటిది.

ఆహారంయొక్క నిజమైన ప్రయోజనం నిర్ణయించడానికి, అది కలిగించే ఆరోగ్యం ప్రధానం గాని, బలం ప్రధానం కాదు. త్రిదోషాలున్నూ, పంచభూతాలున్నూ సత్వరజస్తమోగుణసమ్మిశ్రణభేదంచేత కలిగినవే గనుక ఆహారవస్తువుల ప్రయోజనం నిర్ణయించడానికి త్రిగుణాలే ఆధారమవుతున్నాయి. కనుక యేయే రాసాయనికవస్తుసమ్మిశ్రణం చేత యేయేఆహారపదార్థా లేర్పడ్డాయో వాటిగ్గల నిజమైన ప్రయోజనం "క్యాలరీ", "విటమిను" సిద్ధాంతాల చేత నిర్ణయించినంతమాత్రాన చాలదు. త్రిగుణసిద్ధాంతాన్ని బట్టికూడా వాటికట్టి ప్రయోజనం వున్నప్పుడే అవిఅంగీకరింపబడతాయి. మనం భుజించేఆహారం, అన్నమయకోశమైన యీపాంచభౌతికశరీరానికే గాక, తద్వారా మనస్సుకున్నూ దాన్నుండి ఆత్మకున్నూ ఉపకారమో అపకారమో చేస్తూవుంటుంది. మనకు కలిగే ఊహలయొక్క గుణదోషాలు మనస్సుకే గాక శరీరానికీ ఆత్మకూకూడా అంటుతాయి. ఆరోగ్యానారోగ్యాలకు ముఖ్యకారణాలు ఆహారవిహారాలు.

ఆహారమంటే తినేదే కాదు. తాగేనీరూ పీల్చే గాలీకూడా ఆహారంలోలెక్క. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలకున్నూ, వాటన్నిటినీ శాసించే మనస్సుకున్నూ సంబంధించినవి విహారాలు. లక్షణాలనుబట్టి వ్యాధిని నిర్ణయించడం, దానికి చికిత్స చేయడం మొదలైనవి యేం చేద్దామన్నా యింద్రియాలతో సంబంధం తప్పదు. స్థూల దృష్టికి యీయింద్రియాలు వేరువేరుగా కనబడ్డప్పటికీ వాటికి పరస్పరసంబంధం వుంది. సూక్ష్మంగా ఆలోచిస్తే అన్నిటిని బంధించే అంతస్సూత్రం ఒకటున్నదని స్పష్టమవుతుంది. ఈ సర్వేంద్రియసామరస్య వివరణంవల్ల ఆయుర్వేదం బాగా బోధపడుతుంది. దానికి పేరు ప్రతిష్ఠలు యెక్కువవుతాయి. అంతే కాక రోగనిర్ణయం, చికిత్స యిప్పటికంటే సులభంఅవుతాయి. అన్నిశాస్త్రాలకూ మూలసూత్రాలు సమానమని తేలుతుంది. శాస్త్ర పఠనం యిప్పటికంటె విమర్శతోకూడి ఆనందకరం అవుతుంది. అందువల్ల ప్రపంచానికి ప్రయోజనం కలుగుతుంది. సమస్తశాస్త్రాలకూగల ఏకత్వం యెప్పుడు మనసుకు గోచరం అయిందో అప్పుడే యీశాస్త్రజ్ఞానవాహిను ఉద్భవించడానికి మూలకారణమే కాక జ్ఞానసముద్రుడు కూడా అయిన ఆపరమేశ్వరుడు అద్వితీయుడని వ్యక్తం అవుతుంది.

పూర్వం మనఆర్యావర్తంలో తపోధనులున్నూ, పరమేశ్వరధ్యాననిష్ఠాగరిష్ఠులున్నూ అయిన మహర్షులనేకు లుండేవారు. వారు సాధించిన ఋతంభరాప్రజ్ఞ చేత, అనగా సర్వమానసికశక్తులున్నూ కేంద్రీకరించి నప్పుడు లభించేటటువంటిన్నీ, శుద్ధసత్యాలను దర్శించి ధరించగలిగినట్టిన్నీ శక్తి యేదయితే వుందో అట్టిశక్తిచేత, తాము దర్శించిన మహాసత్యాలను సూత్రరూపంగా తెలియజేశారు.

అవి యిప్పటివలె శాస్త్రప్రయోగము (scientific experimentation) చేతనూ, శాస్త్రమీమాంస (logical process) చేతనూ లభించినవి కావు — కేవలం యోగదృష్టికి ప్రత్యక్షమైన సత్యాలు అవి. అందుచేతనే, నేటివరకూ వాటికి మార్పు కలగలేదు. మనసాంప్రదాయానికి సంబంధించిన యేయేసిద్ధాంతాలు నిన్నమొన్నటివరకూ అశాస్త్రీయాలనీ అసంగతాలనీ పాశ్చాత్యులచేత నిరసింపబడ్డాయో అవే యిప్పుడు శాస్త్రీయాలనీ సహేతుకాలనీ ప్రశంసింపబడ్డమే కాక, పాశ్చాత్యశాస్త్రసమ్మతమైనవని ఋజువుకూడా చేయబడుతున్నాయి. యోగదృష్టి అస్వాభావికమనీ అసంభవమనీ అన వీలులేదు. అది మనశాస్త్రసమ్మతమైన ఒకవిధమగు మానసికస్థితి. అట్టియోగదృష్టిచేత సాధింపబడ్డ సత్యాలు ప్రమాణాలవక తప్పదు. ఈవిధంగా ఆయుర్వేదసత్యాలతో నిర్మింపబడ్డ ఆయుర్వేదతత్వమే తచ్ఛాస్త్రానికి మూలం. ఆయుర్వేదశాస్త్రసిద్ధాంతాలు వ్యావహారిక ప్రపంచంలో పొందిన ప్రయోగంయొక్క రూపమే కళగా పరిణమించింది

సాధారణంగా ప్రతిరోజూ మనక్కనపడేది కళారూపం. ఈ ఆయుర్వేదకళ దేశకాలపాత్రాల ననుసరించి మారుతూ వుంటుంది. వైద్యుని కే విషయంలో ఎక్కువ ప్రజ్ఞ వుంటుందో, వైద్యం చేసే ప్రదేశం యొక్క పరిస్థితులు యేవిధంగా వుంటాయో, అక్కడి జనులకు యేవిధమైన చికిత్సలు అవసరమో, వాటినిబట్టి కళ మార్పుచెందుతూ వుంటుంది.

ఆయుర్వేదమనే యిట్టి మహత్తరమైన విషయాన్నిగూర్చి అపోహలూ దురభిప్రాయాలు ప్రబలి వుండడం చాలా విచారకరం. విషయాన్ని యేదృష్టితో చూడాలో ఆదృష్టితో చూడకపోవడమే వీటన్నిటికీ కారణం. పైన చెప్పినదానిలో ఆయుర్వేదం అంటే యేమిటో కొంచం సూచించడానికి ప్రయత్నించాను. కాని పైన ఉదాహరించిన వివిధవిషయాలను గురించి తగుమాత్రం తెలుసుకోవాలంటే ఒక్కొకదాన్నిగురించి ప్రత్యేకం ఒక్కొక్క విపులమైనవ్యాసం వ్రాయాలసి వుంటుంది.

ఒకదేశంయొక్క విజ్ఞానం, నాగరకతా, మత సాంఘికసంస్థలూ, సారస్వతం, శాస్త్రాలూ మొదలైన వాటిలో అంతర్గతమైవున్న భావాన్ని గ్రహించాలంటే మొదట అవి పుట్టడానికి కారణం అయిన మహాపురుషుల హృదయాంతరాళంలో యెట్టి ఆశయాలు, ఆదర్శాలు వుండేవో అవి గ్రహించడం చాలా అవసరం. భారతదేశాన్నిగూర్చి తెలుసుకోవాలన్నా ఆపద్ధతే అవలంబించాలి.

ప్రాక్పశ్చిమాల కెంత వ్యత్యాసం వుందో ప్రాగ్దేశాలవారిదృష్టికీ పాశ్చాత్యదేశాలవారి దృష్టికీ అంత వ్యత్యాసం వుంది. ఒకరి దాధ్యాత్మికదృష్టి, రెండవ వారిది ఐహికదృష్టి. వారిదృష్టులకు గల యీభేదమే వారి జాతీయజీవితంలోనూ, విజ్ఞానంలోనూ, నాగరకతలోనూ, ప్రతిబింబించివున్నాయి. మొదట్లోనే యీదృష్టిభేదం గ్రహిస్తే అది వారిశాస్త్రాలనూ సారస్వతాన్నీ అర్థంచేసుకోవడానికి సాధనంగా ఉపకరిస్తుంది.

ప్రాక్పశ్చిమాల దృక్కోణాలకు యిట్టిభేదం రెండు కుండవలె ననే విషయం చిత్రమైందిన్నీ అందరూ తప్పకుండా తెలుసుకోవలసిందిన్నీ కాని విషయం యొక్క స్వభావాన్నిబట్టి అది ప్రత్యేకంగా వివరించవలసిందే కాని స్థూలంగా సూచించి విడిచిపెట్టతగింది కాదు. కాని ప్రస్తుతసందర్భంలో దాన్ని సూచించివిడిచిపెట్టడంతోనే తృప్తిచెందవలసిన అవసరం కలిగింది. ఎందుకంటే భారతదేశవిషయాలను భారతదేశదృష్టితోనే చూడవలె ననేమర్మం తెలిసినవారుకూడా సాధారణంగా ఆపని చేయరు. అందుచేత చెప్పేవిషయం యేదో పూర్తిగా విని విమర్శదృష్టితో ఆలోచించక స్థూలదృష్టితో చూచి విషయాన్ని పొరపాటుగా గ్రహిస్తారు. అలా చేయకుండా వుండేనిమిత్తం ప్రాక్పశ్చిమదృష్టుల కుండే భేదం ప్రస్తుతసందర్భానుసారంగా సూచించి, విడిచిపెట్టవలసిన అవసరం కలిగింది.

---

# తిమిరమా!

కొత్తపల్లి సూర్యారావుగారు

బలవంతులు పై నెత్తిన
బలహీనత నొందఁగి యుండ వలదే నీకుం
దెలివి కనంబడ దెందును
బళె! తామసి కెట్లు తెల్ల వాఱక యుండున్.

మనలో మనమాట, యొక
ప్పును నీ వూహించినట్లు పొడకట్టదు నీ
కును వైరు లెంతమందియొ
యని, ముప్పూరుబయలు మెఱసియగపడెదరుచూ

సోముం డొక్కఁడు నీపై
దీమసమున లేచు రాత్రి దినదినమును, నే
సోముం డనిమెదొ! యగు నల
సోముండును సంధకారియో మఱి పయ్యెన్.

దినవాథుఁ డొకఁడు నీపైఁ
బెనుబీరము చూపు, నితని ప్రేరణ ననలుం
డును వెషలి మండిపడు, నె
ట్లు నిలువఁ గలిగెదవో భీతిలుదు నీకొఱకై.

ఒకవిధమున సూర్యుండే
మెకమెకపాటున్నఁ గొంత మేలగుఁ, బగలే
యొకనియమంబుగ నీబా
ధకుఁ గారణ మగును, ఋతుధవుఁ డటు గాదే.

ఒకనాఁడు సంజవేళను
నొకనాఁ డొక్కొంత తాళి యొకనాఁ డొక్కిం
తకొఱంత వెట్టుకొని వే
ఱొకతతి పూర్ణాగ్రహమున నులికించు నినున్.

ఏనాఁ డేకళ నుండినఁ
గాని మఱవఁ డెప్డు నిన్నుఁ గారించుట య
వ్వానికిఁ దగినట్టిద నీ
పూనికి మొండితన మదియుఁ బాగడం దగదే!

కిరణంపుటాకురాళ్లను
గరగరఁ గడు నఱుగఁదీయుఁ గార్ష్ణాయఃఖం
డరుచి నినుఁ; బిండియయ్యుఁ
ధర వెన్నెలరీతి నుగుదు ధైర్యము గాదే.

ఇలఁ గల నిను మలిగింపఁగఁ
దలకెక్కఁడు గగనకాంతిఁ; దపనుఁడు నీపైఁ
దలకొనిన భీకరార్భటు
లలరిన సింగములపెనుగుహాలు చొచ్చెదవో.

అతఁ డచటికి రాఁజాలని
కత మెల్లెఱిఁగితివో మేఘగంధర్వుఁడు నీ
గతి రవిచే విని దీప
స్థితి వచ్చిన దాని క్రిందఁ దిరము కొనెదవా!

బ్రదుక న్రాదొక్కొ సంశయించెదవు ధై
ర్యం బూఁది యేవేళఁ జా
టుఁ దనం బేటికి రమ్ము బైటి కెవఁ డ
డ్డం జాతుఁ! బొడిండ్లు దూ
ఱెదు, దుష్కీర్తికి సామ్యమయ్యెదవు,
కూర్మిం దొంగలం బ్రోతు, వి
ట్టిదశ న్నిన్నొలి కీడ్వఁ డే ప్రభుఁడు కం
టిం గాలమాహాత్మ్యమున్.

మూలల నున్న సజ్జనుల
    ముంగిలి కీడ్చును నిన్నుఁ దక్క, నే
వేళకు సాధుబాధకు గు
    భిల్లున నీవలె వచ్చు దుష్టులం
దీలుపడంగఁ జేయదు, ప్ర
    తిష్ఠ యొసంగు సమార్గకృత్యదు
శ్శీలుని, కీడ్వ ఛాందసుని
    జేయును బాపురె కాల మిత్తఱిన్.

చెలఁదివోలెను బైఁబడి జీవకోటి
నలమి కృశియింపఁ జేయుదు కలుషవృత్తి
గాని సద్వృత్తి లేదు నిక్కముగ జగము
నీడగతి నాశ్రయించెదు వీడ వెపుడు.

సత్కృతికి నడ్డువచ్చు దుష్టతతి యట్లు
తెల్ల యెడ రంధ్రమును వేచి యెవ్వరికిని
లోఁగ వెటు గల్గె నీదు నల్పునకు గురుత
తక్కునల్పులలోనఁ గొంత ఘన ముండు.

భ్రమరకాళిమ శ్రుతిపాతధ్వని జనించు
బర్హిపింఛాసితము నేత్రపర్వ మగును
పరభృతమునల్పు మాధవప్రమదకరము
కారెలుఁగునల్పు నినుఁ జెంపకాయ గొట్టు.

కోమటిన దృష్టదము,
    కుంతల నైల్యము శోభఁ బెచ్చు, సు
త్రాముని నీలకాంతి యది
    రత్నము, రాఘవకృష్ణ దేహజ
శ్యామలభావ మాస్తిక దృ
    ఢార్చ్యము, బొగ్గుల రూపులోనఁ బ్రా
ణామృతవాయు వుండుఁ, దెలి
    యంబడ దేమియు నీతమస్సులోన్.

బలవద్వైరము తగ దు
ర్జ్వలు లగుట న్వారిచేత సమమానమయం
బుల నెగ్గు పుట్టు నొంటిగ
నిలిచిన మూఢహృదయముల స్నిగ్ధతమనుమా.

---



సూర్య నమస్కారము
శ్రీ సమర్థ వ్యాయామమందిరము, దాదర్, బొంబాయి. G. S. A.

# వ్హిప్పు — కొరడా

గా. హరిసర్వోత్తమరావుగారు, యమ్. ఏ.

'కొరడా' యనిన వినువారు భయమందుదురు. మోటుమాట ఈనాటికి వాడుకగాదని నాగరికులు ఏవగింతురు. కాని కొన్నికొన్ని రాష్ట్రములలో రాజ్యకార్యనిర్వహణాధికారపరిపూర్ణత్వమును పొందిన సభలలో ఈపదమునకు వ్యవహార మున్నది.

ఇంగ్లీషుపార్లమెంటుపద్ధతులు మనదేశమునందు ప్రచారమునకు వచ్చియున్నవి. కాబట్టి అచ్చటి 'వ్హిప్పు' పదమును మన మెరుంగదగినదియే యైపోయినది. పార్లమెంటు మెంబరులను 'వ్హిప్పు' చేయుదురట. అట్లే మనశాసన సభ్యులను—స్టేటుకౌన్సిలులోనివారిని, అసెంబ్లీలోనివారిని, స్థానికశాసనసభలలోనివారిని—'వ్హిప్పు' చేయుట కలదు. అనగా కొరడా తీసికొని నాలుగుదెబ్బలు తగిలింతురని యర్థముకాదు. ఈకొరడా శిక్షచేయుట కేర్పడిన భయంకరమైన యుపకరణము గాదు.

శాసనసభ జరుగుచుండునప్పుడు అనేకముఖ్యవిషయములు విమర్శకు వచ్చును. విమర్శఫలము తేల్చుటకు మెంబరులవోట్లే ఆధారము. అందరు మెంబరులు ఎల్లప్పుడును శాసనసభలోనే కాచుకొని కూర్చొనియుండరు. సభకు హాజరుకానివా రుందురు. హాజరైనను ఇతరపనులమీద పోవువా రుందురు. సభాభవనప్రాంతము లందో, ఇరుగుపొరుగులలోనో విశ్రాంతికై కొనుటకు, ఆటపాటలకు, ఫలాహారాదులు కైకొనుటకు వెడలిపోవువా రుందురు.

శాసనసభయన్నచోట గవర్నమెంటుపక్షమొకటి యుండును. ఎదురుపక్షమొకటి యుండును. అందుచేత ఏముఖ్యవిషయమును గురించియైనను వోటు తీసికొనునప్పుడు గవర్నమెంటువారిని బలపరచు మెంబరుల సంఖ్య తగ్గిపోయెనా గవర్నమెంటుకు పరాజయము కలుగును. ఎదురుపార్టీవారిని బలపరచు మెంబరుల సంఖ్య తగ్గిపోవునా ఆపార్టీకి పరాజయమగును. ఈరెండుపరాజయములను ఆయాపార్టీలవారు వాంఛించునట్టివిగా నుండవు. అది కారణముగా ఏపార్టీ కాపార్టీ తనకు సాధ్యమయినంత బలగమును వోటింగు సంభవించే నిమేషమునకు చేర్చుకొనునట్టి ప్రయత్నము చేయక తప్పదు. అందులోను ప్రభుత్వపక్షము రాచకార్యములు జరుపవలసిన పక్షము. తమకు ప్రతికూలమైన నిర్ణయము శాసనసభలో నేర్పడునేని వారొకొకప్పుడు మహాక్లిష్టదశ ననుభవింపవలసినవా రగుదురు.

ఈకారణముచేత ప్రతినిధిసభలమూలకముగా పరిపాలన యేర్పడిన దేశములందంతటను ప్రభుత్వపక్షమువారేమి, యెదుటిపక్షమువారేమి శాసనసభలలో వోటింగు జరుగునప్పటికి ఆయాసందర్భములను బట్టి తమతమ బలగములను బలవత్తమముగా చేర్చికొనుటకు తగినయేర్పాటులు కావించుకొనవలసినవారైనారు. ఈయేర్పాటులకే వ్హిప్పుల (కొరడాల) యేర్పాటని పేరు కలిగినది. మా రాయలసీమలో కొన్నికొన్ని ప్రాంతములయం దిప్పటికిని పిలుచుకొని రమ్మనుటకు 'తోలుకొని రమ్మనుట' కలదు. కొరడాబుజముపై వేసికొని పోయి పశువులను తోలుకొని వచ్చినట్లు తోలుకొని రమ్మందురా యని మమ్ము నపహసించు నాగరకసోదరులు లేకపోలేదు. ఈనవీన శాసనసభల యేర్పాటులలో 'కొరడా' పద్ధతిమూలకముగా 'తోలుకొని' వచ్చుటకు సభ్యత్వము సంక్రమించినది. శాసనసభలలో పార్లమెంటుతోసహా ప్రతిపార్టీకిని 'వ్హిప్పు' లనే అధికారు లేర్పడుచున్నారు. వీరే పార్టీ 'కొరడాలు'. వీరు పార్టీయధికారులలో చాల గౌరవస్థానము కలవారు. పార్టీనాయకులకు ప్రత్యేకము గదులు, సౌకర్యములు కలుగజేయునట్టిరీతినే ప్రభుత్వమువారు వ్హిప్పులకును ప్రత్యేకము సౌకర్యము లమర్చి యిచ్చుచున్నారు.

పార్టీలోని మెంబరుల హాజరు గైరుహాజరులకు వారివోటుపడే మార్గానికి వ్హిప్పులు పార్టీకి జవాబుదారీ

వహింపవలసియుందురు. అందుచేత మెంబరులు తమ అడ్రెసులు, తమ రాకపోకలు, మున్నగువిషయములలో విప్పులకు (కొరడాలకు) వశవర్తులుగా నడచుకొనవలసియుందురని శాసనసభలచరిత్రలో సిద్ధాంతమైపోయినది. ఈ విప్పు లెవ్వరో బయటివారనుకొందురుసుమా! కాదు కాదు. వీరును శాసనసభసభ్యులే. ఆయా పార్టీలలోని మెంబరులే. తగినచురుకుదనము, సామర్థ్యము గలవారిని జూచి ఆయాపార్టీవారు వీరిని తమపార్టీమీటింగులలో నెన్నుకొందురు. పార్టీలీడరుకు వీరు కండ్లవంటివారు. ఏయే మెంబ రెచ్చటెచ్చట నుందునది, ఎప్పుడెప్పుడు వచ్చునది పోవునది, ఏవిషయమున వచ్చినను పార్టీకి విరోధము కానితీరున వోటిచ్చునది సర్వమును విప్పుల ఎరుకలో జరిగిపోవుచుండవలయును. పార్టీలీడరు అప్పటికప్పుడు చేయునట్టి వోటుకు సంబంధించిన తీర్మానములను విప్పులు మెంబరులకు త్రుటికాలములో నందజేయుచుందురు.

ఇంగ్లీషుపార్లమెంటులో విచిత్రమైనయేర్పాటున్నది. సభకు హాజరైన మెంబరు బయటికి పోవలసియున్నయెడల నొకప్రత్యేకమైన మార్గమున, ప్రత్యేకమైన ద్వారమున పోవలయును. విప్పు లప్పుడు మెంబరు లెవ్వరు వెడలునదియు కనిపెట్టియుందురు. మరియొక చిత్రము నేర్పాటుకూడ కలదు. ఒకపార్టీ మెంబరు ఎదుటిపార్టీ మెంబరుతో మాట్లాడుకొని ఇన్నిగంటలవరకు మేమిరువురమును హాజరుకామని జంటకలిసి వెడలిపోవచ్చును. దానిని విప్పుల కెరింగింతురు. ఆగంటలోపుగ జంటలో నొకరు హాజరైనను వారివోటు గణనకు రాదు. ఈపద్ధతికి 'జంటపద్ధతి' యని పేరుపడిపోయినది. ఏక ద్వారమున మెంబరులు బయటికి పోవలయునను నియమము గాని, 'జంటపద్ధతి' గాని మనదేశమునందు ప్రచారములో లేదు.

విప్పులు (కొరడాలు) జరుపు కార్యక్రమ మంతయును అప్పటికప్పుడు వ్రాసి ప్రతి మెంబరుకును అందచేయునట్టి చీటీలమూలకముగా జరుగుచుండును. ఈచీటీలకు 'విప్పు'లు (కొరడాలు) అనియే పేరు. విషయగౌరవమును బట్టి, ఈచీటీలక్రింద రెండురేఖలు, మూడురేఖలు, అయిదురేఖలు గీచి తరతమములను బ్రిటిషుపార్లమెంటులో సూచించుచుందురట. అయిదుగీతల విప్పు లిప్పుడు లేవు. రెండుగీతలవిప్పులు ముఖ్యములు, మూడు గీతలవిప్పులు మరీముఖ్యము లందురు.

ప్రభుత్వపక్షపు మెంబరులు తగినంతమంది లేని సమయము చూచుకొని ఎదుటిపక్షమువా రొకొకప్పుడు గభీలున తీర్మానమునకు విభజనము తెత్తురు. అప్పటిలో ప్రభుత్వపక్షసభ్యు డొక్కరుడు లేచి దీర్ఘోపన్యాసము నారంభించును. విప్పులు జాగ్రత్తపడి నాలుగు మూలలనుండి మెంబరులను చేరవేయుదురు. గండము తప్పును. ఇదేరీతిని ఏఎదుటిపక్షమువారును తమకు సంఖ్యాబలము తక్కువగానుండి తమ మెంబరులు వచ్చి చేరవలసియుండుచో నేదేని వంక బెట్టికొని దీర్ఘోపన్యాసములు చేయుచుండుటయు, వారి విప్పులు మధ్యకాలమున చాకచక్యముతో పనిదీర్చుటయు సంభవించుచుండును.

ఇట్టిది 'కొరడా'. అదియే విప్పు అనునట్టి సంస్థ: ప్రజాప్రతినిధిప్రభుత్వపు టుపాంగములలో ముఖ్యోపాంగము.

---



౯. గారడి

ఈ చిత్రమున నలుగురుస్త్రీలు ఎనిమిదిచేతులుగల ఒక స్త్రీవలెనే కనుపడునట్లు ఒకరివెనుక నొకరు పొందికగా నిలిచియున్నారు.



౧౦. బలవంతపు స్నానము

ఛాయాచిత్రకారుడు: శ్రీ గోవిందరాజుగారు, బెంగళూరు.




౧౧. గంగాధరుడు

పెన్సిల్ స్కెచ్

చిత్రకారుడు: దొంతంశెట్టి పాపారావుగారు, మద్రాసు.

# శ్రీనాథుని జన్మస్థానము

డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు, యమ్. ఏ., పి హెచ్. డీ.

కవిసార్వభౌముడగు శ్రీనాథుని జన్మస్థానమునుగూర్చి యనేకులు పండితులు వ్రాసియున్నారు. వీరిని రెండు తెగలుగ విభజించవచ్చును— ౧. కర్ణాటకుడనువారు కొందఱు, ౨. తెలుగువాడని కొందరు.

౧. మొదటితరగతివారిలో బల్నాటివీరచరిత్రకు బృహత్పీఠికను రచియించిన బ్ర. శ్రీ అక్కిరాజు ఉమాకాంతం పంతులుగా రగ్రగణ్యులు. వీరివాదములో ముఖ్యాంశము లివి:

శ్రీనాథుడు తన్నుగూర్చి కాశీఖండములో "కర్ణాటదేశ కటకపద్మ వనహేళి శ్రీనాథభట్టకవిని" అని వ్రాసుకొన్నాడు. భీమేశ్వరపురాణములో "ఎవ్వ రేమన్న నండ్రు నా కేమి కొఱఁత? నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" అని చెప్పుకొన్నాడు. దేవరాయసందర్శనార్థమై విద్యాపురంబునకు బోయినప్పుడు, "తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి దయ లేదా యేను శ్రీనాథుఁడఁగా" అని కన్నడరాజ్యలక్ష్మిని సంబోధించినాడు. కావున శ్రీనాథుని జన్మస్థానము కర్ణాటకము. అతని తలిదండ్రులు గొండవీటి కేకారణముననో వచ్చి యచ్చటనే స్థిరముగ నిలిచిపోయిరి. "ఇంటిలోఁ దలిదండ్రులతో మిశ్రకర్ణాటము మాట్లాడుచున్నను బాల్యమునుండి తెలుఁగు దేశములో తెలుఁగువారితోఁ గలసియున్నందున దెలుఁగువానివలెఁ దోఁచుచున్నాఁడు."

౨. ఈవాదమును బూర్వపక్షము చేయ దలచినవారు పెక్కుమంది. ఉమాకాంతం పంతులవారి వాదమును 'బ్రధ్వంసపఱచు' విషయములు రెంటిని బ్ర. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు బయలువెట్టిరి. మొదటిది "భీమఖండకృతి.తి 'పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు' అని శ్రీనాథునిఁ బ్రశంసించుట." రెండవది: "నాసికేతూపాఖ్యానకర్త దగ్గుపల్లి దుగ్గన్న 'శ్రీనాథసుకవి కూఁతిమి సేయ మఱఁది' నని చెప్పుకొనుట."

ఈవిషయములు శ్రీ ఉమాకాంతం పంతులుగారి వాదమున కత్యంతబాధకములే; అయితే శ్రీనాథుడు తనకవిత్వము "కర్ణాట భాష" యనియు, తాను "కర్ణాటదేశకటకపద్మ వనహేళి" యనియు చెప్పుకొన్నాడే, దానికి అర్థమేమి? అనుప్రశ్నకు బ్ర. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా రిట్లు సమాధానము చెప్పినారు: శ్రీనాథుఁడు డిండిమభట్టారకు నోడించి కర్ణాటకరాజ్యమునకు రాజధానియగు విజయనగరమునందలి పండితు లనుకమలవనములకు సూర్యుఁడాయెను. కాకతీయరాజ్య మంతరించినతరువాత "నాంధ్ర దేశమున దక్షిణ

భాగము (పాకనాటి సీమవఱకు గలదేశము) కర్ణాటరాజ్య మనబరగుచున్నందున నచ్చటి వాడగు శ్రీనాథునిగుఱించి రాజమహేంద్ర వరపు బండితులు గొంద ఱితనికవిత్వము సంస్కృతమనియు, గొందఱు కన్నడ మనియు వంకలు పెట్ట, 'నెవ్వరేమన్న నంద్రు నా కేమి కొఱంత, నాకవిత్వంబు నిజము కర్ణాట భాష' యని చెప్పియుండును. 'తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి' యను కర్ణాటదేశ మాతృ సంబోధనము దన కాశ్రయు లగు కొండవీటి రెడ్లు, రాజమహేంద్రమురెడ్లు, తెలుగురాయడు, మైలారిరెడ్డి మున్నగువారు స్వర్గస్థు లయినపిదప వార్ధక్యములో గన్నడరాజ్యమున కేగినపుడా కాలస్థితినిబట్టి అచటివారు తన్నాదరింపకుండ, 'తల్లీ! దయ లేదా? నేను డిండిమ భట్టారకు నోడించిన శ్రీనాథుఁడ' నని తన్నె ఱుకపఱచుకొని యుండవచ్చును."

శ్రీవీరభద్రరావు గారి వాదము 'బల వత్తమ మగునదిగ మన కగపడక పోయినను' అని నిరసించుచు, శ్రీమాన్ ఉప్పల నరసింహాచార్యులుగారు 'ఆంధ్రచరిత్ర కారుల యభిప్రాయమె సమంజస'మని యొప్పుకొన్నారు.

ఉభయ పక్షములవారి వాదమందును గొంత నిజము గాన్పించుచున్నది. శ్రీనాథుడు కర్ణాటకుడగుట నిస్సంశయము; కాని కన్నడిగుడు మాత్రము కాజాలడు. శ్రీనాథుని కాలమున కర్ణాటక కన్నడశబ్దములు సమానార్థకములు గావు. ఏనాడు విద్యారణ్యస్వామి విద్యానగరరాజ్యమును స్థాపించెనో ఆనాటి నుండియు దక్షిణాంధ్ర దేశమునకు గర్ణాటక నామము రూఢికెక్కినది. కర్ణాకమను పేరు ప్రస్తుతపు బళ్లారి, అనంతపురము, కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరుమండలములకు అప్పుడు చెల్లుచుండెను. ఈ సందర్భమును జక్కగ గ్రహించినవా రగుటచే శ్రీ వీరభద్రరావు పంతులుగారు దక్షిణాంధ్రదేశమునకు, అనగా పాకనాటి వఱకు గల దేశమునకు గర్ణాటరాజ్య మను పేరుండె నని వ్రాసినారు. పాకనాటికి ఉత్తరమున నుండుదేశమునకు కర్ణాటకనామము శ్రీనాథునికాలమున లేదు. ఈ విషయమును శ్రీనాథుడే వ్యక్త పఱచియున్నాడు. తెలుగురాయని ఆశీర్వదించుచు శ్రీనాథుడు "కర్ణాటాంధ్రాధిప, సాంపరాయని తెలుంగా, నీకు బ్రహ్మాయువౌ!" అన్నాడు. "కర్ణాటాంధ్రాధిపు" డట తెలుంగరాయఁడు! ఎవ రీతెలుంగరాయఁడు?

'విజయనగరాధీశ్వరుఁడగు ప్రౌఢ దేవరాయనికి లోబడిన' సర్దారుడు. ఇతనివి శాసనములు కొన్ని దొరకినవి. క్రీ. శ. ౧౪౨౬ నాటి శాసన మొకటి నెల్లూరుమండలము లోని పొదిలె తాలూకాయందలి కూచిపూడియం దున్నది. మఱొకటి సింహాచలమునం దున్నది. అది క్రీ. శ. ౧౪౨౮ నాటిది. ఇతనికొడుకు శాసనములు కొన్ని గుంటూరు మండలములోని బాపట్లతాలూకాలో నున్నవి. ప్రౌఢదేవరాయల కళింగదండయాత్రలో

బాల్గొనుటచే దెలుంగ రాయడు సింహాచలము వఱకు బోయి యచ్చట శాసనము వేయించుట సంభవించెను. ఆతని రాజ్యస్థానము పొదిలె. ప్రౌఢదేవరాయలు కొండవీడు రాజ్యము నాక్రమించికొన్నప్పుడు తద్రాజ్యములో కొంత భాగము, అనగా ప్రస్తుతపు బాపట్లతాలూకా యితనికి సైవస మాయెను. ఇతనివి గాని, యితని పూర్వికులవి గాని శాసనములు మఱి యెచ్చటను గాన్పించవు. కావున నితఁ డేలిన భూమి దక్షిణమున పొదిలె మొదలు ఉత్తరమున బాపట్లవఱకును వ్యాపించియుండెను. ఈభూమిని పాలించిన ప్రభువును శ్రీనాథుడు "కర్ణాటాంధ్రాధిప" అని సంబోధించినాడు. తెలుంగ రాయడు పాలించిన కర్ణాట మేది? పొదిలె సీమ. ఎట్లనగా: పొదిలె పాకనాటిసీమయందంతర్గతమైన దేశము. పాకనాడు కర్ణాట సామ్రాజ్యమునకు జేరినది. కావున పొదిలె కర్ణాట భూమిలోని దగుచున్నది. అదియె తెలుంగురాయ డేలిన కర్ణాటకము. 'కర్ణాటాంధ్రాధిప' యనుదాని కిట్లే యర్థము చెప్పవలసియున్నది. మార్గాంతరము లేదని తలచెదను. బాపట్ల కమ్మనాటిలోనిది. ఇదియే తెలుంగరాయ డేలిన ఆంధ్రదేశము. పాకనాడు "కర్నూలు గుంటూరు నెల్లూరు కృష్ణా మండలములలో సంక్రమించిన దగు" నని శ్రీ ప్రభాకరశాస్త్రిలవా రనుచున్నారు. ఇది సంగతము కాదు. పాకనాడు నెల్లూరు కడపమండలములకు సంక్రమించినట్లు శాసనములవల్ల దెలియుచున్నది. ప్రస్తుతము గుంటూరిమండలములోనికిగూడ కొంత యణకువై యుండిన నుండవచ్చును. గుండ్లకమ్మనదియే పాకనాటికి ఉత్తరపుసరిహద్దైయున్నట్లు గాన్పించుచున్నది.

కర్ణాటకసామ్రాజ్యములోని కడకువమైన దేశమున బుట్టి యచ్చటిభాషనే మాటలాడువా డగుటచేతనే శ్రీనాథుడు కర్ణాటకరాజ్యలక్ష్మిని 'తల్లీ!'యని సంబోధించినది. తత్కారణముననె అతనికవిత్వము కర్ణాటభాష యైనది. 'కర్ణాటకటకపద్మవనహేళి' యని చెప్పుకొన్నదియు తన్మూలముననే. అయిన శ్రీనాథుని జన్మస్థానము కర్ణాటకములో నేది? ఈ ప్రశ్నకు తత్క్షణము జవాబు 'పాకనాటిలో' నని చెప్పవచ్చును. ఏలన భీమఖండకృతిభర్త శ్రీనాథుని 'పాకనాటింటివాడవు' అనుటచేత. అందఱు పండితులు పాకనాడే యాతని జన్మస్థానము అని చెప్పుటచేత కూడను.

పాకనాటిలో నెచ్చట?—ఈవిషయమును నిర్ధారణచేసి చెప్పుట కొంచెము కష్టమే; కాని శ్రీనాథుడే కొంతమార్గము చూపుచున్నాడు. ఆమార్గమును అనుసరించుటకు జంకవలసిన యవసరము లేదు. హరవిలాసమందు,

> "ఉభయభాషాకవిత్వప్రయోగకుశలు
> బాలసఖు గారవించి తాత్పర్య మొప్ప
> నవచి దేవయ త్రిపురారి యక్షరాజు
> హితమితోక్తులు వెలయంగ నిట్టు లనియె"

అనియు,

> "ఆగమజ్ఞాననిధివి తత్త్వార్థఖనివి
> బహుపురాణజ్ఞుడవు శుభభవ్యమతివి

బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి
యవధరింపుము నాపేర నంకితముగ"

అనియు వ్రాసియున్నాడు.

ఇందువల్ల అవచి తిప్పయ శెట్టికి శ్రీనాథుఁడు 'బాలసఖు' డని తెల్లమగుచున్నది. 'బాలసఖు' డనునది 'బాల్యసఖు' డనుదాని కపపాఠమని తోఁచుచున్నది. ఏలన, 'బాలసఖు' డనుమాటకు బాలుఁడైన సఖుఁడని యర్థము చెప్పఁకొనవలసి యున్నది. అట్లగునేని శ్రీనాథుఁడు హరవిలాసమును దన బాల్యమున రచించి యుండవలయును. ఇది పొసగదు. హరవిలాసమే యట్టి కుదాహకు విరోధముగ సాక్ష్యము బల్కుచున్నది. చూడుఁడు:

"కమలనాభుని పౌత్రు గవితామహారాజ్య
 భద్రాసనారూఢుఁ బరమపుణ్యుఁ
బాత్రు నాపస్తంబసూత్రు భారద్వాజ
 గోత్రు సజ్జనమిత్రుఁ గులపవిత్రు
భీమాంబికా మారనామాత్యనందను
 నఖిల పురాణవిద్యాప్రవీణు
నధ్వర్యు వేదశాఖాతిథినిష్ణాతు
 నాంధ్రభాషా నైషధాబ్జభవుని
నుభయభాషాకవిత్వ ప్రయోగకుశలు
బాలసఖు గారవించి తాత్పర్య మొప్ప
నవచిదేవయ త్రిపురారి యతఁడు రాజు
హితమితోక్తులు వెలయఁగ నిట్టు లనియె."

పై పద్యములోని యీ క్రిందిమాటలను దిలకింపుఁడు:

౧. కవితామహారాజ్య భద్రాసనారూఢుఁ
౨. అఖిలపురాణ విద్యాప్రవీణు
3. అధ్వర్యు
౪. వేదశాఖా*తిథినిష్ణాతు
౫. ఆంధ్రభాషా నైషధాబ్జభవుని
౬. ఉభయభాషాకవిత్వప్రయోగకుశలు.

హరవిలాసరచనాకాలమునకు బూర్వమే శ్రీనాథునికిగల గుణవిద్యాసంపదలను బై వాక్యములు దెల్పుచున్నవి. ఇందు మొదటిదానివల్ల హరవిలాసము రచించుటకు ముందే శ్రీనాథునికి గవిసార్వభౌము డనుబిరు దుండెననియు, రెండవదానివల్ల సర్వపురాణముల యందును బ్రావీణ్యము గలదనియు, మూఁడవదానివల్ల యజ్ఞమును జేయించినాఁ డనియు, నాల్గవదానివల్ల వేదాధ్యయనమునందు నేర్పరి యనియు, నైదవదానివల్ల ఆంధ్రభాషయందు నైషధమును రచించెననియు, నాఱవదానివల్ల నుభయభాషాకవిత్వమున నపారమగు ప్రజ్ఞ గలవాఁడనియును దెలియుచున్నది. పై విషయములయం దైదవది ముఖ్యముగ విచారించదగినది. హరవిలాసమును రచించుటకు పూర్వము శ్రీనాథుఁడు శృంగారనైషధమును రచించెనని యింగు మూలమున దెలియుచున్నది. శృంగారనైషధరచనాకాలమప్పటికి శ్రీనాథుఁడు 'నిండుజవ్వనమున' నుండెనని "సంతరించితి నిండుజవ్వనంబున యందు హర్షనైషధకావ్య మాంధ్రభాష" అను శ్రీనాథుని వాక్యమువల్లనే దెలియుచున్నది. ఇంతే కాదు:

* 'వేదశాఖా తిథినిష్ణాతు' అపపాఠము; 'వేదశాఖా విధినిష్ణాతు' అని దిద్దుకొనవలయును.

హారవిలాసరచనకు ముందు మరుత్తరాట్చరిత్ర, శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రము మొదలగు గ్రంథములను వ్రాసెను. కావున నిండుజవ్వనమున వ్రాసిన శృంగారనైషధము నకు పిదప హారవిలాసమును వ్రాయ నుద్యమించిన శ్రీనాథుడు బాలు డెట్లగును? నిండుజవ్వనము దాటిన కవిని అవచి తిప్పయ "బాలసఖుడవు" అనుట యెట్లు పొసగును? మఱియు "బాలసఖుడవు అనగా కుఱ్ఱవాడవగు చెలికాడవు, తత్కారణమున నాపేర నొకగ్రంథము నంకితము సేయుము" అని యవచి తిప్పయ శ్రీనాథు నడుగుటలో నంతస్వారస్య మేమియు గాన్పింపదు. బాల్యసఖుడ వనుట సందర్భశుద్ధిని కలిగియున్నది. అవచి తిప్పయ శ్రీనాథు నిట్లు ప్రార్థించెను: "ఓ మహాకవీ, నీవు ఆగమజ్ఞాననిధివి, తత్త్వార్థఖనివి, బహుపురాణజ్ఞుడవు, శుభభవ్యమతివి. ఇంతే కాదు; నీవు నాకు పిన్నటినాటి మిత్రుడవు. కావున నా కోరికను ద్రోసిపుచ్చక శైవప్రబంధ మొకటి నాపేర నంకితముగ నవధరింపుము"—అని. కావున బాలసఖు డనుట యపపాఠము. బాల్యసఖు డని దిద్దుకొనుట పాఠకుల విధి.

బాల్యసఖుడే సరియైన పాఠమని నిశ్చయించితిమి. బాల్యసఖు డనగా బాల్యము నుండి సఖుడని గాని, లేక బాల్యమందలి సఖుడని గాని యర్థము. అవచి తిప్పయయు, శ్రీనాథుడును బాల్యసఖు లయినచో, బాల్యమందు వా రిరువును ఒకచోట కొంతకాలముండిన గాని వారి కట్టిసఖ్యము కుదురుట కవకాశము లేదు. కావున వారిరువురు నొక్కయూరివారై యుండవలయును. తిప్పయ నివాసస్థలము కాంచీపురియని "కాంచీపురీనివాస" అను హారవిలాసపు తృతీయాశ్వాసాంత పద్యములోని వాక్యమువల్ల దెలియుచున్నది. శ్రీనాథుడుగూడ కాంచీపురనివాసుడా? కాదు. ఏలన, కాంచీపురము అవచి తిప్పయ నివాసస్థలము. కాని జన్మస్థలము కాదు. అతనిజన్మస్థలమును గూడ శ్రీనాథుడు నిరూపించియున్నాడు. తిప్పయ తండ్రియగు నవచి దేవయ శెట్టి యూరు కాంచీపురముగాదు. అవచి దేవుని తండ్రి 'సింహవిక్రమపట్టణ శ్రేష్ఠుడైన సెట్టి జగజెట్టి పావాణిసెట్టి విభుడు.' అవచి దేవుడు శ్రీపర్వతసోపానస్థాపకు డగు వేమారెడ్డికి బాపు. ఇతనిపుత్రులు తిప్పయ, తిరుమలనాథుడు. కావున తిప్పయకుటుంబమునకు నునికిపట్టు సింహవిక్రమపట్టణము. తిప్పయ జన్మస్థానమును ప్రాయశః ఆపట్టణమే. ఇతనిగురువు "పిల్లలమఱ్ఱి మహాప్రధాని పెద్దన్న". ఈపిల్లలమఱ్ఱి పెద్దన యెవ్వరు? మహాకవి పిల్లలమఱ్ఱి పినవీరభద్రునియన్న పెద్దన్న యొకడుండెను. కాని యతడు తిప్పయ శెట్టికి పిన్నటినాటి గురువు కాజాలడు. ఏలన, పినవీరభద్రుడు శ్రీనాథునికి దరువాతివాడు; సాళ్వ గుండ నరసింహరాయల యాస్థాన కవీశ్వరుడు. ఇతని 'యగ్రభ్రాత 'యు నప్పటివాడె. కావున నీ పెద్దనయు, శ్రీనాథుని బాల్యసఖుడగు తిప్పయ

శెట్టి 'పిన్నటినాటి' గురు వగు పెద్దనయు నొక్కరు కాజాలరు. కావున 'పిల్లలమఱ్ఱి మహాప్రధాని పెద్దన్న' పినవీరభద్రుని తాతయై యుండవలయును. వీరభద్రుని 'యగ్రభ్రాత' కు అతనిపేరే పెట్టిరి.

పిల్లలమఱ్ఱివారు సింహావిక్రమ పట్టణ ప్రాంతవాసులు. పినవీరభద్రుడు తన ప్రథమ ప్రబంధ మగు శృంగారశాకుంతలమును నెల్లూరుజిల్లా కావలి తాలూకాలోని బిట్రగుంటకు సమీపమునందలి సోమరాజుపల్లె నివాసియగు చిల్లర వెన్నయమంత్రి కంకితము చేసెను. వెన్నయ రాజు కాడు; అమాత్యుడుగాడు; దండనాథుడుగాడు; స్థితిపరుడగు సామాన్యపు నియోగి బ్రాహ్మణుడు. సోమరాజుపల్లె గ్రామకరణమై యుండిన నుండవచ్చును. అతనికి దనప్రథమగ్రంథము సంకితచేసిన కవియు నచ్చటివాడే. ఈతని తాతయగు మహాప్రధాని పెద్దన్నయు నచ్చటివాడే. 'మహాప్రధాని' యన్నపే రున్నను పెద్దన్న సామాన్యపు నియోగిబ్రాహ్మణుడే! ఏలన, ఇతడు తిప్పయశెట్టికి చదువు చెప్పిన బడిపంతులు. "తగ నక్షరశిక్షయు దైవమార్గ సంపన్నతయుఙ్ వివేకపరిపాటియునుం గృపచేసె" నన్న హరవిలాసవాక్యము దీనిని రుజువుచేయుచున్నది. 'పిన్నటనాడు', 'అక్షరశిక్ష' జేసినవాడు బడిపంతులు గాక ఇతరు డెట్లగును? శ్రీనాథుడును ఈ పెద్దనగారి బడిలోనే చదివెనేమో! అచ్చటనే చేకూరనేమొ శ్రీనాథునికి అవచితిప్పయతోటి బాల్యసఖ్యము!

తిప్పయశెట్టి తాత తండ్రులు సింహావిక్రమపట్టణవాసు లగుటచేతను, అతని పిన్నటినాటిగురువు సింహావిక్రమపట్టణసమీపస్థమగు బిట్రగుంట ప్రాంతములవా డగుటచేతను, తిప్పయశెట్టి జన్మస్థానమును నాసింహావిక్రమపట్టణమే కావచ్చును. తిప్పయశెట్టి బాల్యమచ్చటనే గడచియుండవలయును. అతనికి బాల్యమున శ్రీనాథునితో మైత్రి కుదిరిన నాయూరనే కుదిరియుండవలయును. కావున శ్రీనాథుని బాల్యము సింహావిక్రమ పట్టణమందు గడచెను. సింహావిక్రమపట్టణ మనునది నెల్లూరికి నామాంతరమైన దంద తెలిసిగిన విషయమే. కావున శ్రీనాథుని జన్మస్థానము నెల్లూరనుట యొప్పును.

---

# చాగివారు

పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు

కార్తికమాసపు భారతిలో శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారు 'చాగివారు' అనుశీర్షికతో నొక వ్యాసము వ్రాసిరి. అందు 'చాగివారు క్షత్రియులా?' అనికూడ సందియము వెలిపుచ్చిరి; సరికదా చాగివారి వంశావళిని నూడుకీతులజూపిరి. పైపెచ్చు 770-వ పుటలో చాగివారు చతుర్థాన్వయులనియే నిర్ణయించిరి. ఇందు దప్పేమున్నది? వారి యూహనుబట్టి యొప్పె యగును. ఈ క్రింది వంశవృక్షమునుబట్టి చాగివారు క్షత్రియులందును, చతుర్థాన్వయులందును గలరని తెలియును. చాగివారు క్షత్రియులేకాని చతుర్థాన్వయులు గారు. దుర్జయునకు బదునొకండవవాడగు చాగ్నిపీచిమహారాజునుబట్టి దుర్జయవంశమునకు చాగివంశమని పేరు వచ్చెనని కొందఱును, దుర్జయునకు బదునెనిమిదవవాడగు త్యాగరాజునుబట్టి పైపేరు వచ్చెనని కొందఱును జెప్పుచున్నట్లు చాగివారి వంశవృక్షము చెప్పుచున్నది. శ్రీ రామబ్రహ్మముగారు చూపిన వంశావళి దుర్జయునకు నిరువదిరెండవవాడగు పోతరాజు నలగాము వీరారెడ్డి కుమార్తె * ముక్తాంబను వివాహమాడి చతుర్థాన్వయుడై ప్రకటించుకొన్న శాసనములు ఆధారముగా గలది. కాని క్షత్రియులైన చాగివారి వంశావళికిని దీనికిని హస్తిమశకాంతరము. చతుర్థాన్వయుడైన పోతరాజుసంతతివారు ప్రకటించుకొన్న శాసనములే చాగివారు క్షత్రియులు గారనుసందియమునకు దావిచ్చుచున్నవి. అది సమంజసముగానే యున్నది. క్షత్రియులైన చాగివారి వంశవృక్షములో అరయుడు — నరసింహవర్ధనపోతరాజు — గణపతిరాజు, మనుమచాగి గణపతి - అనువా రెవ్వరును లేరు. చతుర్థాన్వయుఁడయ్యున పోతరాజును దత్సంతతియు దమకు మూలపురుషుడగు దుర్జయుని ముందు పేర్కొని పిమ్మట పదునాడవవాడగు మార్సరాజు (ముప్పరాజు)ను, ఇరువదియాడవవాడగు దోరపురాజు (రెడ్డిలను బెండ్లియాడిన పోతరాజు తాత)ను మాత్రము పేర్కొనిరి. దీనంజేసియే సందియములు గలుగుచున్నవి.

చాగివారి వంశవృక్షము దుర్జయునిదొట్టి నేటి మాతండ్రిగారి మేనమామలవఱకును అవిచ్ఛిన్నముగా గలదు. ఇట్టి వంశవృక్ష మాంధ్రదేశములో నేజాతి యందును గానము. చాగివంశ మెన్నెన్ని మార్పులను జెందియున్నదో యీవంశవృక్షము వేయితరసాక్ష్యములో బని లేకయే సాక్ష్య మిచ్చుచున్నది. అందు జరిత్రకు సంబంధించినంతవఱకు నీక్రింద బొందుపఱచుచున్నాను. శ్రీ రామబ్రహ్మంగారు దీనినిబట్టి సంపూర్ణ విమర్శనము చేసి సత్యమును లోకమునకు వెల్లడించెదరు గాక.—

"ఆదిపురుషులైనటువంటి దుర్జయమహారాజుగారు గాయువంశవృక్షము. పూర్వం దేవగిరియందు గుడిమెట్ట యందును సూర్యకులావతంస హైహయవంశోద్ధారక నరపాలమకుటమణి కాంతాయుక్త లక్ష్మధరాపరిపాలన మాచరించిన దుర్జయ మహారాజుగారి వంశవృక్షము.

(అసలకు సరియైన నకలు)

1. దుర్జయమహారాజు
2. రణజయమహారాజు
3. మృతికర్ణమహారాజు
4. ధవళకర్ణమహారాజు

* పోతరాజు కట్టించిన ముక్తేశ్వరమహాదేవరగుడికిని భార్యయగు ముక్తాంబకును ఏదేని లంకె కలదేమో.




1. వీరు మాగధులకోడి సామంతులయిరి. వీరిసంతతివారు వేంగిదేశమునకు సామంతులుగా నుండిరి. 2. వీరు మాగధుల మూర్తాని దేవగిరి నాక్రమించిరి. 3. వీరిని సాగ్నిమహారాజుగాకని వాడిరి. వీరినూలమువ వంశమునకు సాగ్నివారనియు, కొంతకాలమునకు సాగివారనియు వాడబడుచున్నట్లు చెప్పుచున్నారు. 4. వీరిని ముప్పరాజని వాడిరి. 5. వీరిని జనులు పాగిరాజని వాడిరి. వీరినుండియే యీవంశమునకు సాగిరాజనియు, కొంతకాలమునకు సాగివారనియు వాడుక వచ్చినది. 6. వత్సవాయివెళ్లినవారు. 7. వీరికి వత్సవాయివెళ్లినందున వత్సవాయివారని వాడుక వచ్చినది. వీరు వల్లానివారిని గురువులుగా నాశ్రయించిరి 8. వీరు నలగాము పెద్దారెడ్డికొమార్తె ముక్తాంబను వివాహమై రడ్లకు తోడుగా ఉన్నారు.

- 30. గోపరాజు
  - 31. పెద్దిరాజు
    - 32. గోపరాజు
      - 33. సింగరాజు
        - 34. దోరపురాజు
          - 35. గోపరాజు
            - 36. శ్రీరాయపరాజు
              - 37. శ్రీగోపరాజు9
              - శ్రీగోవిందరాజు10
  - దోరపురాజు (పెనుగొండ)
- 30. మాచిరాజు
  - దోరపురాజు
    - నారాయణరాజు
      - రామరా…
        - బుధరాజు11
      - జగ్గరాజు
        - రామరాజు
          - సూరపరాజు
            - రామరాజు
              - వరహాలరాజు
              - తిర్పతిరాజు
                - వరహాలరాజు (చెయ్యేరు అగ్రహారం)
                  - తిరపతిరాజు
                    - రామరాజు13
                - నారాయణరాజు12
            - నారాయణరాజు
  - పోతిరాజు
    - రంగరాజు14
      - రామసింగు15

చాగివారికి వంశము పరంపరాగతగురువులుగారు తిరుపతికాపరస్థులు శ్రీరంగపురం వగైరా అగ్రహారీకులు శ్రీభాష్యం తిరుమల పంచాంగం వెంకటాచార్యులు అయ్యవార్లుంగారు. వీరు శ్రీరంగపుర మొదలగు అగ్రహారీకులు. కుమారు సీమలోనివి. నూజవీడువారికి చేరినపిమ్మట వీరికుమారులు హైదరాబాదులో ప్రవేశించినారు. తాతాచార్యులుగారు హరితసగోత్రం ఈవెంకటాచార్యుల అయ్యవార్లంగారు, కీ. తాతాచార్యులుగారు, వెంకటవరదాచార్యులుగారు, తిరువెంకటాచార్యులుగారు, శ్రీభాష్యం తిరుమల పంచాంగం వెంకటాచార్యులుగారి స్వహస్తము."

---

9. నైవశేయసాగరసంగమముచేసిన గోపరాజుగారు వీరే. నోగులమాళం (రాజోలుతాలూకా, తూర్పుగోదావరి) గ్రామవాసులు. ఈగోపరాజుగారి కోవలోనివారే మాతండ్రి మేనమామలు. 10. కిల్లంక (తూర్పు గోదావరి) గ్రామవాసులు. 11. వీరికుటుంబమునకు బుధరాజువారని వాడుకవచ్చినది. 12. నైజాంప్రభువగు అబ్దుల్లాదౌలాగారి ఫౌజుదారుగానుండిరి. వీరు విజయనగరమువద్ద కణకిలో ఉన్నారు. 13. అగజ్జులో ఉన్నారు. 14. సుబేదారు రామసింగుకుమార్తెను వివాహము చేసికొని భువనగిరిలో నున్నారు. 15. ఈయనకు బూందిలీ అని వాడుకవచ్చినది.







౧. వేసవి గోదావరి (దుమ్ముగూడెమువద్ద)



౨. గోదావరి ( నాసికవద్ద )

ఛాయాచిత్రకారుడు : జి. వీ. రంగమన్నారుగారు, మదరాసు

# సర్ హెచ్. యస్. గౌరుగారి విడాకులబిల్లు

శ్రీమతి చిలుకూరి లక్ష్మీనరసమ్మగారు

హిందూధర్మశాస్త్రము ప్రకారము వివాహము ఒకసంస్కారము. పెండ్లిలో పడిన ముడి చనిపోయేవరకున్ను ఉండవలసినదే. భర్త ఎంత మంది స్త్రీలనైనను-మునుపటి భార్య గాని, భార్యలు గాని, తనతో కాపురము చేస్తూఉన్నా, తిరిగీ పెళ్లి చేసుకోవచ్చును. కాని, ఆడదిమాత్రము తనకు పుస్తె కట్టిన మగనితోనే బ్రతికిఉన్నంతవరకు పడి ఉండవలెను. భర్త వ్యభిచారి యైనా, క్రూరముగా తన్ని హింసిస్తూఉన్నా, త్రాగుబోతు అయినా, నేరములకు రాజదండన పొందినవా డయినా, కుష్ఠరోగము మొదలైన దీర్ఘరోగములతో యీడ్చుకొంటూ ఉన్నా, నపుంసకు డైనా, మతిలేని పిచ్చివాడైనా, సన్యాసి అయి ఆలుబిడ్డలను విడిచి లేచిపోయినా, మరియొకమతములో చేరిపోయినా — ఎంత దుర్మార్గుడు, ఎంత భ్రష్టుడు, ఎంత అశక్తుడు, ఎంత పనికిమాలినవాడు, ఎంత మతిలేనివాడు అయినప్పటికిన్ని, ఆడది మగనికి విడాకు లిచ్చి మరిఒకనిని శాస్త్రోక్తముగా పెండ్లిచేసికొనడానికి అధికారము లేదు. ఈరీతిగానే మగడు కూడా తనభార్యకు పైని చెప్పిన లోపములు ఏవి ఉన్నప్పటికిన్ని ఆమెకు విడాకులు ఇవ్వడానికి వీలు లేదు. భార్య మగనిఇల్లు విడిచి వేరే ఉన్నప్పటికిన్ని వారికి భార్యాభర్తల సంబంధముమాత్రము పోదు. భర్తగాని, భార్య గాని, తిరిగీ కలిసి కాపురము చేయడానికి నిర్బంధము చేయవలసినదని కోర్టులో దావా తెస్తే కోర్టువారు అట్లు కాపురము చేయవలసినదని ఆజ్ఞాపించవచ్చును. కాని, కుష్ఠరోగము, కొరుకురోగము మొదలైన అసహ్యరోగములు కలిగిఉన్నాడని కాని, ఇంటిలో ముండ నుంచుకొన్నాడని కాని, మగనిదగ్గరకు పోతే తనకు అపాయము కలుగుతుందని కాని, లేదా తన మతమును విడిచిపెట్టినాడనికాని, రుజువు చేయగలిగితే భార్యను భర్తయింటికి పొమ్మని కోర్టువారు నిర్బంధించరు. భార్య వేరే ఉన్నప్పటికిన్ని వారిద్దరికిన్ని సంబంధముమాత్రము పోదు. భార్య మరిఒకనిని పెండ్లి చేసికొన వీలులేదు. ఆమె వేరే ఉండి వ్యభిచారము చేస్తూవున్నా నోరుమూసికొని పడివుండవలసినదే. భార్యభర్తఇంటిలో ఉండి సఖ్యముగా, అనురాగముతో ఉంటే జీవనము బాగా జరుగుతుంది. వారు కొట్లాడి విడిపోయినా భర్త తనశక్తిప్రకారము మనోవృత్తి మాత్రము ఇస్తాడు.

పెండ్లి అనేది ఒక మతసంస్కార మని చెప్పినాము. దీని ప్రకారము భార్యయొక్క ప్రయోజనము ఒక కొడుకును కని, భర్తకు పిండోదకముల మూలముగా ఊర్ధ్వగతిని కల్పించడమే. భర్తది బీజము; భార్యది క్షేత్రము. భర్తకు తన క్షేత్రములో, తనకు పుట్టిన కొడుకు ఔరసు డనిపించుకొంటాడు. భర్త చేతగానివాడైతే ధర్మశాస్త్రప్రకారము భార్యను మరియొకని వద్దకు పంపి పుత్రులను బడయవచ్చును. ఇట్టి కొడుకులకు క్షేత్రజు లని పేరు. భర్తవల్ల కాక, మరిఒకనికి రహస్యముగా పుట్టినవాడుకూడా భర్తకు కొడుకే అవుతాడు. ఈ రీతిగా దాయాదులైన కొడుకు లారుగురున్ను, దాయాదులు కాని బంధువులైన కొడుకు లారుగురున్ను-మొత్తము పన్నెండురకముల కొడుకులు ధర్మశాస్త్రాలలో చెప్పబడ్డారు. వీరిలో దాయాద పుత్రు లారుగురున్ను తల్లిదండ్రులకు పిండోదకము లిచ్చి దాయభాగమునకు అర్హు లవుతారు. అందుచేత వారందరున్ను తల్లితండ్రులకు ఊర్ధ్వలోకగతులను కల్పించ గలిగినవారే.

కాని కాలక్రమేణ ఈ ఆచారములన్నీ మారి పోయినవి. ఔరసపుత్రుడే శ్రేష్ఠుడనిన్ని, వాడు లేనప్పుడు దత్తుడు ఉండవచ్చుననిన్ని అభిప్రాయాలు ఏర్పడుకొన్నవి. భర్తవల్ల కాక మరియొకరీతిగా భార్యకు రహస్యముగా పుట్టినవానినికూడా విధి లేక కొడుకని పిలుచుకొంటున్నారు. కాని, భర్తవల్ల కాకుండా మరి ఎవనికి పుట్టినా అగౌరవము, లజ్జాకరము అని నేడు తలుస్తున్నారు.

భర్తతో గౌరవముగా, సుఖముగా కాపురము చేయనపుడు భార్యకు మరి గతి లేదా? అట్టిగతిని కల్పించవద్దా? వారు వ్యభిచారిణులుగా ఉండడము కంటె మరియొకనిని కట్టుకొని ఉత్తమ-ఇల్లాండ్రై) ఉండడము మేలు కాదా అని హిందూస్త్రీలపై దయ దలచి గౌరుగారు ఈబిల్లును ఢిల్లీశాసనసభలో ప్రవేశ పెట్టినారు. ఆసభవారు బిల్లుపై దేశీయుల అభిప్రాయ మును ముందుగా కనుగొనవలసినదని కోరినారు.

గౌరుగారి బిల్లు

"హిందూమతము నవలంబించినవారి వివాహములను రద్దుచేయు విషయమై కొన్ని సందేహములను తొలగించుటకై బిల్లు.

"కొన్ని సందర్భములలో హిందూమత మవలంబించినవారి వివాహములను రద్దుచేయు విషయమున కొన్ని సందేహములను తొలగించడము అవసరము గనుక యీ క్రిందివిధముగా శాసించడ మైనది:—

"౧. ఈశాసనమును హిందూవివాహములను రద్దు చేసే చట్టము, ౧౯౩౨ అని పిలువచ్చును.

"ఇది హిందువు లందరికిన్నీ, బ్రిటిషుఇండియా లోని అందరికిన్ని వర్తిస్తుంది.

"౨. ఈచట్టమునకు విరుద్ధముగా యేదైనా శాసనము గాని, ఆచారము గాని ఉన్నప్పటికిన్ని, (౧) భర్తయొక్క నపుంసకత్వము, (౨) అతనిమతి తప్పిపోవడము, (౩) ఘోరమైన లేక పుండ్లతో కూడిన కుష్ఠు రోగముతో బాధపడుతూ ఉండడము అనేవాటిలో ఏకారణముచేతనైనా తన వివాహము సక్రమమైనది కాదని కాని, దానిని రద్దుచేయవలసినదని కాని తీర్పును పొందుటకు హిందూభార్యకు హక్కు గలదు.

"౩. ఇంతకు పూర్వము వివాహములను రద్దుచేసికొనే విషయములోగల హక్కులు యీశాసనమువల్ల యేవిధముగాను పోజాలవు"

పైబిల్లుయొక్క యుద్దేశములను, దానికిగల కారణములను వివరిస్తూ గౌరుగా రీక్రిందివిధముగా వ్రాసినారు:

"హిందూధర్మశాస్త్రప్రకారము పెండ్లియొక్క ముఖ్యోద్దేశము పుత్రసంతానము బడయుటయే. ఈ ఉద్దేశము కొనసాగుటకు నియోగ మనే ఆచారమును కూడ అవలంబించడము ఆవశ్యక మాతూ ఉండేది. ఈ ఆచారముప్రకారము భర్త మతి తప్పినవాడు గాని, నపుంసకుడు గాని అయితే భార్యకు ఒక ఉపపతిని కూర్చవచ్చును. ఈ ఆచార మిప్పుడు పోయినది కాబట్టి అట్టిపురుషులను పెండ్లిచేసుకొన్న భార్యలకు కొంత సదుపాయము కల్పించడము ఆవశ్యక మవుతున్నది. ఎందుచేత నంటే, వా రిప్పుడు నియోగమును అవలంబింప వీలు లేదు. గనుక అట్టివివాహముల బంధము నుండి విడుదల పొందుటకు ఒక్కటే గౌరవమైన మార్గ మున్నది. హిందూధర్మశాస్త్రప్రకారము పై లోపములతో బాధపడుతూ ఉన్న భర్తకున్ను అతని భార్యకున్ను కూడా ఆస్తివిషయములో హక్కులు లేవు. కాబట్టి ఇది మరింత ఆవశ్యక మవుతున్నది. అందుచేత ఈశాసనముప్రకారము హిందూభార్యకు స్పష్టముగా ఆవశ్యకమైన కొంచెము సదుపాయము కలుగగలదని ఆశింపబడుతున్నది. వివాహవిషయమైన హిందూధర్మశాస్త్రములో క్రొత్తమార్పును గలిగించుటకు ఈబిల్లు ఉద్దేశింపబడలేదు. ఈబిల్లు ప్యాసయితే హిందూధర్మశాస్త్రములో మిక్కిలి పూజ్యప్రమాణములైన నారద వసిష్ఠ స్మృతులలోని సనాతనధర్మమును పునరుద్ధరించిన ట్లవుతుంది.

"ఈవిషయమై నారదస్మృతిలో ఇట్లు చెప్పబడి ఉన్నది:—'వరునికి మగతన మున్నదా, లేదా అని

పరీక్ష జరుగవలెను. వాని మగతనమువిషయమై యెట్టి సందేహమున్ను లేనప్పుడే కన్య నివ్వవలెను. సందేహముంటే ఇవ్వకూడదు. రేతస్ఖలన మయ్యేవాడున్ను, రేతోబలము లేనివాడున్ను అయినవాడు భార్యతో కాపురము చేసినా అర్ధసంవత్సరము కనిపెట్టుకొని ఉన్నతరువాత భార్యకు మరియొకభర్తను చేకూర్చవలెను. సంతానముకోసమే స్త్రీలు సృష్టింపబడినారు' భార్య క్షేత్రము, భర్త బీజప్రదాత. బీజము కలవానికి క్షేత్రమును ఇవ్వవలెను. బీజము లేనివాడు క్షేత్రమునకర్హుడు కాడు. కన్యను పెండ్లిచేసుకొన్నతరువాత వరుడు దేశాంతరగతుడయితే ఆకన్య మూడుమూట్లవరకును వేచియుండి మరియొకవరుని వరింపవచ్చును. పిచ్చి, జాతిభ్రష్టత, నపుంసకత్వము, దుఃఖము, బంధువులను విడిచిపెట్టు, దీర్ఘరోగము, అంగవైకల్యము-ఇవి వరునియందలి దోషములు. భర్త నష్టుడు, మృతుడు, సన్యాసి, క్లీబుడు, పతితుడు, అయిన యీ అయిదు విషయములలోను స్త్రీ మరియొకభర్తను పెండ్లిచేసికొనుట ధర్మవిరుద్ధము కాదు.'

"వసిష్ఠస్మృతి:—'నపుంసకుడు, పతితుడు, ఉన్మత్తుడు అయిన భర్తను విడిచిపెట్టి మరియొక మగనిని పెండ్లిచేసికొనిన దానికి పునర్భువు అని పేరు.'

పైబిల్లును విమర్శించడానికి పూర్వము లాప్రకారము హిందూస్త్రీ మరిఒకభర్తను పొందడమునకు ఇప్పుడు గల అవకాశములను విచారించుదాము:—

(౧) విధవావివాహచట్టము:— దీనిప్రకారము భర్త మృతిపొందిన స్త్రీ తిరిగి పెండ్లి చేసుకొనవచ్చును.

(౨) స్పెషల్ మ్యారేజీ ఆక్టు:—దీనిప్రకారము వధువుకు ౧౪ ఏండ్లున్ను, వరునికి ౧౮ ఏండ్లున్ను తక్కువ కాకుండా వయస్సుండవలెను. వారు మైనర్లయితే వారి తలితండ్రుల అనుమతి ఉండవలెను. ఈ చట్టముప్రకారము పెండ్లి చేసుకొన్నవారు ఒకరికొకరు విడాకు లిచ్చుకోనిదే మరిఒకరిని పెండ్లి చేసుకోకూడదు. ఇండియావిడాకులచట్టముప్రకారము వీరు, విడాకు లిచ్చుకోవచ్చును. కాని, ఈ దంపతులు తమ సమిష్టి కుటుంబమునుండి వేరై పోవలెను. బ్రాహ్మోవివాహములు ఈ చట్టముక్రింద చేయబడును.

(౩) కిరస్తానములో చేరిన పెళ్లిరద్దుచట్టము:— దీనిప్రకారము భార్యాభర్తలలో ఎవరైనా కిరస్తానములో కలిసిపోతే, ఆ కలిసిపోయినవారు మాత్రమే కోర్టువారియెదుట విడాకులను కోరవచ్చును. భర్త కిరస్తానములో చేరి విడాకులు కోరకపోతే భార్యాభర్తలకు సంబంధము పోదు. అప్పుడు వారిద్దరున్ను తిరిగి పెండ్లి చేసుకొనడానికి వీలులేదు. భర్త విడాకులు కోరితే భార్యకు తాను చచ్చిపోయినట్లవుతుంది. అప్పుడు భార్య విధవావివాహచట్టముప్రకారము పెండ్లి చేసుకోవచ్చును. భార్యయే కిరస్తానములో కలిసిపోతే, విడాకులను పొంది వేరే పెండ్లి చేసుకోవచ్చును.

(౪) ఇండియా విడాకుల చట్టము:— ఇది హిందువులకు సంబంధించినది కాదు. దీనిప్రకారము ఆలుమగ లెవ్వరైనను ఇతరులతో వ్యభిచరించినా రనే కారణముచేత ముఖ్యముగా విడాకులను కోరవచ్చును.

గౌరుగారు హిందూవివాహము నొక సంస్కారముగ సాగింపవలె ననియే అభిప్రాయపడినట్లు తోస్తుంది. అందుకోసమే వారు నారద వసిష్ఠస్మృతుల నుంచి వాక్యములను ఉద్ధరించి చూపినారు. నేను నారదస్మృతిని చూడలేదు. కాని, వసిష్ఠస్మృతినుంచి వారుదాహరించినది పురాణదృష్టమని చెప్పబడియున్నది. స్మృతికంటె పురాణమునకు ప్రమాణము తక్కువైనట్లుగా ఎంచవలసియున్నది. గౌరుగారు వసిష్ఠ వాక్యములైనా సంపూర్ణముగా ఉద్ధరించి ఉండలేదు. "కౌమారుడైన పతిని విడిచి ఇతరుని చేపట్టిన స్త్రీకి పునర్భువు అని పేరు" అని కూడా వారుదాహరించిన వాక్యమునీడుగనె ఉన్నది. అందుచేత వారివాదముప్రకారము నపుంసకుడు, ఉన్మత్తుడు, మృతుడు అనువారినే కాక, కౌమారుడైన పతినికూడా విడిచి స్త్రీ మరిఒకరిని పెండ్లి చేసికొనవచ్చును అని చెప్పవలసియుంటుంది. పౌనర్భవుడైన కొడుకును

వసిష్ఠునుకూడా దాయాదపుత్రులలో చేర్చలేదు. వసిష్ఠస్మృతిలో ఈపురాణవాక్యము చేర్చబడిఉన్నంత మాత్రమున వసిష్ఠున కట్టివివాహములు సమ్మతమే అని తలంచుట పొరపాటు. పొరపాటు కాదన్నయెడల వసిష్ఠు డుదాహరించిన మరికొన్ని విషయాలుకూడా నేటి ఆచారమునకు విరుద్ధము లైనవైనా శాసనసభ అంగీకరింపవలసి వచ్చును.

గౌరుగారు స్మృతులను ఉదాహరించడము కేవలము తమవాదబలముకోసమైనట్టు స్పష్టముగా కనబడుతుంది. కాని వారి కావచనము లెంతమాత్రమును ఉపయోగపడవు. అయితే, వారు చూపిన (౧) నపుంసకత్వము, (౨) పిచ్చి, (౩) కుష్ఠరోగము కలవారితో యౌవనవతులైన స్త్రీలు కలకాలము పడిఉండవలసినదేనా? వారికి మరి ఒకనిని పెండ్లిచేసికొని గౌరవముగా బ్రతుకవలెనని ఉంటే వారి కేదైనా గతి కల్పింపవద్దా? అనే సద్భావముతోనే వా రీబిల్లును తెచ్చినారని ఊహించవలెను. కాని, వారు చూపినకారణముల స్వభావమును ముందుగా విమర్శింపవలసి ఉన్నది.

## ౧. నపుంసకత్వము

దీనినిగురించి పెండ్లి కాకముందే పరీక్షించవలసి ఉంటుంది. నపుంసకత్వము ఏకారణముచేతనైనా కలుగవచ్చును. మొదట మగతనము కలవారైనా కొన్ని పదార్థములను సేవించుటవలనను, రోగములవలనను, కొన్ని దురభ్యాసములవలనను, అతిభోగములవలనను, ముసలితనమువలనను నపుంసకత్వము కలుగవచ్చును. ఈ కారణములలో కొన్నిటికి మగవాడు బాధ్యుడు కాడు. ఇది గాక అధికకామేచ్ఛ గల స్త్రీకి సాధారణపురుషుడు నపుంసకుడే అవుతాడు. అట్లు గానియెడల కొన్నాళ్లు కాపురము చేసినతరువాతకూడా ఆమెని మగనిని విడిచి లోకములో సాధారణముగా లేచిపోతూ ఉండడము సంభవించదు. నపుంసకత్వ మనేది పెండ్లి కాకపూర్వము ఉండవలసినదో, పెండ్లి అయినతరువాత ఉండవలసినదో గౌరుగారు బిల్లులో వివరించి ఉండలేదు. ౩౫ ఏండ్లవాడు ౧౫ ఏండ్లపిల్లను పెండ్లాడి ౨౦ ఏండ్లు కాపురము చేసి ముసలివాడౌతాడు. అప్పటికి భార్య నిండుయౌవనములో ఉంటుంది. అప్పుడామె విడాకులు పుచ్చుకోవలసినదేనా? ౫౫ ఏండ్లవాడు ౧౫ ఏండ్లపిల్లను పెండ్లి చేసికొని ౭ ఏండ్లు కాపురము చేసి గ్రహచారవశముచేత దీర్ఘరోగి అయి కొన్నాళ్లవరకు భార్యకోరికను తీర్చలేకపోతాడు. అప్పుడు భార్య పెండ్లిని రద్దు చేసుకోనవచ్చునా? నపుంసకత్వానికి మందు లున్నవని వైద్యశాస్త్రములం దున్నది గదా. దానిని కుదుర్చుకోవడానికి కొంత గడువైనా గౌరుగారి బిల్లులో కనబడదు.

## ౨. పిచ్చి

ఇంగ్లీషులో ఈమాటకు గౌరుగారు "ఇంబెసిలిటి" అని వ్రాసినారు. దీనికి నిఘంటువులలో సరియైన నిర్వచనము కనబడదు. మనోరోగములలో "లూనసి (Lunacy), ఈడియసి (Idiocy), ఇంబెసిలిటి (Imbecility), ఫీబిల్ మైండెడ్ నెస్, (Feeblemindedness)" అని నాలుగు అంతరములు గల అవస్థ లున్నవి. వీటికి వరుసగా పెద్దవెఱ్ఱి, జడ్డి, జంక, మనస్తిమితము లేకపోవడము అని వరుసగా తెనుగులో చెప్పవచ్చును. ఇండియాదేశపు ఉన్మత్త శాసనములో లూనేటిక్ (Lunatic) అనగా ఈడియట్ (Idiot) లేక స్థిరచిత్తములేనివాడు అని నిర్వచింపబడినది. స్థిరచిత్తము లేకపోవడములో జంక, పెద్దవెఱ్ఱి, మతితప్పడము అనేవి చేరిఉన్నవనిన్ని, బుద్ధిబలము తక్కువగా ఉండుటమాత్రము స్థిరచిత్తము లేకపోవడముక్రింద రాదనిన్ని వ్యాఖ్యానము చేయబడిఉన్నది. ఒకటి రెండు సందర్భములలో చిత్తభ్రమ కలిగిఉన్నా, సొంత వ్యవహారములను చక్కబెట్టుకొనే శక్తి లేకపోయినా, వెఱ్ఱివాడు కాజాలడు అని హైకోర్టుల తీర్పులు ఉన్నవి. పైదానినిబట్టి 'ఇంబెసైల్' అనుమాటకు సరియైనఅర్థము నిర్ణయించడానికి వీలులేకుండా ఉన్నది. కొన్ని సందర్భాలలో మిక్కిలి తెలివితేటలుగలిగి వ్యవహరించేవారు మరికొన్నిసందర్భాలలో చిత్తభ్రమకు లోనౌతూ ఉండడము కలదు. కొందరికి

కొన్నికొన్ని కాలములలోమాత్రమే పిచ్చెత్తుతూఉంటుంది. కొందరికి అనిష్టవస్తువులను గాని, మనుష్యులను గాని చూడగానే మతిచెడిపోతుంది. ఆవస్తువులును, మనుష్యులును ఎదుట లేకపోతే వారు సాధారణముగానే ఉంటారు. ఈరీతిగా వెఱ్ఱికి వెయ్యివిధాలు అన్నట్లుగా లోకములో కనబడుతూఉన్నది. దీనిలో ఏఅవస్థను ఇంబెసిలిటి (Imbecility) అనవలెనో తెలియదు. వెఱ్ఱి, త్రాగుబోతుతనమువల్లను, గంజాయి త్రాగుటవల్లను, ఆకస్మిక దుర్వార్తాశ్రవణమువల్లను, ఆకస్మిక అనిష్ట ఘోరదృశ్యములవల్లను, అధికజారత్వమువల్లను, సాధారణముగా కలుగుతుందని చెప్పుతారు. ఇది సాధారణముగా వయసు వచ్చినతరువాత జీవితములోని చీకాకులు, శారీరిక, మానసిక కష్టములు, అతి హర్ష, అతి దురభ్యాసములు-వీటిమూలముగ పొడచూపుతూ ఉంటుంది. రోగము లన్నిటిలోను వెఱ్ఱిని గుర్తించడము చాలా కష్టమైనదని ప్రఖ్యాతవైద్యుల అభిప్రాయము. ఇండియాదేశములో పిచ్చివారిసంఖ్య ఎక్కువగా ఉన్నట్లు కనబడదు. లక్ష జనసంఖ్యలో 33 గురు మగవాళ్లును, ౨౨ గురు ఆడవాళ్లును మాత్రము పిచ్చివారుగా ఉన్నట్లు ౧౯౨౧-వ సంవత్సరపు ఇండియా సెన్సస్‌రిపోర్టులో ఉన్నది. ఇండియాకంటే ఎంతో చిన్నదేశమైన ఇంగ్లాండులో ఇక్కడికంటె పదహారురెట్లధికముగా పిచ్చివాండ్లున్నట్లు తెలియవస్తున్నది. ఇదిగాక చెవిటి, మూగ రెండున్ను ఉన్నవారు తప్పకుండా పిచ్చివారై ఉంటారని వైద్యుల అభిప్రాయము. అట్టివారినికూడా భార్య విడిచిపెట్టవచ్చునని బిల్లులో ఏల చేర్చలేదో తెలియదు. పిచ్చిని కుదుర్చుటకు యెన్నో మందులును ఉపాయములును ఉన్నవని వైద్యులవల్లను, అనుభవమువల్లను తెలుసుకోవచ్చును. పిచ్చి సాధారణముగా పురుషులకు ముప్పైఏండ్లవయస్సులోను, స్త్రీలకు అంతకు కొంచెము ముందుగను కలుగుతుందని వైద్యులంటారు. అనుభవములో కూడా అట్లే కనబడుతుంది. అట్టి నడిప్రాయములో అది కుదురుతుందా కుదురదా అని ఆలోచించకుండా ఆడది భర్తను విడిచిపెట్టుటకు అవకాశము కల్పించడము తప్పైనట్లు తోస్తుంది.

## 3. కుష్ఠరోగము

ఇది దేహ-అపరిశుభ్రతవల్లను, ఎన్నడున్ను స్నానము చేయకపోవుటవల్లను కలుగుతుందని వైద్యుల అభిప్రాయము. ఇది ఉత్తమనాగరక వర్ణములవారిలో సాధారణముగా లేదనిన్ని, మిక్కిలి తక్కువజాతులవారిలోనే ఉన్నదనిన్నీ, జనాభాలెక్కలవల్ల తెలియవస్తుంది. ఇది వంశపారంపర్యముగా వచ్చేరోగము కాదు. రెండేండ్లలోపు పిల్లలకు ఈరోగము రాదు. మొదటిలోనే జాగ్రత్తపడితే ఇది వ్యాపించదు సరేగదా, కుదరడానికికూడా అవకాశ మున్నది. మొదటిలో సిగ్గుచేత దాచుకొని ఈరోగము ముదిరినతరువాత వైద్యులవద్దకు సాధారణముగా వెళ్లుతూఉంటారు. ఈ రోగమునకు క్రొత్తగా ఇంగ్లీషువైద్యులు మందులను కనిపెట్టినారు. "చౌల్ మోగ్రా" అనే ఓషధియొక్క అరఖును, మంచిగంధపునూనె మొదలైన నూనెలను దేహములోనికి ఇంజెక్షన్ చేయుటవల్ల ఈరోగము నిష్పడు బాగుచేస్తున్నారు. కలకత్తాలో ఉష్ణదేశ వైద్యవిద్యాశాల (School of Tropical Medicine) యందు డాక్టరు మ్యూరుగారు ఈరోగమువిషయమై పరిశోధనములు చేసినారు. ఏ అవస్థలోఉన్న కుష్ఠరోగమైనా చాలవరకు నయమవుతుందనిన్నీ, ఆతరువాత ఇతర చికిత్సలవల్ల మిగిలినదానిని నిశ్శేషముగా మాన్పవచ్చుననిన్ని వారి అభిప్రాయము. కలకత్తాలో జరిగిన పరిశోధనలవల్ల కుష్ఠరోగచికిత్సలో చాలా అభివృద్ధి కలిగినదని ఈపరిశోధన లారంభించిన సర్ లియొనార్డ్ రోజర్స్‌గారుకూడా చెప్పినారు. ఆయుర్వేదములో కూడా సూర్యనమస్కారములవల్లను, సూర్యరశ్మి చికిత్సవల్లను, కొన్నిమందులవల్లను ఈరోగమును కుదుర్చవచ్చునని చెప్పబడిఉన్నది.

గౌరుగారు కుష్ఠరోగము నుదాహరించి, అటువంటిదే అయిన కొఱుకు లేక ఫరంగిరోగమును ఏల విడిచినారో తెలియదు. ఇది వంశపారంపర్యముగా సంక్రమించేరోగము. అది ఉన్నవానిని విడిచిపెట్టిన

భార్యను తిరిగీ భర్తతో కాపురము చేయవలసినదని నిర్బంధించడానికి కోర్టుల కధికారము లేదు.

గౌరుగారు చూపిన మూడు కారణములలోను నపుంసకత్వముయొక్క వ్యాప్తిని గురించి తెలుసుకొనడానికి జనాభా లెక్కలలో ఆధారము కనబడదు కాని, (౧) పిచ్చి, (౨) కుష్ఠరోగము, (౩) చెవిటి-మూగతనము,(౪) గ్రుడ్డితనము గలవారి సంఖ్య లివ్వబడి ఉన్నవి. ఇవి కలిగినవారి అందరి మొత్తమున్నూ మొత్తము జనసంఖ్యలో నెన్నదగినదిగా లేదు. ఈ సంఖ్యకూడా నానాటికిన్ని తగ్గుతూఉన్నట్లు జనాభా లెక్కలవల్ల తెలుస్తున్నది. లక్షమందికి ౧౮౮౧-వ సంవత్సరములో ౪౦౭ మందిన్ని, ౧౮౯౧ లో ౩౧౫ మందిన్ని, ౧౯౦౧ లో ౨౯౮ మందిన్ని, ౧౯౧౧లో ౨౬౪ మందిన్ని, ౧౯౨౧లో ౨౪౨ మందిన్ని ఉన్నట్లు సెన్ససురిపోర్టులో తెలుపబడిఉన్నది.

కొంతకాలము క్రిందటిమందిన్ని ఢిల్లీ శాసనసభలోను, ఇతర ప్రాంతీయశాసనసభలలోను హిందూ సంఘమునకు సంబంధించిన కొన్ని శాసనములు బయలుదేరినవి. ఆయా సంఘములకు సంబంధించిన సంస్కరణములను గురించి ఆసంఘమునకు చెందిన సభ్యులే తమ సంఘమువారి ఆదేశానుసారముగా వోట్లిచ్చి సంఘశాసనములను చేస్తే బాగుండేది కాని, ఇట్టి విషయములలో ఆయా సంఘములవారి అభిప్రాయములను కనుగొనడము లేదు సరే గదా హిందూసంఘసభ్యులే కాక యూరపియనులు, క్రైస్తవులు, తురకలు, పారసీలు, అన్నిసంఘములకు చెందిన సభ్యులున్ను వోట్లిస్తున్నారు. పట్టణములలో పాశ్చాత్యాచారముల నవలంబించిన, నోరు గలిగిన కొలది మంది ఆనుకూల్యముకొరకు ఈ శాసనములు చేయబడుతున్నవి. ఈశాసనసభలలోను, పట్టణములలోను ఏమి జరుగుతున్నదో నూటికి తొంభైమందిగా ఉన్న పల్లెలవారికి తెలియనే తెలియదు. ఈ శాసనములు, శారదాచట్టమువంటివి, హిందూసంఘాభివృద్ధికి తోడ్పడవచ్చును. కొన్ని అనర్థహేతువులు కావచ్చును. అందుచేత ఈశాసనముగురించి దైన దేశస్థులు బాగుగా ఆలోచించనిదీ దానిని ఆమోదించడము మంచిది కాదు.

గౌరుగారు తెచ్చిన విడాకులబిల్లు పూర్వాచార పరాయణులను గాని, నవీనాచారప్రియులను గాని సంతోషపరుపజాలదు. ఈ ఇరుపక్షములవారికిని బిల్లుపై గల ఆక్షేపణలను ఈ క్రింద సంగ్రహముగా చూపుతున్నాను.—

౧. అనాదినుంచిన్నీ ధర్మశాస్త్ర విరుద్ధముగానున్న విడాకులమాత్రమును ఈబిల్లు క్రొత్తగా ప్రవేశపెట్టుతున్నది.

౨. వసిష్ఠ స్మృతిలో కేవలపురాణవృత్తములని తెలుపబడిన వాక్యముల నీబిల్లు ఉదాహరించుచున్నది.

౩. కామేచ్ఛను తృప్తిపరుచుటకును, ఆ స్త్రీలో హక్కు నిచ్చుటకును సంకల్పించి విడాకులవిషయమున మతధర్మములు ప్రధానమైనట్లు ఈబిల్లు బయటికి కనపరుస్తున్నది.

౪. బిల్లులోని కారణములకుగాను భార్యలు భర్తలను విడిచిపెట్టవచ్చునని చెప్పుతున్నది గాని, అవే కారణములవల్ల, అనగా భార్య గొడ్రాలు, పిచ్చిది, కుష్ఠరోగపుది అయినయెడల భర్త ఆమెను విడిచిపెట్టవచ్చునని అనుమతించలేదు.

౫. ఇండియాదేశపు విడాకులచట్టములో కూడా లేనికారణములను ఈబిల్లు చూపుతున్నది.

౬. ఇండియాదేశపు విడాకులచట్టములో చూపబడిన వ్యభిచారాదిముఖ్యకారణములను ఈబిల్లు విడిచిపెట్టుతున్నది.

౭. ప్రపంచములోని మరి యేనాగరికదేశములోను బిల్లులోని కారణములవల్ల విడాకు లిచ్చుటకు అవకాశము లేదు.

౮. పిచ్చితో సమానమైన చెవిటి-మూగతనము గాని, వంశపారంపర్యముగ సంక్రమించే క్షయరోగము, కొరుకురోగములవంటివి గాని బిల్లులో చెప్పబడి ఉండలేదు.

౯. బిల్లులో చెప్పబడిన రోగములు మందులతో కుదరనివి కావు.

౧౦. పెండ్లి అయినతరువాత ఎంతకాలమున కైనా విడాకు లివ్వవచ్చునని యీబిల్లు చెప్పుచున్నది. పిల్లలను కనినతరువాత కూడా ఈబిల్లుప్రకారము ఆడది మగనిని విడిచిపెట్టవచ్చును.

౧౧. వారసవసిష్ఠులైనా కొన్ని సందర్భాలలో కొంతకాలము నిరీక్షింపవలెనని తెలిపినారు గాని, గౌరుగారు అదికూడా చెప్పలేదు.

౧౨. నపుంసకత్వము, పిచ్చి అనేవి అవి కలిగిన కారణములవల్లను, వాటిఅంతరమువల్లను, అవి ఉండే కాలమువల్లను భేదిస్తూఉంటవి. ఈవిషయమును గౌరు గారు గమనించలేదు.

౧౩. మైత్తని, పనికిమాలిన మగనికి ప్రతీ ఆడదిన్ని నపుంసకత్వమును, తిక్కను ఆరోపిస్తానే ఉంటుంది.

౧౪. భార్యను పోషించ లేనప్పుడు గాని, ఆమెను క్రూరముగా హింసిస్తూ ఉన్నప్పుడు గాని వివాహవిచ్ఛేదము కావచ్చునని బిల్లు చెప్పలేదు.

౧౫. నవీనసాంఘికపరిస్థితులవల్ల స్త్రీలకు ఏర్పడిన యెన్నో ఇబ్బందులను ఈబిల్లు తొలగింపలేదు.

౧౬. గౌరుగా రుదాహరించిన రోగములు ఇండియాలో నానాటికిన్ని తగ్గుతున్నవని ౧౯౨౧ సంవత్సరపు సెన్సుసురిపోర్టులో వ్రాయబడి ఉన్నది.

౧౭. ఆచారముప్రకారము విడాకులు అమలులో ఉన్న తక్కువజాతులలోకూడా ఈవిధానము నానాటికిన్ని గర్హింపబడుతూ ఉన్నది.

౧౮. విడాకుల కనుకూలముగా పాశ్చాత్యదేశములలో ఇవ్వబడిన అవకాశములవల్ల వివాహవిచ్ఛేదములు మితిమీరిపోతున్నవి. ౧౯౧౧-వ సంవత్సరమునకున్ను, ౧౯౧౮-వ సంవత్సరమునకున్ను ఈవిచ్ఛేదములసంఖ్య ఇంగ్లాండులో రెండింతలైనది.

౧౯. వివాహవిచ్ఛేదములవల్లను, పునర్వివాహములవల్లను కలుగబోయే జనసంఖ్యాభివృద్ధికిన్ని, ఇండియాదేశపు ఆర్థికస్థితికిన్ని గల సంబంధమును ఈబిల్లు దృష్టిలో ఉంచుకొన్నట్టు కనబడదు.

౨౦. ఈసాంఘికచట్టము ఒక్క హిందూసంఘమునకే ఏల చెందవలెనో, ఇతరమతములవారి కేల చెందకూడదో తెలియదు.

౨౧. అన్నిమతములకు సంబంధించిన సభ్యులతో నిండిఉన్న, కేవలనవనాగరికసభ్యులతో కూడిన, ఢిల్లీశాసనసభలో దీనిని ప్రవేశపెట్టుట ఉచితము కాదు.

౨౨. గౌరుగారి ఉద్దేశములు ఈబిల్లుమూలముగా కాక మరియొకవిధముగా, ఇంతకంటె బాగుగా నెరవేరుట కవకాశ మున్నది. ఇప్పటికి పెండ్లిచేసికొన్నవారు తమవివాహములను స్పెషల్ మ్యారేజి ఆక్టుక్రింద రిజిష్టరు చేయించుకొనుటకు అవకాశమును కల్పించి ఆఆక్టునకు సంబంధించిన ఇండియన్ డైవోర్సు ఆక్టులో గౌరుగారి బిల్లులో ఉదాహరింపబడిన కారణములనే కాక, ఇంకా మరికొన్ని ముఖ్యకారణములను కూడా చేర్చవచ్చును. ఇందువల్ల పూర్వాచారపరాయణులకు నొప్పి కలుగదు. హిందువులలో కొందరికైనా ఏకపత్నీవ్రతము విధిగా కుదురుతుంది. విడాకు లిచ్చుకొనుటకు భార్యాభర్తలకు సమానమైన హక్కు యేర్పడుతుంది. ఇష్టముగా కాపురము చేయలేని ఆలుమగలు విడిపోవుటకు కావలసినన్ని అవకాశములు లభిస్తవి.

---



౧. స్కంద పుష్కరిణి (కార్వేటినగరము)



౨. చంద్రభాగానదీస్నాతు లగు శ్రీ విఠోబా దర్శనార్థులు జి. ఎస్. ఎ.

# హిందూముస్లిము సారూప్యములు

బుర్రా శేషగిరిరావుగారు
(భారతీతీర్థప్రధాని)

౨

## బిస్మిల్లాఉత్సవము

మగశిశువునకు నాలుగుసంవత్సరముల నాలుగు మాసముల నాలుగుదివసములు కాగా ముస్లిములలో బిస్మిల్లాఉత్సవమని చేయుదురు. బిస్మిల్లాఉత్సవ మనగా బిడ్డచేత దేవునిపేరుచెప్పించుట. ఇది హిందువులలో అక్షరాభ్యాస ఉత్సవమువంటిది. ఈ ఉత్సవము మనలో ఉపనయనమువలె నాలుగురోజులలో మూడు రోజులలో చేయుదురు. బాలకుని గడపదాటకుండా దీక్షలో ప్రత్యేకముగా ఒకగదిలో ఉంతురు. ఈగది శృంగారింతురు. ఇందులో సింహాసనమువలె యేర్పరచి దానిపైని బాలకుని కూర్చుండబెట్టుచుందురు. ఉదయమును సాయంకాలమును మంగళవాద్యములతో నలుగు పెట్టుదురు. ఈనలుగును "సోహాగిన్" స్త్రీలే పెట్టవలెను. "సోహాగిన్" అనునది "సౌభాగ్యినీ" అను సంస్కృతపదభవము. నలుగుపెట్టి పసుపురంగు (మంగళ సూచకము) బట్టలుకట్టుదురు. ఇదియెంతయు హిందూ సంప్రదాయముతో సరిపోవుచున్నది. ఉపనయనములో దీక్షావస్త్రములు పసుపురంగువే.

బిస్మిల్లాదినమున బంధుమిత్రాదులు సాయంకాలము చేరుదురు. బాలకునికి మధ్యాహ్నము నలుగంతా పోయేటట్టు స్నానముచేయించి పసుపురంగుదీక్షా వస్త్రములు మార్పించి ఎర్రరంగువో తెల్లరంగువో బట్టలు కట్టింతురు. ఎర్రధారముతో కట్టినబంగారు, వెండి బిళ్లలు మెడలో వేయుదురు. పుష్పములతో అలంకరింతురు. తరువాత అతనిని తమయింటిగురువు యెదుటనో మరియే "ముషేకు" యెదుటనో కూర్చుండబెట్టుదురు. ఆగురువు తనయెదుట నుంచబడిన వెండి లేక బంగారుపళ్లెరమును, అందలిఫలమును, మిఠాయిని, తాంబూలమును, బట్టలను ఆశీర్వదించి, గంధములోనో, పసపులోనో ముంచినకలములో ఆపళ్లెములో ముస్లిగులమంత్రరాజమును (బిస్మిల్లా-హి-ర్రహమాన్-ని-ర్రహీమ్) వ్రాసి యా వ్రాతను బాలకునిచేత నాకించును. మరికొందరు ఒక యెర్రకాగితముమీద ఖురాను మొదటిఅధ్యాయమును వ్రాసి బిడ్డచేతికిచ్చి తాము చదువుచు చదివింతురు. ఇది యైనతరువాత గురువును ఫలపుష్పచందనతాంబూలాంబరాదులచే సత్కరింతురు. తరువాత బిడ్డచేత పెద్దలకు మ్రొక్కించి యాశీర్వచనము చేయింతురు. మన హిందువులలో ఈఆచారభాగమంతా ఇట్లే జరుగును. మనవారు బియ్యములో పసపుకొమ్ముతో శివమంత్రమో నారాయణమంత్రమో వ్రాయించి అక్షరములవరుసను స్వరము లేకుండా చెప్పింతురు. ఆ బియ్యమును, బహుమతులను గురువున కిచ్చివేయుదురు.

ఇట్టిగురువువద్ద నేర్చుకొను ప్రతిగ్రంథమును పూర్తి యగునప్పుడెల్లను గురువుకు ప్రత్యేకముసత్కారము జరుపుటకూడా కలదు. ఇంతేగాక ప్రతివారును తమ యింట యే శుభకార్యముచేసుకొన్నను విద్యాగురువుకు సత్కారములుచేయుట విధియైయున్నది. ఎందుకనగా జనకతండ్రితో సమముగా విద్యాగురువు, (పిల్లనిచ్చిన) మామగారు, మంత్రోపదేశకుడును గౌరవింపదగిన వారట. అయిదుగురు పితృసమానులు అని వీరితో అన్నను కూడా కలిపి మన హిందువులు గౌరవించుచున్నారు.

మరియొకచిత్రము, ఖురానుచదువుట పూర్తియైన తరువాత ఒకరోజున బంధుమిత్రాదులను పిలిచి ఉత్సవముచేసి పిల్లవానిచేత ఖురానుతీయించి "పరమేశ్వరుని యేకత్వము తెలుపు" సురాలను చదివించి గురువుకు నూతన వస్త్రములు, ఫలపుష్పములు, తాంబూలదక్షిణలను ఇచ్చి గౌరవింతురు. అప్పుడువిద్యాగురువు పిల్లవానిని దీవించి ఇట్లనియాశీర్వచనము చెప్పును—

"నేను నీకు ఖురానుబోధించుటలో నాకు కలిగిన శ్రమనంతయు క్షమించుచున్నాను. ఇప్పుడీ సభలో వీరిసమక్షములో త్రికరణశుద్ధిగా నీకు నే నిచ్చిన విద్యనంతయు ముదితముగా దానము చేయుచున్నాను."

మనపురాతనపు ఆర్యసంప్రదాయములో విద్యపూర్తి యయినతరువాత శిష్యుడు గురువుకోరిన దక్షిణయిచ్చి ఋణవిముక్తుడు కావలెనని యున్నది. అప్పటి ఋణవిముక్తిమంత్రమిది. ఆర్యసంఘములలోకూడా ఆసంప్రదాయము ఖిలమైపోయినది. అట్లు ఖిలముకాకుండా ఉన్నప్పుడు వీరిలోనుండి చీలిపోయిన ఆర్యసంఘమువారగు ముస్లిములలో నిది యనుశ్రుతముగా నిలిచిపోయినది. ఇట్టి యాచారమును బట్టియు, విద్యాగురువును తండ్రివలె గౌరవింపవలెనను నియమమునుబట్టియు, "బిస్మిల్లా"యను అక్షరాభ్యాసవిధానములో జరుగు తంతును బట్టియు, నందలి మంత్రప్రాధాన్యమును బట్టియుకూడా జీవితములో ముఖ్యమగు విద్యాభ్యాససంస్కార నియమములలో హిందూముస్లిముల కేకత్వమే గాని భిన్నత్వ మొకింతయు లేదని తేలుచున్నది.

3

## రజస్వలావిధి

రజస్వలయైన స్త్రీ యస్పృశ్యురాలని యార్య సంప్రదాయము. ఇట్లే ముస్లిములలోను నియమములు గలవు. స్త్రీ "తలమైలయైన" దనియు, స్త్రీకి "స్నాన కాలము" వచ్చినదనియు, "మైల" అయినదనియు చెప్పిన రోజుల నామె రజస్వలయైనదని సంకేతము. అనగా "రజస్వల"యైన స్త్రీ స్నానము చేసినగాని యస్పృశ్యురాలని యర్థము. నెలవరబడి "రజోదర్శనకాలము" వచ్చినప్పుడు "బేనమాజ్ ఆనా" (నమాజుకు వీలు లేకుండాఅగుట) అని కూడాఅందురు. అంటే మశీదునియుక్త "ప్రార్థన"కు పనికి రాదని యర్థము. ఈనియమము ఎంత శుచిశుభ్రములపై నాధారపడియున్నదో చూడుడు. బహిష్ఠయైన స్త్రీ వేద మంత్రములను వినకూడదందురు. ముస్లిములలోను "బే నమాజు" అయితే అదే అర్థము. దీనినిబట్టికూడా ముస్లిములు ఆర్యసంప్రదాయములోనివారే అయియుందురని సులభముగా ఊహించవచ్చును.

స్త్రీకి ప్రథమరజోదర్శనమయినపుడు ఏడుదినములు ముస్లిములలో పండుగచేయుదురు. స్త్రీని ప్రత్యేకపుగదిలో నుంతురు. ఆగది దాటనివ్వరు. ఇంటిలో ఏపనిలోనికిని రానివ్వరు. ఆమెకు ఏడవనాడు స్నానము. ఆ రోజున గృహస్థులు తమబిడ్డకును, అల్లునికిని నూతనవస్త్రాభరణములిచ్చి ఒక్కచోట కూర్చుండబెట్టి భుజింపజేసి తరువాత సమావేశమునకు పంపుదురు. ఆర్యసంప్రదాయములో గర్భాధానవిధానమువంటిదే యిది. ముస్లిములలో సాధారణముగా 18 సం॥ దాటకుండా ఆడుబిడ్డలకు వివాహము విధిగా చేయుదురు. ఇది మనుస్మృతియందలి "త్రీణివర్షా ణ్యుదీక్షేత కన్యాఋతుమతీసతీ" యనునియమానుసారముగనే యున్నది.

బిడ్డలకు మైనారిటీ దాటకముందు వారుచేయు చెడుపనులకుగాని, మంచిపనులకుగాని తల్లిదండ్రులే బాధ్యులని ముస్లిములలో కలదు. మైనారిటీ దాటినదనుటకు ముస్లిములలో స్త్రీకి రజోదర్శనమువలెనే పురుషునికి "ప్రథమశుక్లస్ఖలనము" చిహ్నమట. పురుషుడు కూడా అట్టిస్థితిలో మయిలపడును. ఇందుకు స్నానముతో శుద్ధి.

ముస్లిములలో హిందువులలోవలెనే మయిలకు స్నానముతో శుద్ధి. స్నానము సంస్కారము. స్నానము ప్రారంభించునపుడు మంత్రము చెప్పవలెను. "ఆపః పునంతు" అన్నట్లు, "నేను ప్రార్థనకొరకును, లోపలి మాలిన్యముపోవుటకును స్నానముచేయుచున్నాను" అని ఈఅరబ్బు భాషామంత్రమున కర్థము. తరువాత నీళ్లు మూడుమారులు పుక్కిలించవలెను, 'ఓంభూః, ఓంభువః, ఓంసువః' అన్నట్లు. తరువాత యథేచ్ఛగా నీళ్లుపోసుకొనుటట.

## ౪

## ప్రార్థనవిధి

ముస్లీములలో ప్రార్థన (నమాజ్) విధాయకమై యున్నది. నామాజ్ అనగా "నమస్సు" అనుసంస్కృత పదము. ఇది చాలా పురాతనమైనమాట. ఆర్యసంప్రదాయములో నిదేయని వేరే చెప్పనక్కరలేదు. వీరిలో అయిదునమస్సులు కలవు. ఆర్యసంప్రదాయములో మూడునమస్సులు (సంధ్యావందనములు) కలవు. సంధ్యా నమస్సులకు రెండుసంప్రదాయములలోను కాలనియమములో భేదము లేదు. మిగిలిన రెండును ఆర్యసంప్రదాయములో ఐచ్ఛికములు. శౌచముచేసుకొనిదే "నమస్సు" చేయగూడదు. ఇది కేవలము ఆర్యసంప్రదాయము. పూర్తిగా స్నానముచేయుకపోయినప్పుడు నీళ్లు పుక్కిలించిపారబోసి కాళ్లు, చేతులు, ముఖము మూడేసి పర్యాయములు కడుగుకొనవలెను. ఆమిగిలిననీళ్లు త్రాగవలెను. ఇది ఆర్యసంప్రదాయపు శౌచవిధియే. ఆఖరున నీళ్లు త్రాగుట "ఆచమన" విధి.

---



కఱ్ఱసాము

శ్రీ వ్యాయామమందిరము, దాదర్, బొంబాయి. (కే. యస్. ఎ.)

# ప్రాథమిక విద్య

## ఆస్తిక ప్రబోధము

## (Religious Instruction)

టి. శివశంకరంగారు

పల్లెటూరిబళ్లయందు బాలురకు ఈశ్వరవిషయము బోధించుటయవసరమా? అట్లవసరమగు పట్ల బోధించుపద్ధతియేది? అనునంశములు ఇప్పటి విద్యాభిమానులకు కొంతకాలముగ లంపటతను కలిగించుచున్నది.

ప్రాతనాటి తెలుగుబళ్ళయందు భాగవతములోని గజేంద్రమోక్షమో, ప్రహ్లాదచరిత్రములోని పద్యముల కొన్నింటినో బాలురచేత చదివించి పనియారంభించుట వాడుకగా నుండెడిది. "సరస్వతిపూజ"కని బడియొజ్జయు బాలురును చేరి యారాధనల సల్పుచుండెడివారు.

అరవదేశపుబళ్లలోను 'ఆత్తిచ్చుడి', 'వినాయగ రఘువల్' అనుచిన్న పుస్తకములు దినపాఠములనారంభించుటకుముందు నేటికిని అక్కడక్కడ చదివించెదరు. ఇట్టిపద్ధతులే మహారాష్ట్ర, వంగ, పాంచాలదేశముల పల్లెటూరిభాగములందు ఆచరణయందుండవచ్చును.

ఇట్టిశిక్షణముచే పసిపిల్లలను అప్పుడపుడే ఈశ్వరోన్ముఖులుగ చేయుటకు చాలకపోయినను యీ సంస్కారముచేవారు పెద్దపెరిగినపుడు వారియాస్తిక స్ఫురణకు కుదురై, మనస్సును మెత్తచేసి భగవద్విచారములయెడల దానికి చొరవను కలిగించుచుండెననువరకు ప్రయోజనకారియగుటకు సంశయముండదు. ఇయ్యది అల్పమైనలాభముకాదు.

ఈకాలమున జీవితశాఖలన్నిటియందును భావములతివేగముగ మారుచున్నవి. బోధనాపద్ధతులయందును నట్లే. మనుష్యుని మెదడు విజ్ఞానసంభారమునకు పేటిక మాత్రము కాదు. నూతనజ్ఞానాంశముల శోధించి యామూలమున ప్రతుకునే వికాసమందచేయుటకు సూక్ష్మయంత్రము. ఈతత్త్వము మనపాతనాటిపెద్దలకు కొత్తదై యుండలేదు. ఇందుకై శిక్షణమే వేరై యుండినది. 'భృగువల్లి'యందు గురుశిష్యసంభాషణము దీనికి కాంతిమంతమైన దృష్టాంతము.

ఈవైఖరియే విజ్ఞానవ్యాప్తికి సరియైయుండవలెననుట యిప్పటివిద్యాధికులకు మెలమెల్లగ స్ఫురించుచున్నయది. ఈకాలపుబళ్ళయందు బోధనాక్రమము ఆదర్శమందు ఉదారమైయుండినను, ఆచరణయందు మిక్కిలిసంకుచితమై విద్యార్థులను సంవత్సరాంతపరీక్షలయందు నుత్తీర్ణులచేయవలెననుటకన్న వేరుగురిలేకయుంటుచుండుట శోచనీయము.

ఈకుందునుపోనాడి సవరించవలెనన్న ప్రారంభతరగతినుండి తరతమస్థితులతో కళాశాలలవరకు విద్యార్థులకాస్తికబోధ (Religious Instruction) కవకాశము కల్గించుట యత్యావశ్యకము. ఇట్టియాస్తికబోధలో పల్లెటూరి యుపాధ్యాయుడు యెట్లు నిలుదలవలెననుటను కొంతవరకు సూచించుటయే యీవ్యాసమునకు గురి.

రుచులలో పిల్లలనాల్కకు తీపియెట్లో, నవరసములలో పసిపిల్లల మెదడునకు ఆశ్చర్యరసమట్లు (Sense of wonder). ఈయాశ్చర్యరసమును బిడ్డల మనస్సునందు పుట్టించి పోషించుట యుపాధ్యాయుని పని. ఇయ్యదియే మనపూర్వీకు లవలంబించిన పద్ధతిగ తోచుచున్నది.

మనము అనుదినము చూచుజగత్తు గొప్పపుస్తకమునకొందము. దీని పుటలెప్పుడును తెరవబడియేయున్నవి. కావలసినకనులు మూసికొనినను, లేక మనస్సు చింతాక్రాంతమై యుండినను, మనము జగత్తును చదువుచుండుట తప్పదు. ఇందలి వ్రాతకక్షరము లెవ్వి? పదములెక్కడ? వాక్యములెట్టివి? తెలివి యెద్ది? తుదకిందలి

ప్రాత బోధించు పరమార్థ మేమి? ఈప్రశ్నల కొంత వఱకు పరిశీలింతము.

మనపెద్దలు ఒక్కొక్క మనుష్యునికిని నియమించిన షోడశకర్మములలో బాల్యదశయందు కావించునట్టి అక్షరాభ్యాసము ముఖ్యమైనట్టిది. ఇప్పటికిని అక్కడక్కడ పల్లెటూళ్ళ నివసించు ప్రాతనాటి పెద్దలు యీ యుత్సవమును సంభ్రమముతో జరిగింతురు. 'ఓంనమశ్శివాయ' అనుపంచాక్షరి పేరిటి మంత్రమును గురుముఖమున బాలునికుపదేశింపజేయుటకు ఇది పవిత్రమైన సమయము. దీనినే అవాడు ఇసుకవేయించి పూజాపురస్కారములతో ఒజ్జయనువాడు బాలుని బొటనవ్రేలునుపట్టి "ఓం, న, మః, శివాయ" అని వ్రాయించుట. ఓంనమశ్శివయను నీరైదక్షరములు, నేల, నీరు, అగ్ని, గాలి, ఆకాశములను పంచభూతములకు సంకేతమనుట వారిభావము.

జగత్తను పుస్తకపువ్రాతకు పదములుపదార్థములే. అక్షరముల గుణించినపుడు పుస్తకపువ్రాతయందు పదము లెట్లగునో పంచభూతములను మేళవించుకొలది జగత్తున పదార్థములగును. పదముల సంయోజనముచే వాక్యము లెట్లుద్భవించునో, అట్లేజగత్తున పదార్థవిన్యాసము భావములనే స్ఫురింపజేయును. వాక్యములకు భావము లెట్లు పరిణామములో జగత్పుస్తకమున భావముల కానందమే ఫలము.

'వర్షము' అనుమాటక్షరములుచేర్చి కాకితముపై వ్రాసినపుడు దానిని పదమందురు. జగత్పుస్తకమున పంచభూతములలో నీరు, అగ్ని, ఆకాశము అనువస్తువులచే నైనపదార్థమే వర్షమగును. "వర్షము" అనుమాటకు 'కురియును' అనుక్రియను చేర్చినపుడు అది వాక్యమై వాన కురియుటచే త్వగింద్రియమునకు చల్లదనమును సోకించుటయేగాక దానిధారలు నేత్రపర్వములై మదికి ముదమావహించును. ఇట్లే వ్రాతపుస్తకముల నేదిభావమాత్రమో, జగత్పుస్తకమందు ఇయ్యది యనుభవమై పరిఢవిల్లును.

ఇట్లు విద్యాక్రమమునందు ఆస్తికప్రబోధము మేళవించుకొలది విద్యార్థుల దృష్టి విపులమై, ఆశ్చర్యరసము నుద్భవింపజేయును. అదియే పదార్థరస పానమునకు మూలము. దీనికి దృష్టాంతముగ భాగవతమునందు,

సీ. "విశ్వమోహనమైన వేణునినాదంబు
సరసగంభీర గర్జనముగాగ,
మహనీయ నిర్మలమందహాస ద్యుతి
లలిత సౌదామనీ లతికగాగ,
దలచుట్టు బాగుగదవరు పింఛపుదండ
శైలభేదన శరాసనముగాగ,

.................................

తే. జూడ నేతెంచు గోపాలజనమునీంద్ర,
చాతకంబుల దురవస్థ జక్క జేసి,
కృష్ణమేఘుంబు బహుతరకీర్తి నొప్పె,
విమలబృందావనాకాశ వీథియందు."

—దశమస్కంధము, ప. 761 పూ. భా.

ప్రహ్లాదుడు సర్వకాలపు విద్యార్థులకును మేటి. ఆనందానుభవమే సరిగ వివేకమును వెతకి చేర్చినవాడు. ఆమహాత్ము డవలంబించిన విద్యాక్రమమును సూచించునట్టి పద్యము సప్తమస్కంధమున మరియొకటి యున్నది. దానినివ్రాసి అందలిపరమార్థమును గ్రహించిచూతము. ఆపద్యమిది:—

శా. "పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్
భాషించుచున్, హాసలీ
లానిద్రాదులు సేయుచుం, దిరుగుచున్
లక్షించుచున్, సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ
చింతామృతాస్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుడే
తద్విశ్వమున్ భూవరా."

—123 ప.

"పానీయంబుల ద్రావుచున్"—

పానీయములలో చనుబాలు మొదలు టెంకాయ నీరువరకును వివిధములై యున్నవి. చనుబాలొకదానిని గూర్చి విచారింతము. ఈవిచారమున స్ఫురించు సంశయములు తరతమస్థితులయందు పల్లెటూరిబడి మొదటితరగతినుండి

యొక విద్యార్థి కళాశాలమెట్టెక్కువరకు గమనించి శోధించి యచ్చెరు వొందవలసిన భాగ మెంతయో యున్నది. చనుబాలు తేలికరైయుండుట మొదటిది. లేతకడుపుకు బరువు కలుగచేయదు. దానియందు కొంచెము ఉప్పురుచి కలదు. ఇది బిడ్డల జీర్ణమునకు సహకారి. దీనియందు చక్కెరయు కొంచెము కలదు. దీనిచే నాలుకకు రుచికలుగును. చనుకుడుచునపుడు పాలధారయందు వెచ్చదన ముండుట మరియొకచిత్రము. శరీరమునం దొక్కొక్క భాగమునకు అనగా, ఎముక, కండ, తోలు, నరములకు బిగువునిచ్చు పదార్థమును కల్గియుండుట మరొకటి. తల్లియొక్క ప్రేమ, దయాదాక్షిణ్యములవంటిసద్భావములను పిల్లలకుచిన్నవాడేయెక్కించుటకు చనుబాలమహానమహట విద్యార్థులనేకు లెరుగనిది. శిశువు పుట్టుటకుముందే యాశ్రేష్ఠమైన యాహారము తల్లియందు సిద్ధమైయుండుట యీచిత్రసరణికి మకుటమనవొప్పును.

బడియందు నేర్పు చదువుపద్ధతిలో చదువు వ్రాత భాగము నటుంచి, చనుబాలనుగూర్చి చిన్నచిన్న ప్రశ్నలచే వారియందలి యాశ్చర్యరసముల మబికించుట యాస్తిక ప్రబోధమునకు మొదటిమెట్టు.

నీరు మరియొకపానీయము. నీనికిమూలము వాన. వానకురియునపుడు ఒజ్జయగువాడు బడిపిల్లల బయటికి తెచ్చి వానను గూర్చి చిన్నమాటలతో సంభాషించుట మిక్కిలి ప్రయోజనకారి. సముద్రపునీరు సూర్యుని యెండకు ఆవిరియై ఆకాశమున మేఘములలో చేరి వానయగునను టొక్కొక్క బడిపిల్లవాడును, బాలికయు నేర్వవలసినట్టిది. అట్టిసమయమున సూర్యుడు, సముద్రము, మేఘములు, ఆవిరి మున్నగు సదారవస్తువుల గూర్చి ప్రశంసించి చెప్పుటచే ఆశ్చర్యరసమును చిన్న మనస్సులయందు పుట్టింపవలెను. బడియొజ్జ పిల్లలతో యిట్టివిషయములగూర్చి మాట్లాడుటకు ఈదిగువసంభాషణ మచ్చుగ గైకొనవచ్చును.—

ఒజ్జ:—నేడు నీరు త్రాగితివా ?

విద్యార్థి:—త్రాగితిని.

ఒ:—నీ రెక్కడిది ?

వి:—మాయమ్మ చేదుకొనివచ్చెను.

ఒ:—ఎక్కడనుంచి చేదినది ?

వి:—బావినుండి.

ఒ:—బావిలో నీరెట్లు వచ్చెను?

వి:—(ఏమియు తోచక ఊరకుండును.)

ఉపాధ్యాయుడు డిదిసమయమని గుర్తించి నేలలోని నీటినిగూర్చియు, ఊటలకు వానలు మూలమగుటను గూర్చియు, వానకు సముద్రము, యెండ కారకములగుటనుగూర్చియు చిన్నమాటలతో వానవేమాపి వారికి బోధించినపుడు ప్రత్యక్షప్రమాణముచే వారిమనస్సులందు ఆశ్చర్యరసమును నించవలెను.

'కుడుచుచుఁ'—

ఈయుది పద్యమునందు కరుసన రెండవక్రియ. దీనిని ఇచట సకర్మకముగ భావించి బియ్యము, జొన్న, రాగులు, గోధుమలు, కొఱ్ఱలువంటి తినుగింజలను అనుములు, పెసలు, కందులు, మినుములు, అలసందలు, సెనగలవంటి కాయధాన్యములును, వివిధములైన కాయపండ్లదినుసులును, ఆహారపదార్థము లనుట ఎత్తి చాలు రకుచూపి వాని వైవిధ్యముల గమనింపజేయుటచే ప్రబోధము వేడుకతో కూడినదై ఆశ్చర్యముపుట్టించి వారి మనస్సుల రంజింపజేయును. ఇట్టివేడుకల కల్పించుటకు పరికరములు కాబట్టవు. ఉపాధ్యాయుడు కొన్నివడ్లగింజలను తెప్పించవలెను. ఒక్కొక్క గింజను ఒక్కొక్క విద్యార్థి చేతికిచ్చి వారితోనే పరీక్షింపచేసి దానియందలి చిత్రములగూర్చి చిన్నమాటలతో ఈతీరున సంభాషింపవచ్చును.

ఉదాహరణము:—చూడుడు. ఇదివడ్లగింజ. లోపలిబియ్యపుముక్కకు పైపొట్టు రెండుపాయలుగ నుండుట గమనించితిరా ? ఈపొట్టు గింజను రక్షించుటకై యేర్పడినది. పొట్టునకును గింజకును నడుమ ఒక తెర మెత్తనిపొడియైయున్నది. ఇది కంటికి కానరాదేమో. ఈపొడినే మనము తవుడనుట. ఈతవుటియందు

నిజమైనసార మెతుకైనదుగా నున్నది. బియ్యపుగింజ నిజముగా గట్టిపడిన పాలచుక్క. వరిపైరు లేతగా వెన్ను వేసినపుడు ఒకగింజను విప్పిచూచినట్లయిన లోపలి బియ్యము మొదట పాలుగా నుండుటను చూడనగును. ఇందులకే పైరు 'పాలుపట్టిన' దందురు. పైరువృద్ధియగు కొలది పైనపొట్టుకప్పునకు అల్లిక బిగువగుచుండును. దానితోపాటు పాలచుక్కయు గట్టిపడి బియ్యపుగింజ యగును. ఒక్కొక్కగింజయు యీతీరున పెంపొందు కొలది నడుమ సన్నని తెరతో తవుడు పొట్టునకును గింజకును మెత్తదనమును కూర్చును. ఆహారములలో పాలు బలమునిచ్చునట్టిది. ఒక్కొక్క బియ్యపుగింజయు యిట్లుగట్టిపడిన పాలచుక్కయే. ఈపాలు నీరుగానుండు నేని దానిని ఆహారమునకై చేర్చి కూడబెట్టుట పొసగని పని. అదేపాలే గింజయై గట్టిపడినపుడే పంటనుకోసి, గింజలనుకొట్టి గాదెలలోనో, కణజములలోనో కూడబెట్టుట కనువగును. తక్కినధాన్యములు ఇట్లే గట్టిపడిన [illegible]చుక్కలు. పిడికెడు విత్తనములుచల్లిన గంపెడు గింజ లగును. ఇట్టిగింజలు సద్దులేక, అవసరపడక, ఆలస్యముగాక, ఎట్లుపండుచున్నవో యోచింపుడు."

ఇట్టిచిన్నమాటలతో సంభాషించుచు పదార్థములు చేతికిచ్చి ఉపాధ్యాయుడు శోధింపజేయుచు వచ్చెనేని బిడ్డలమనస్సునం దాశ్చర్య ముద్భవించును. అట్టి సమయమున వారిని బడినుండి బయటికి పిలుచుకొనివెళ్లి పైరుపంటల చూపించినపుడు వారిలోని యాశ్చర్యరసము బలపడుటకు మార్గమగును. ఇట్లే కూరగాయల దినుసులును, పండ్లవర్గమును వరుసగ తెచ్చిపెట్టి వానివైవిధ్యములగూర్చి బాలుర యోచింపజేయుట ఆశ్చర్యరసమును పోషించుటకు మరియొకయుక్తి.

'భాషించుచుఁ'—

ఇది పద్యములోని మూడవక్రియ. మనము మాటలాడుటకుముందు మెదడులో తలంపులు పుట్టును. మెదడు తలయందు మెత్తనిపదార్థము. మెదడు విరివియందు మిక్కిలి కొంచెమైనను లెక్కలేని తలంపులిం దిమిడించవచ్చును. మనము మాటలాడుచుండునపుడు ఈతలంపులు పుంఖానుపుంఖములై మాటలరూపమున బయల్పడుచుండును. తలంపులు పుట్టుటకును మాటపలుకుటకును నడుమకాల మతిసూక్ష్మము. నూరు లేతతమలపాకుల కట్టను కరుకైన కత్తితో నొక్కిపెట్టిన నరుకుడు మేని ఒకయాకు తెగుటకును మరియొకయాకు తెగుటకును యెంత కాలము వ్యత్యాసముండునో తలంపులకును, పలుకులకును కల కాలవ్యత్యాస మంతకన్నను సూక్ష్మముగా నుండుట మరియొకవింత.

"హాసలీలా నిద్రాదులు సేయుచుఁ"—

నవ్వు, ఆట, నిద్ర—ఇవి మనుష్యుని యారోగ్యమునకు, మందుకాని రసాయనములన జెల్లును. నవ్వు మన స్సంతోషమునకు గుర్తు. ఆట శరీరమున కుత్సాహము కలుగచేయునట్టిది. దేహము పనితో బడలినపుడు నిద్ర విశ్రాంతిని సమకూర్చి అంగములకు క్రొత్తపాటవము నొసగును. శరీరమున కాహార మెంతయవసరమో బ్రతుకునకు హాసలీలానిద్రాదులు అంతటివే. ఈ మాటినిగూర్చియు ఒజ్జయగువాడు బిడ్డలతో సంభాషించుట వారియం దాశ్చర్యరసపోషణమునకు పరమ సాధనము.

"తిరుగుచుఁ"—

అనుక్రియనుగూర్చి ఒజ్జయగువాడు తెలిసిసంభాషించెనేని చిన్నమనస్సులను చూరగొనవచ్చును. పసిబిడ్డలు మొదట వెలకిలబడియుండి, బోరగిలబడియు ప్రయత్నమును అటుపిమ్మట చేతులతో దోగియాడి జరుగ తివురుటయు, కూర్చుండుటయు, చేతులుకాళ్లు నాల్గింటితో సాగి పోవజూచుటయు, నిల్చి తప్పటడుగులిడుటయు, నడువనేర్చుటయు, తుదకు పరువులిడుటయు 'తిరుగు' క్రియకు ప్రథమపాఠములన జెల్లును. ఏనేలపై ప్రజలెల్ల తిరుగుచుందురో అదేనేల ఆకాశమం దనాధారమై, గోళమై యున్నదనుటయు, తనచుట్టుతానై తిరుగుచు రాత్రింబగళ్లు చేయు-యేగాక సూర్యునిచుట్టు తిరుగుచుండుటయు బాలురమనస్సునకు వచ్చెనేని 'తిరుగుచుఁ' అనుక్రియయందుగల చలనవేగపరిమాణము లింతటివని తోచును. ఆశ్చర్యరసపోషణమున కిదియు సాధనమే.

"లక్షించుచుఁ"—

అనుక్రియమగూర్చి చర్చింతము. పదార్థముల లక్షించుటకు సాధనము కన్ను. శరీరమున ఈసూక్ష్మాంగ రచన మిక్కిలి యాశ్చర్యమును గొల్పునట్టిది. రెప్ప వెంట్రుకలు కంటికొసగు రక్ష గొప్పదింత. బైట దుమ్మును కంటిగ్రుడ్డుపై పడనియ్యదు. క్షణక్షణమును గ్రుడ్డును తుడుచుచుండుట దానిపని. అట్లు తుడుచునపుడు ఒత్తుడుచే కంటికి మంటగాకుండుటకై రెప్పలలో తడితెగక చెమ నిల్చియుండుట మరియొక చిత్రము. మిక్కిలిసూక్ష్మమైన రోమము మొదలు మిక్కిలి గొప్పదైన సూర్యబింబమువరకు చూచుటకు కంటికి శక్తికలదు. చూడదగనివి కండ్లను మూసికొన్న గాని చూచుటకు ప్రయత్నమే కాబట్టదు. జగత్తను పుస్తకమును చదువుటకిది గొప్పసాధనమని మరిచెప్పవలెనా?

ప్రహ్లాదు డవలంబించిన విద్యాక్రమ మిట్టిదయ్యే యుండవలెను. ఈజగత్పుస్తకమును ఉదారముగ పైతీరున చదివినవాడు కనుకనే ఆయానందము ననుభవించి తోడిబాలురను చూచి,

క. "తెండెల్ల పుస్తకమ్ములు,
నిం డాచార్యులకు మరల నేకతమునకుఁ
రండు విశేషము సెప్పెద
బొం డొల్లనివారు కర్మపుంజముపాలై."
(247, సప్తమ. భాగవతము.)

అని పరిణతచిత్తముతో ఆగ్రహించె.

ఈక్రమము ననుసరించబట్టియే "సంతత శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానుండై మరచెఁ సురారిసుతు డేతద్విశ్వముఁ భూవరా" అని ఆనందమును గ్రోలినవాడు. ఈవిద్యాక్రమము ననుసరించబట్టియే,

సీ. "వైకుంఠచింతావివర్జిత చేష్టుడై,
యొక్కడు నేడుచు నొక్కచోట
నంత్రాంతహరిభావనారూఢచిత్తుడై
యుద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణుడింతయ కాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నళినాక్షుడను నిధానము గంటి నేనని
యుబ్బి గంతులువైచు నొక్కచోట,
ఆ. బలుకు నొక్కచోట బరమేశు గేశవు
బ్రణయహర్ష జనిత బాష్పసలిల
మిళితపులకుడై నిమీలితనేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు."
(124, సప్తమస్కంధము,
శ్రీమద్భాగవతము.)

---



భారతీదేవితో జగడమాడి బెజవాడ వెళ్లింకరవాలె! అందుకని వాసనలో నిరంకుశత్వమూ ప్లీడరీచమాలూ ఉండక తీరదు. ప్లీడరీ అంటే యావత్తునిజమూ చెప్పుతుండా తనకేసుకు బలమైన ఆధారాలు తీసుకుని బల్లగుద్ది వాదించడమే కదా! ఆపని చేయడంలో learned brothers కి వెటకారాలూ, సూటీపోటీ గునపు దెబ్బలూ తగులుతూనే వుంటయి. బైటి కొచ్చింతర వాత "Shakehand", "భాయీ భాయీ" అన్నా! అదంతా మాబోటులకు లాయకీ అయిన విచిత్రవాదన పద్ధతి.

బ్రిటిషు నాగరకతను గూర్చీ అందులో కనిపించే ఘోర పైశాచ లక్షణాలను గూర్చీ నాఅభిప్రాయాలు యీపదేండ్లలో మారటానికి బదులు గట్టిపడినయి మీదుమిక్కిలి. ఈట్సుకవికి Nobel Prize వచ్చిందంటే ఆశ్చర్య మేమీ లేదు. చచ్చిపోయినవాడు గాని Edgar Wallace కి కూడా వచ్చేదే Nobel Prize. బహుశః తెలుగుపద్యాలని (స్వంతాలు) English లోకి మారీస్ చట్టో మొదలైనవారిచేత పరివర్తనాలు అనువాదాలూ చేయిస్తున్న మన నవీనాంధ్రకవు లంతా Nobel Prize వస్తుందని ఆశించి ప్రయత్నించేవారే. ఈమధ్య Depression వల్ల Nobel Prize చాలా చవకయింది లెండి. ఇదే సమయము కవిచక్రవర్తులకు, కవిశార్దూలాలకు, కవికిశోరాలకూ తెరమీది కెక్కటానికి!

నాకు సంస్కృతము రానందుకు విచారము లేదు. తెలుగైనా తిన్నగా వచ్చిందంటే కాస్త కడుపునిండా అన్నము తింటాను. వచ్చినసంస్కృతము కొద్ది అయినా హాక్తుగా సంసారము జరుపుకుంటూవచ్చాను. మతభేదాల విషయములో రాజీ ఎన్నడూ కుదరదు fundamentals మీద. చిల్లరరాజీలు కుదిరితే యెంత, కుదరకపోతే యెంత! గుణాలంకారవాదులకూ నాకు లక్ష్యలక్షణపరిణామమాత్రాలలో నిసర్గమైన భేదం వుంది, స్వాతంత్ర్యం విషయములో మితవాదులకూ కాంగ్రెసువారికి వున్నట్లుగా! అది ఇప్పట్లో తీరేది కాదు. Bar of Eternity ఎదుట తీరవలసిందే. రాబోయే పుస్తకములో క్రొత్తకవులవి కూడా మంచివి యేరి పద్యాలు వేస్తాను ఉదాహరణాలక్రింద. అప్పటి కున్నవాటిలో మంచివి నాబుద్ధికి తట్టినంతవరకు వేశాను. లోకాన్నంతా మెప్పించ ఎవరితరము?

ఒకతెల్లో కథలో నేను పొరపాటుపడ్డానో బద్ధకించానో తేల్చడాని కింకో వాయిదా దయచేయాలి! షేక్సుపియర్ నాటకం ఇప్పుడు నాదగ్గిర లేదు. వ్రాసినప్పుడుకూడా ఉందో లేదో జ్ఞప్తిలేదు. అయినా సమర్థించలేకపోతే అప్పుడే అసారాంశము ఎత్తివేసుకుంటాను ప్లయింటులోనుంచి.

నావాక్యముల కన్వయదోషమున్నదన్న రెండు ఉదాహరణాలలోను జనార్దనకవులు పొరపడ్డారు. తిరిగీ ఒక్కమారు వాక్యాలు రెంటినీ అర్థమును, తప్పొప్పుల పట్టికనూ అనుసరించి చదివితే వారికే బోధపడగలదు. తిన్నగా చదవనిలోపము ఈకాలపు విమర్శకులకే కాదు, పూర్వికులకుకూడా ఉంది లెండి. చిన్నతగాదాయే గాని పెద్దది కాదు. ఎవరు సర్దుకున్నా సరె!

మొత్తంమీద మూగవాణ్ణి అమ్మా అనిపించారు వావిళ్లవారు. ఆమూగవాడిపలుకుల్ని మెచ్చుకొని ఆనందించారు జనార్దనరావుగారు! మాటలు కాస్త బాగా వస్తున్నవి ఈమధ్య నాకు! జనముద్దు వచ్చే మాటల్లో ఇకమంచి వ్రాస్తాను. ఈమధ్య కొంత వ్రాస్తూవున్నాను కూడా! "భారతీ" పత్రికామతల్లి అప్పుడప్పుడూ ఆదరిస్తూనే వున్నది.

పరదేశవాసంలో విమర్శనకూడా మిత్రదర్శనంలాగు సంతోషపెట్టుతుంది. నాకు చాలా సరదా విమర్శనయుద్ధాలంటే, సరసము విరసం కానంతవరకూ! కోపం వస్తే మాత్రం చెప్పండేం, జోహారు చేసి మౌనముద్ర వహించి తపస్సుచేసుకొంటాను యమునాతీరాన.

కొత్తఢిల్లీ
(పాతహస్తినాపురి),
౧౪-౧-౧౯౩౩.
} బసవరాజు అప్పారావు.

# అమృతానందనాథస్వామివారు

జననము: తారణ సం. కార్తీక బ. ౧౦.

నిర్యాణము: ఆంగీరస భాద్రపద శు. ౨.

వీరు కృష్ణామండలమున మచిలీబందరు సమీపమున లక్ష్మీపురమున వెలనాటి వైదికకుటుంబములో జన్మించిరి. తండ్రి పాలావఝల వెంకటరత్నముగారు. కౌండిన్యసగోత్రము. తల్లి మహాలక్ష్మమ్మగారు. ఈ పుణ్యదంపతులు లోక్కసిద్ధుని యాశీర్వాదంబున శివాంశ సంభూతు డగు నీ కృతకృత్యుని పుత్రునిగా బడసిరి. వీరు తలిదండ్రులచే నాగభూషణ మనియు, కృష్ణభక్తులచే శ్రీకృష్ణభూషణమనియు, సాధువులచే నానంద స్వామి యనియు, దేశికునిచే అమృతానందనాథు డనియు పేరులం గాంచిరి. ఆంగ్ల భాషలో తమ యసమాన ప్రతిభావిశేషమున పాశ్చాత్యశాస్త్రవిజ్ఞానము నంతయు సంపాదించిరి. సంస్కృతమున సర్వతంత్ర స్వతంత్రులయి వీలసిల్లుచు మహాభాష్య మనర్గళముగ పాఠము చెప్ప సమర్థులయి యుండిరి.

శ్రీగోవిందయోగీంద్రు లాదిశంకరులంబోలె శ్రీదుర్గానాగేశ్వరయోగీశ్వరులే వీరిని గటాక్షించిన గురువరేణ్యులు. "అహర్నిశం బ్రహ్మణి యే రమంతే" యను నార్యోక్తికి వారి జీవితమే లక్ష్యభూతమయినది. పాండిత్యప్రకర్ష చూపవలె నను ప్రయత్న మావంత యేనియుం గక యైదేండ్ల బాలునకేని మనసున కతుకున ట్లుపమానములతో దత్త్వబోధ జేయు నైపుణ్యమునందు వీ రసమానులు. వారిపేరు సార్థకము సేయుచు, వారి సన్నిధికి వచ్చిన భక్తుల సందియముల దీర్చి యమృతప్రాయమగు బోధల నొసగి యానందమును గూర్చుచుండిరి.

బందరుసమీపమున జలకలపూడిలో వీరు చిరకాల మొక యాశ్రమము కల్పించి యందు దపంబు సలుపుచు దత్త్వజిజ్ఞాసువులయి సన్నిధికి వచ్చినవారికి భవరోగముల బాపుచు గాలక్షేపము సేయుచుండిరి. అంతేవాసియు, అనుజుడు, పదునారేండ్లకే మహాభాష్యము జదివినవాడు, సత్యనారాయణాభిధు డకస్మాత్తుగా జనిపోవుటచే నయ్యాశ్రమంబు వదలి "కలౌ వేంకటనాయకః" యను ప్రమాణముంబట్టి తిరుపతి ప్రవేశించిరి.

ప్రతిసంవత్సరము కొండమీద శ్రీనివాసుని సన్నిధానమున గొంతకాలము మంత్రదీక్ష వహించుచు దక్కినకాలము దిగువతిరుపతిలో జిజ్ఞాసువులకుమాత్రము దర్శనమొసంగుచు నివసించుచుండిరి.

నెల్లూరుమండలమున దుంబూరులోను, గడపమండలమున గోదూరులోను అహర్నిశ మవిచ్ఛిన్న భగవద్భాగవత కైంకర్యదీక్ష జరిగిన సత్త్రయాగములో భక్తులకు, బంధితులకు, నానందసంధాయకులగుచు నిత్యామృతానందస్వాములవారు చాతుర్వర్ణ్యమునకు సమ్మోద మొసగిరి.

ఆతరుణమున శ్రీదేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు, అల్లాడి కృష్ణస్వామయ్యరుగారు, ఆరొకుటు పరశురామారావు పంతులుగారు మొదలగు ప్రముఖు లెందఱో యచ్చటి యార్యవిజ్ఞానప్రదర్శనమును మెచ్చుకొనిరి.

శ్రీ వే. లంక లక్ష్మీనరసింహశాస్త్రిగారు, భాగవతుల సూర్యనారాయణావధానులుగారు భాగవతసప్తాహప్రవచనులగు శ్రీ వే. పుల్లెల బ్రహ్మముగారు మొదలగు విద్వద్వరిష్ఠు లెందఱో శ్రీవారి దర్శనాపేక్షులయి వచ్చి వారిబోధచే గృతార్థుల మైతి మని సంతసించిరి.

ఐదుసంవత్సరము లేకదీక్షగా చాతుర్వర్ణ్య నిత్యాన్నప్రదానముతో సత్త్రయాగదీక్ష జరిపించి యమ్మహనీయుడు తిరుపతిలో శ్రీ శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమున నొకశాశ్వతభవనము నిర్మించి యందు శ్రీ లక్ష్మీవేంకటరమణపంచాయతనపూజ నెల




ఆంధ్రభీష్మ
న్యాపతి సుబ్బారావు పంతులుగారు



దేశసేవాపరాయణుడగు నీధన్యజీవునికి ఈజనవరి మాసమున డెబ్బదెనిమిదవవర్ష పు వర్థంతి రాజమహేంద్రవరమున జరిగినది.

వాడ్రేవు భద్రిరాజుగారు



తూర్పుగోదావరిజిల్లాలోని చోడ్పెల్ల(గా[illegible] వారగు వాడ్రేవు కామరాజుగారి నాల్గవ కుమా[illegible] వీరు ఐ. సి. యస్. పరీక్షయందు విజయమును బొంబాయిరాజధానిలో 'సతారా'కు అసిస్టెంటు కలెక్టరుగా నున్నారు. వీరు నియోగిబ్రాహ్మణులు. తెగవారిలో కలెక్టరు పదవిని గాంచినవా రిప్పటికి వీరి సన్నిహితజ్యేష్ఠసోదరు లిరువురు న్యాయ[illegible]లుగా నున్నారు.

ని. వెం. సు.




**కే. పి. సత్యనారాయణగారు**

మాంఛెస్టరు, ఎ. యం., యం. ఐ. ఇ. ఇ.

వీరు ఆంధ్రులు. అయిదేడు లింగ్లాండులో విద్యను, ఎలెక్ట్రికలు ఇంజనీరింగు పరిశోధనముతో గా తెలిసికొని మాతృదేశమునకు వచ్చిరి. వీరివలన ోచితలాభము నాంధ్రదేశము పొంద ఆశించు ది.



ప్రకృతి దృశ్యము




## నిరక్షరత్వము

విటకరుగారి 1933 పంచాంగము ననుసరించి:—

| దేశము | 100-కి నిరక్షరుల పరిమితి |
| --- | --- |
| టర్కీ (1927) | 91.8 |
| ఇండియా (1921) | 90.0 |
| ఈజిప్టు (1927) | 85.7 |
| బ్రెజిలు (1920) | 67.0 |
| పోర్చుగల్ (1920) | 65.0 |
| మెక్సికో (1921) | 64.9 |
| సోవియట్ యూనియన్ (1926) | 48.7 |
| స్పెయిన్ (1920) | 46.0 |
| గ్రీసు (1928) | 43.0 |
| పోలండు (1921) | 32.7 |
| ఇటలీ (1921) | 26.8 |

సోవియట్ యూనియన్ వారి విషయము 6 సం. క్రిందటిది. పంచవర్షముల ప్లాను ప్రకార విధానము నీ నిరక్షరత్వ మా దేశమునం దధిక భాగము తగ్గియే యుండవలెను.

అమెరికావిషయము—అందు ముఖ్యముగ నీగ్రోలను గూర్చి, యాశ్చర్య మొందక తీరదు. అమెరికాలో 1930 లో స్వదేశజన్ములగు తెల్లవారిలో నూటికి 1.5, పరదేశ జన్ములగు తెల్లవారిలో నూటికి 9.9, నీగ్రోలలో నూటికి 16.3, ఇతర తెగలలో నూటికి పాతిక చొప్పున నిరక్షరులు. మొత్తపు జనసంఖ్యలో 10 సం. వయస్సుమీరినవారి యందు నూటికి 4.3 నిరక్షరులు.

అమెరికా నీగ్రోలు తే 18-12-1865 దీ వరకును బానిసలుగనే యుండిరి. వారు మొదట అమెరికాకు బలవంతముగ దీసికొనిరాబడి పశువులవలె విక్రయింపబడిరి. వారి కొక విద్య గాని, యొక వర్ణక్రమము గాని లేకుండెడిది. దాస్యవిముక్తులైనపిదప 65 వత్సరములలో నూటికి 83.7 చేటున విద్యావంతులైరి. 1930 వరికి అవిద్యావంతులుగ మిగిలినవారు నూటికి 16.3 మాత్రమే. ప్రాచీన నాగరికులని పేరుపొందినవారు, ప్రాచీనవిద్యాసముపార్జనపద్ధతులు కలవారు, సర్ థామస్ మన్రో (1818) గారు నడిపినటుల యూరి కొక పాఠశాల కలవారునగు హైందవులు 1931 జనాభా ప్రకారం 352,837,778 జనసంఖ్యలో శిశువులు కలిపి చదువుకొన్నవారి సంఖ్య 28,131,315 మాత్రమే. అనగా నూటిలో 8 కి కొంచెము తక్కువ సాక్షరులును, 92కు కొంచె మెక్కువ నిరక్షరులును కలరు. ఇదియును నాగరిక జాతియగు ఇంగ్లీషువారి పరిపాలనమున, $1\frac{1}{2}$ శతాబ్దము కడచిన పిదప.

65 సంవత్సరములలో నీగ్రోలు నూటికి 83.7 వంతునను, 150 సంవత్సరములకు మించిన కాలములో ఇండియనులు నూటికి 8 కంటె కొంచెము తక్కువ వంతువను విద్యావంతులైరి. (మాడర్న్ రివ్యూ.)

—దుర్గమహంతి ఆదినారాయణ.

## గొల్లపిల్లడు



బొంబాయి ఆర్టుసొసయిటీ ప్రదర్శనమునకు పంపబడిన శ్రీమతి దామెర్ల సత్యవాణిగారి చిత్రమునకు ప్రతిబింబము.

---

## ఛాయాచిత్ర గ్రహణము-క్రొత్తరకము యంత్రము



దీపము వెలుగున ఫోటోలు తీయునపుడు బాగ, శబ్దము లేకుండును. ఎలెక్ట్రికు బల్బులలో నున్న మెగ్నిషియమును రగిల్చి ఒక్కబల్బు నొక్కచిత్రమునకు చిత్రకారుడు వినియోగించును.

G. S. A.

### ముఖాచ్ఛాదనము



పరిశ్రమాలయములయందు దుర్వాయువుల నుపీల్చకుండుటకయి చేయబడినది.

G. S. A.

---

### బిచ్చగాండ్ర సంఘమునకు చీడపురుగులు

మన దేశమున పలువురు, వికలాంగులు కాకున్నను, కష్టించి జీవించు శక్తి గలిగియున్నను బీదవారమను నెపమున సోమరితనమునకు బానిసలు సాంఘికవృక్షమును బట్టిన చీడపురుగులు నయి వ్యర్థముగ జీవితములను పాడుచేసికొనుచున్నారు. పనిపాటుల వంకకు మనస్సులు పోవమిని వారిలో చాలమంది నిరంతరము దురాలోచనముల జేయుచు తద్ద్వారమున దుష్కార్యకరణమునకును వెనుదీయకున్నారు. పరపిండనిరతులగు నీయధమ జీవనులు అన్నిజాతులయందును, అన్నితరగతులయందును గలరు. వీరలు కేవలము వ్యక్తులే కాక కుటుంబములుగ తయారయియున్నారు. పాత్రాపాత్రవిచారవిహీనులయి యాచించిన వారికెల్ల యథాశక్తిని తృణమో పణమో యిచ్చు దాతారమ్మన్యులే దీనికి కారకు లగుట నిక్కము. వీరి యీవి యుభయతారకము కామి యే కాక యుభయాపకారకము నగుచున్నది. సంఘమున గొంత భాగము నధోగతిపాలు చేయుచున్న యీకీడును తొలగించు నుపాయము లరయుట తప్పనిసరి యగుచున్నది. అందును ధనాభావముచే దేశము క్రుంగుచున్న యీకాలమున. ఈవిషయమున గొన్ని సలహాల నొసగుచు 'బిచ్చములు-బిచ్చగాండ్రు' అను పేర శ్రీ ముక్కామల గణేశ్వర రావుగారు 'రైతుపత్రిక' (౨౭-౧-౯౩౩) యందు వ్రాసిన వ్యాసము పైప్రయత్నమున కొంత యుపకరింపగలదు. ఆవ్యాస మామూలాగ్ర మిక్రింద గలదు. ఇందలి సలహాల ననుసరించినచో క్రమముగా నీదుర్వృత్తి నశింపగలదు. దీనికి ముఖ్యముగా విద్యావంతులగు నేటి యువజనులు నడుము కట్టవలసియున్నారు.

"బిచ్చగాండ్రెవరైనను బిచ్చ మెత్తుమా వచ్చినపుడు సాధారణముగా మన మేమియూ ఆలోచింపకయే బిచ్చము వేయుటో లేక పొమ్మనుటయో చేయుదుము. మనలో కొంబరు వచ్చిన బిచ్చగాండ్రయొక్క అంగవైకల్యమును గాని జరమును గాని గమనించి, ఉచితరీతిని బిచ్చమిడిపొమ్మందురు. దీనినిబట్టిచూడగా మనము మన తోడి మానవుల దుర్దశను చూచి జాలికలిగి బిచ్చమిడుచున్నామనుమాట.

హృదయముగల మానవులకు, తమతోడిమానవుల దురవస్థకు జాలిపడుట, అనాథలకు ఆర్తజనులకు సాహాయ్యముచేయు టెంతవసరమో, తాముచేయు ధర్మములు, బిచ్చములు, కలుగజేయు శరణ్యములు ఎంతవరకుపయోగించుచున్నవో ఇంచుక గమనించుచు తాము నడుపవలసినరీతిని నడుపుటకూడా అంతవిధియై యున్నది. సాధారణముగా మనము చేయు ఈవ్యక్తిగతధర్మములు, అనగా బిచ్చగాండ్రకిడు కానీ లేక అర్ధణా లేక పిడికెడు బియ్యము, తాత్కాలికముగా వారికి కొంత క్షున్నివారణచేయును కాని వారిని బిచ్చమెత్తుటనుండి తప్పింపనేరవు. వారిజీవితమును ఏవిధముగాను మార్పజాలవు. ఏరోజు బిచ్చ మారోజు వారికి పొట్టపోషించుకొనుటకు సరిపోవును. అందువలన బిచ్చము వారిజీవితవృత్తికింద ఏర్పడిపోవును.

వారిసంతానమునకు బిచ్చమెత్తుట వంశవృత్తియై పోవును. ఇది యాశ్చర్యము కాదు. మనదేశములో బిచ్చమెత్తు జాతి యొకటప్పుడే తయారైనది. పైగా యీవ్యక్తిగతధర్మముల ననుసరించి బిచ్చమెత్తు సోమరులనేకమంది తయారైనారు వీరెంత చిన్నవయస్కులైనను దృఢకాయులైనను పాటలు, పద్యములు, జావళీలు, వేదాంతకీర్తనలు పాడుచు రైళ్లవెంబడి పడవలలోను, రోడ్లమీదను బిచ్చమెత్తుచున్నారు. ఇటువంటివారిని వందలాదిగా మనము ప్రతీరహదారియందు చూచుచున్నాము. వీరందరినీ ప్రోత్సహించువా రెవరు?

మనము చేయు ఈవ్యక్తిగతధర్మములు బీదల పాలిటి విషము. అందువలన ఇటువంటి ధర్మములు మన మెప్పుడునూ చేయరాదు. రయిళ్లలోను, పడవలలోను వీధులలోను వచ్చు ఈబిచ్చగాండ్రకు మనము వ్యక్తిగతముగా ఒకకానీయైన నీయరాదు. నిజముగా వారు దరిద్రావస్థలో నిరాధారులుగా ఏమియు వృత్తిలేకుండ నుండవచ్చును. అయితే వారికీవృత్తిని మాత్రము మనము కలిపించరాదు.

మనముచేయు ధర్మములు మొదలుగాగలవి చిల్లరగా వ్యక్తిగతములు కాకుండా యుండవలెను. మరియు మనమందరము ధర్మముచేయదలచుకొన్న ధనమును, బీదవారికి చేయూతనొసగి వారికి ఆత్మగౌరవమును జీవనవృత్తులను కలుగజేయు సంస్థలకు చందాగా నిచ్చుచుండవలెను. అటువంటి సంస్థలు లేని సందర్భములో ప్రజలందరును వారియొక్క చిల్లరధర్మముల నొకచోట ప్రోగుచేసి సంస్థలను నెలకొల్పవలెను. మరియు ప్రభుత్వము వారిని అటువంటి సంస్థలను నెలకొల్పునటుల చేసి వానికి మనము సాహాయ్యముచేయుచుండవలెను.

మనసంఘము అనేకవిధముల క్షీణించుచున్నది. దీని నుద్ధరించవలె నన్న బీదలకు బ్రతుకుతెరువు జూపు సంస్థలు (Poor-houses) వేనకువేలు స్థాపించవలెను. ధనవంతులకు తాము చిల్లరగా, అనగా వ్యక్తిగతముగా దానము చేయుట పాపమనియు, దరిద్రులకు బిచ్చమెత్తుట పాపమనియు తోచవలెను. అపుడే సంఘము గాని దేశము గాని వృద్ధికి వచ్చు స్వయంకృషిస్వాతంత్ర్యప్రబలి సంఘములో బీదవారు గొప్పవారు అను తారతమ్యము లేక అందరును పాటుపడుదురు. దీనికి పాశ్చాత్యసంఘములు, పాశ్చాత్యదేశములే నిదర్శనము.

ఇందువలన దేశహితులను సంఘహితులను తాము రయిళ్లలోను, పడవలలోను, మరియు తదితరచోట చేయు చిల్లరధర్మములను మానివేసి ఆ ధర్మములను ప్రోగుచేసి దరిద్రులను భరించుచు సంస్థలకు చందాగా నొసగవలెననియు లేదా అటువంటి సంస్థలు నెలకొల్ప ప్రయత్నము చేయుదురనియు కోరుచున్నాము."

తమ్ము దాము పోషించుకొనజాలని వికలాంగులను పోషించు భారము దేశక్షేమమునకని ప్రజలవలన అనేకవిధములుగ పన్నులను రాబట్టుకొనుచున్న ప్రభుత్వముపయి గలదని చెప్ప బని లేదు.

శ్రీ బర్నార్డు షాగారు



స్టీమరులోనుండి బొంబాయి ఓడరేవును చూచుచున్నారు.

---

## కండ్లను సంరక్షించుకొనుడు

మన శరీరస్వాస్థ్యమును గూర్చిన అనేక సమస్యలకు సంబంధించిన చాల ఉపయోగకరములగు వ్యాసములను 'ది ఓరియంటల్ వాచ్‌మన్ అండ్ హెరాల్డ్ ఆఫ్ హెల్త్' పత్రిక ప్రచురించుచుండును. భారతీయ విద్యార్థులలోను, విద్యాధికులలోను నూటికి కనేక మంది కండ్ల జబ్బులతో బాధనొందుచుందురు. పైపత్రికలో ప్రచురింపబడిన ఒక వ్యాసములోని ఈక్రింది భాగము లట్టివారికి చాల ఉపయోగపడగలవు.

కండ్ల నీరసమునకు అతిసామాన్యమగు కారణము లివి: ౧. చిన్ని అక్షరములు గల పుస్తకములను చదువుట, తరుచు కుట్టుపని చేయుచుండుట మొదలగు శ్రద్ధావంతమగు పనులవలని మితిమీరిన శ్రమ, ౨. విరివిగా గాలి తగులని-సువిశాలము కాని-గదులయందలి, సినీమా గృహములందలి, పొగతో మూసిన పరిసరములలోని-అపరిశుద్ధమైన వాయువు, ౩. బహిరంగ ప్రదేశముల వ్యాయామము చాలమి, ౪. హెచ్చుకాంతి గల దీపములవద్దను, తీవ్రమగు సూర్యతాపమునను మసలుట వలని అమితమగు శ్రమము మొదలగునవి, ౫. అనారోగ్యకరమగు ఆహారమును.

కండ్లయందు అనేకములగు సూక్ష్మములయిన రక్తనాళము లుండును. పరిశుద్ధమయిన రక్తస్రావము సరిగా జరుగుచుండుటకు ఈరక్తనాళములు మంచిస్థితియందుండుట కవసరమగును. మాంసాహారములు, పిండిపదార్థములు, తీపిపదార్థములు, టేనీరు, పొగాకు, మద్యములు మొదలగునవి హెచ్చుగాగల అన్నపానముల వలన రక్తప్రవాహము గడ్డకట్టిపోయి యుండుట చేర్పడును. అంతట, కండ్లలోని సన్నని రక్తనాళములలో వ్యర్థపదార్థము సూక్ష్మ అణువులుగా చేరి, కొట్టుకొని పోవుటకు బదులుగా, నిలువరైపోయి, దృష్టిని చెడగొట్టును. ఇందువలన స్పష్టమగుచున్న దేమనగా, మన సామాన్య దేహస్వాస్థ్యస్థితియే మన కండ్ల బాగోగులను నిర్ణయించును. భోజనవిషయమున, పైన వివరింపబడినట్టి అన్నపదార్థములను, పులియు వస్తువులను, ఉత్తేజకారకములగు ఆహారములను, మానుకొనుటయో బాగుగా తగ్గించుకొనుటయో చేయుటయే కాక, కండ్లలోని పొరలకు కారణమగు ఉప్పు వాడుకను చాలగా తగ్గించుకొనవలయును.

కండ్లకు అలయిక కలిగినదని తోచినతరువాత యింకను పనిచేయుచుండుట చాల హానికరమగును. సందర్భములు కుదిరినచో, విశ్రాంతి గైకొని కండ్లకు విరామమీయవలెను. ఈవ్యాసమున చివరభాగమున చెప్పబడిన వ్యాయామములలో నొకదానిని చేసినయెడల కండ్లకీ

విశ్రాంతి కలుగగలదు. చదువునప్పుడు గాని వ్రాయునప్పుడుగాని, దీపపుకాంతిగాని వెలుగుగాని భుజముల వెనుకనుండి (ఎడమవైపునుండి) కాగితముపై పడునట్లు చూడవలెను. అనగా వెలుగుకు ఎదురుగా కూర్చుండరాదు. పోవుచున్న పొగబండ్లయందును, ట్రాంబండ్లయందును, మోటారుబండ్లయందును చదువుట అత్యంతము హానికరము. దానివలన కండ్లకు చాల శ్రమ కలుగును. నిరంతరమును నిప్పు మొదలగువాని వేడిచెంతనే ఉండుటవలన కండ్లు వాడి, కండ్లకు తీరని నష్టము కలుగగలదు.

క్రిందుమొగముగ కూరుచుండుట కన్నులకు చాల చెరుపు. అప్పుడు కన్నులలోనికి ఎక్కువ నెత్తురు చేరి కన్నులయందు మంట, నొప్పి కలిగి బాధింపగలదు. సులువుగా చూడగలిగినంత దూరమునుండి చదువు వ్రాతలు సాగించవలెను.

కండ్లను బలపరచుటకొక చాల ఉపయోగకరమైన పద్ధతి యిది: కండ్లు మూసికొని కనురెప్పలపైని కొనవ్రేళ్లతో అతిలేలికగా నిమురుట. ఎల్లప్పుడును కంటి వెలికొలకులవైపునుండి లోకొలకులవైపునకు నిమురుచుండవలయునేగాని, అటునుండి యిటు ఎన్నడును చేయరాదు.

ఇంకొక మంచి పద్ధతి నయనస్నానము. ఊపిరి బిగబట్టి చన్నీళ్ల తొట్టిలో ముఖమును ముంచవలయును. నీటిలో నుండగనే కండ్లను రెండుమూడుమారులు తెరచి మూయవలెను. అంత, నిట్టూరుగా లేచి నిలువబడి, మరల ఊపిరిపట్టి మరల మరల వెనుకటివలెనే కండ్లకు స్నానము చేయింపవలయును.

కండ్లకు విశ్రాంతి అత్యంతము అవసరము. ఈ క్రింది వ్యాయామములలో నేదేని యొకటిగాని రెండుగాని యాచరించు నెడల కండ్లకు ఉత్తమమగు విశ్రాంతి యేర్పడగలదు. దినమున పెక్కుమారులు అరచేతులను, మూసికొన్న కండ్లపై లేలికగానుంచి లలాటముపైకి వ్రేళ్లు వాలుముగా నిలుచునట్లు ఉంచుచుండవలెను. కండ్లను గట్టిగా ఒత్తరాదు. ఇట్లు మూసికొన్న కండ్లతో కారు నలుపును చూడ యత్నింపవలెను. ఈవిధముగ సుమారు పదినిముసముల కాలము ఉంచి అంతట వెంటనే చేతులను తీసివేయవలెను. ఇట్లు కండ్లు తెరచినవెంటనే దృష్టి మునుపటికంటె చాల నిశితమై తేజోవంతముగ మారినట్లు గ్రహింపనగును.

ఇక, కండరములకు వ్యాయామమును గురించి. ప్రత్యేకమగు యంత్రసాహాయ్యము లేనిదే మామూలు గృహవ్యాయామ విధానములవలన అంత మేలు జరుగదనియే చెప్పవలెను. పదహారు సంవత్సరములకు లోపు వయస్సుగలవారికి మాత్రము ఉపయోగపడునని చెప్పదగు వొక వ్యాయామము గలదు: ఒక కంటిని మూసుకొనవలెను. తెరచియున్న కంటితో గదిలోని ఒక గోడ నడిమిభాగమును చూడవలెను. గోడయొక్క నలుకొలంకులను చూచుచు కనుగ్రుడ్డును చక్రమువలె త్రిప్పవలెను. ఇట్లు త్రిప్పుటయందు దృష్టి వీలైనంత సరిగా ఒకవృత్తము (చక్రము) గ నుండవలెను. ఈ వ్యాయామమువలన ఒక్కొక కనుగ్రుడ్డు కదలికను వీలు చేయునట్టి కంటి కండరములు ఆరును పరిశ్రమ చేసినవగును. తరువాత రెండవ కంటితో నట్లే చేయవలెను.

సాధారణముగా తలనొప్పులన్నియు కంటి జబ్బువలననే కలుగునని మరువరాదు. ఇట్టికారణమున కనుబొమలయందును, వానిక్రిందను నొప్పి కలుగును. లేక, కనులకు సరిగా వెనుకతట్టున రెండువైపులను ఉండును. లేదా, తలకు వెనుకభాగమున సరిగా చెవులకు తిన్నగానైన నొప్పి కలుగును. ఈనొప్పి ఎల్లప్పుడును ఉండకపోవచ్చును. కాని, అంతమాత్రమున కన్ను మంచిస్థితి యందున్నదని గాని, చక్కగా పనిచేయుచున్నదనిగాని తలపజనదు.

---

సోంజాహానీ కన్య



మంచుకొండలపయి జారుటయందు కడుసమర్థురాలు. సౌకుమార్యము, ఉత్సాహము ఈమెయందు ప్రత్యక్ష మగుచున్నవి. G. S. A.

---

ఏనుగుల క్రికెట్టు ఆట




(ఒలింపియా సర్కసు)

---

## క్రీ. శే. కాల్విన్ కూలిడ్జిగారు




పూర్వము అమెరికాకు అధ్యక్షులుగా నుండిన ఉదారాశయులు.

---

## ఇండియా — చదువురానివారు

ఇండియా ప్రభుత్వమువారు ౧౯౩౧-వ సంవత్సరపు జనాభా లెక్కలను ఇటీవల ప్రకటించినారు. ఇండియా జనసంఖ్యయందు అయిదేండ్లకు మించినవయస్సుగలవారిలో ఏభాషనయినను వ్రాయను, చదువను గలవారు, వేయింటికి, మగవారు ౧౫౬, ఆడువారు ౨౮, వంతున గలరని యీ లెక్కలయందు కలదు. ౧౯౨౧-వ సంవత్సరము లెక్కల ప్రకారము ఈ చదువను వ్రాయను గలవారు, పురుషులు ౧౨౨, స్త్రీలు ౧౯. దీనివలన ఇండియాలో చదువురానివారి సంఖ్య తగ్గిపోవుచున్నదని తలచుట కవకాశము గలుగుచున్నది. కాని అది సరికాదు. పదియేండ్లకు మునుపటికంటె ఇపుడు చదువురానివారు ఎక్కువా, తక్కువా అనువిషయము ఇపుడు కనుగొనవలసియున్నది.

౧౯౩౧-వ సంవత్సరమున చదువురానివారు ౩౨౧,౬౨౮,౦౦౩ (పురుషులు ౧౫౬,౨౪౩,౩౦౫, స్త్రీలు ౧౬౫,౩౮౪,౬౯౮,) గలరు. ౧౯౨౧-వ సంవత్సరమున ౨౯౩,౪౩౧,౫౮౦, (పురుషులు ౧౪౨, ౬౨౩, ౬౯౧, స్త్రీలు ౧౫౦, ౮౦౭, ౮౮౯) ఉండిరి.

కావున ౧౯౩౧-వ సంవత్సరమున ౧౯౨౧-వ సంవత్సరమున కంటె చదువురానివారి సంఖ్య ౨౮,౧౯౬,౪౨౩ అధికముగా నున్నది. ఈక్రమమునుబట్టి చూచిన ౧౯౨౧-వ సంవత్సరమునకంటె ఇపుడు ౩౩,౩౬౫,౭౬౮ మంది చదువురానివారు అధికముగ నుండవలెను. దీనికి ౧౯౨౧-వ సంవత్సరమున చదువవచ్చినవారిలో పలువురు ౧౯౩౧-వ సంవత్సరమునాటికి, లేక, నేటికి అక్షరముల నెమరచిపోయిరని అర్థము కాదు, కాని, ఇండియాలో జనసంఖ్య, చదువగలవారి సంఖ్యకంటె ఎక్కువవేగముతో పెరుగుచున్నదని తేలుచున్నది. ఈచదువురానివారి సంఖ్యను తగ్గింపవలయునన్న పల్లెటూళ్లను ఎక్కువమంది పెద్దవారిని విద్యావంతులను జేయుటకు సౌకర్యములను గలిగింపవలయునుగాని చిన్నపిల్లలను చదువుగలవారి సంఖ్యతో చేర్చి చదువుగలవారు ఎక్కువయిరని చెప్పుట పనికిరాదు.

ఇండియాలో విద్యావ్యాప్తి అసాధ్యము కాని కష్టసాధ్యము కాని కాజాలదు. జపాను, సోవియటు రష్యాలలో అవలంబించుచున్న మార్గములే ఇండియాలోని నిరక్షరతను పోగొట్టుట సుకరమునకు నిదర్శనములు.

ఇట ఇండియాలోనే బరోడాసంస్థానమునందలి సత్వర విద్యావ్యాప్తిని పరిశీలింపదగును. విద్యావ్యాప్తి కొరకు బరోడామార్గములనే అవలంబించిన ఇండియాలో సైతము విద్యావ్యాప్తి అధికము కాగలదని స్పష్టమగుచున్నది. ౧౯౩౧-వ సంవత్సరపు బరోడా జనాభా లెక్కలనుబట్టి చదువుకొన్నవారిసంఖ్య నూటికి ఏబదితొమ్మిది లెక్కను—పురుషుల సంఖ్య ౫౪, స్త్రీలసంఖ్య ౯౩— పెరిగినది. ఈ సంఖ్య పెరుగుట కవకాశమున్నచో నెల్ల అతివేగముగ పెరుగుచున్నది.

బరోడా చిన్నరాజ్యము. తక్కువ విస్తీర్ణము కలది. దాని జనసంఖ్య ౨,౪౪౩,౦౦౭. ఇండియా యన్నచో ఒక చిన్నఖండము. విస్తీర్ణము అత్యధికము. దానిజనసంఖ్య ౩౫౨,౮౩౭,౭౭౮. ఇండియా విస్తీర్ణము, జనసంఖ్య బరోడావిస్తీర్ణము, జనసంఖ్యకంటె మిక్కిలి ఎక్కువ అయినట్లే, ఇండియా, బ్రిటిషుఇండియాల ఆదాయమును బరోడా ఆదాయముకంటె అత్యంతము నధికము. కావున అల్పాదాయముగల బరోడా యందు సాధ్యమయినకార్యము, అపరిమితాదాయముగల ఇండియాయందును సాధ్యము కాగలదు.

'మాడరన్ రివ్యూ'

---

## కీ. శే. జాన్ గాల్స్‌వర్దీ



ఈమధ్యనే ఆంగ్లసాహిత్యమున ప్రపంచబహుమానమును (నోబెల్ ప్రయిజును) బడసిన సుప్రసిద్ధ బ్రిటిషు నవలాకారుడును, నాటకరచయితయు నగు వీరు మొన్న జనవరి 31-వ తేదీని లండనులో మృతినొందిరని తెలియుట యెంతయు సంతాపకరము.

[వీరినిగూర్చిన వ్యాస మొకటి 'భారతి' 1932 డిసెంబరు సంచికలో ప్రచురింపబడియుండెను.]

---

చెన్న రాజధానియందు ౧౯౩౦-వ సంవత్సరము అక్టోబరు ప్రారంభము మొదలు డిసంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## అలంకార శాస్త్రము

ఆంధ్రనటప్రకాశిక— పి. యజ్ఞనారాయణ శాస్త్రి

## ఇతిహాసములు

ఆంధ్ర వచన మహాభారతము—యస్. వెంకటరంగశాస్త్రి

శ్రీమదాంధ్ర వచనమహాభారతము—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

పురాణకథాదీపిక—బి. వి. శివరావు

బాలవీరులు—సి. సీతారామరావు

మైరావణచరిత్ర—క. వెంకటరత్నం

శిబిచరిత్రము—జి. వెంకటసుబ్బరాయదాసు

శ్రీరామచరిత్ర—డి. లక్ష్మీనరసమ్మ

## —కల్పితములు

అరేబియన్‌నైట్సుకథలు భా. ౧, ౨—(అను.) జి. నారాయణ

కాదంబరీకథాసారము—భే. సత్యనారాయణరావు

పిల్లలకథలు భా. ౩—(ప్ర.) సి. శ్రీనివాసరావు, ఆర్. వి.

భట్టివిక్రమార్కునికథలు—పి. పిచ్చయ్య శాస్త్రి

## —చారిత్రకములు

ఆంధ్రదేశకథలు—(ప్ర.) వి. ఆర్. జగపతివర్మ, పెద్దాపురము

ఆంధ్రులకథలు —(ప్ర.) వి. ఆర్. జగపతివర్మ. పెద్దాపురము

ముప్పది యిద్దఱు మంత్రుల చరిత్రము—కె. మార్కండేయశర్మ

## కల్పము

త్రినాథవ్రతము—సి. శ్రీనివాసరావు.

శతచత్రివ్రతకల్పము—(ప్ర.) పి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము

శ్రావణమంగళ గౌరీవ్రతము— (ప్ర.) పి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము

శ్రీత్రినాథవ్రత కల్పము—యల్. వి. యన్. ఆచారి

## గణితశాస్త్రము

వేర్వేరుగాచేయతగినట్టి చిరుగణితపుస్తకము, నెం. ౩.—యల్. జి. లాసన్

సులభగణితము, భా. ౨—యస్. కృష్ణరావు

## గేయములు

అద్వైతమోదానందతత్వములు—ఆర్. హనుమ్నాయోగి, బి. లక్ష్మణదాసు

ఆంజనేయ రావణసంవాదము—యం. పాపయ్యదాసు

కీర్తనలపుస్తకము—యం. రామలింగాచారి

కృష్ణా గోవిందకీర్తనలు—*. యల్. నరసింహారావు

పాండవగీతలు—(ప్ర.) కె. మార్కండేయశర్మ, మదరాసు

పాటలు—సి. రంగనాయకమ్మ

భక్తజనానందకీర్తనలు—యస్. కోటయాచార్యులు

భక్తజనానంద రామాయణము—బి. పల్లయ్యదాసు

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము. అనువాదకులు ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

మేలుకొలుపు భక్తికీర్తనలు—(ప్ర.) ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు, విశాఖపట్టణము
శ్రీమద్రామాయణ గొబ్బిపాటలు—కె. సుదర్శనదాసు
శ్రీరామాయణము, పాట—యస్. మహాలక్ష్మమ్మ
శ్రీవెంకటేశ భక్తిబృందావళి—(ప్ర.) యం. వి. రుద్రయ్యనాయడు, తిరుపతి
సంపూర్ణ రామాయణ కోలాట దసరా కీర్తనలు— బి. శేషయ్య
సీతారావణసంవాదము—యం. పాపయ్యదాసు
హరిభజనకీర్తనలు — (ప్ర.) కె. వరదరాజమొదలి, మదరాసు
హాస్యరసరత్నావళి—యస్. సూరిదాసకవి

## చరిత్ర

సంగ్రహబ్రిటిషుచరిత్ర — (ప్ర.) ఆక్స్‌ఫర్డుయూనివర్సిటీప్రెస్, మదరాసు

## చిత్రలేఖనము

భారతీయ చిత్రకళ— త. రామరావు

## జీవితములు

ఆంగ్ల నారీమణులు—జి. సూర్యనారాయణశాస్త్రి
చాణక్యుఁడు—వి. సత్యనారాయణశాస్త్రి
శ్రీనాథకవిజీవితము—పి. వీరభద్రరావు

## జ్యోతిషశాస్త్రము

గర్గజాతకము—(ప్ర.) వీరభారతి అండ్ కో, మదరాసు
గోచారదర్శిని—పి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము
జాతకపుస్తకము—ఆర్. జగదీశ్వరరావు
నవీనగోచారఫల దర్పణం—ఎ. శ్రీనివాసాచార్యులు
యోగినీజాతకము—(ప్ర.)ఆర్. జగదీశ్వరరావు, విజయనగరము

## దండకములు

కంచికామాక్షమ్మ దండకమ్—డి. ధర్మరావు
రణభేరి అమ్మవారిదండకము—యస్. జగన్నాథకవి

## నవలలు

ఇందుమతీవిజయము—వి. వెంకటశివయ్య
పెండ్లిదండ—(ప్ర.) ఎ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము
ప్రాయశ్చిత్తము— (ప్ర.) విశ్వభారతీఏజన్సి, మదరాసు
లీలావతి—యస్. కామేశ్వరరావు
శారద—సి. లక్ష్మీనారాయణ
సంజీవి—(అను.) యం. సంజీవరావు

## నాటకములు

గయోపాఖ్యానము—రామకృష్ణకవి
పద్మవ్యూహము—పి. మాణిక్యశర్మ
రాతిస్తంభము—పి. లక్ష్మీనరసింహరావు
వరూధిని—టి. వెంకటనారాయణశర్మ
విమల—టి. బాపిరాజు
సరోజిని—పి. లక్ష్మీనరసింహరావు

## నీతి

పురాణనీతికథలు, భా. ౨.— యం. రాధాకృష్ణమూర్తి

## పరిశిష్టము

అశోకవనము—పి. రామచంద్రరావు
అసత్యచరిత్ర విమర్శనము— బి. భాస్కరరామమూర్తి
ఆలమూరు గ్రామపునర్నిర్మాణ కరపత్రము—కె. ధర్మన్నకవి
ఋణబాధ— (ప్ర.) క్రిస్టియన్‌లిటరేచర్ సొసైటి, మదరాసు
కపోతకిరాతము— పి. చిదంబరశాస్త్రి
కుశలవకుద్బలచరిత్ర —(ప్ర.) కె. వరదరాజమొదలి, మదరాసు
దాంపత్యరహస్యములు—సారథి
దృఢవిశ్వాసము—హెచ్. లక్ష్మీనరసింహరావు
దోషాభాసనిరాసనము—వి. సీతారామశాస్త్రి
నిరంకుశ కవికుంజరము—(ప్ర) కె. కోదండరామయ్య, బెజవాడ

నూతనవిజ్ఞానవాచకము— బి. రామమూర్తి, యస్. యస్. సోమయాజులు
పంచభాషి—(ప్ర.) విక్టోరియాబుక్ డిపో, మదరాసు
పడకటింటిరహస్యాలు—జి. నారాయణరావు
పేరపతిసంఘములు—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి మదరాసు
పురాణమణిమంజరి—(ప్ర.) ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో. మదరాసు
ప్రపంచజ్ఞానము—జి. వి. రామమూర్తి
బాలవాచకము, ౫—యం. సుబ్రహ్మణ్యం, పి. వెంకటరామశాస్త్రి
ముగ్ధబ్రహ్మచారి— జె. మల్లపరాజు
వాదశాస్త్రము—సి. ఇ. వెంకటరామయ్య
విప్రసంకల్పసంగ్రహము—ఆర్. రామస్వామి
శారదావాచకములు, బుక్ ౭—టి. రాజగోపాలరావు
శ్రీ అక్షరమాలిక రామాయణము—యస్. వరదదాసు
శ్రీఅగస్త్యేశ్వర నిర్యాణతారావళి—యస్. లక్ష్మణమూర్తి
శ్రీఉపకారాశ్రమము—(ప్ర.) డి. వి. శివరామకృష్ణశాస్త్రి, మచిలీపట్టణము
శ్రీరామపట్టాభిషేక నక్షత్రమాల—సి. లక్ష్మణరావు
శ్రీవరహాల పద్యరత్నావళి—యం. వెంకటరాజు
శ్రీవెంకటేశ్వరభక్తవిజయము—(ప్ర.) యం. వి. రుద్రయ్య నాయుడు, తిరుపతి
శ్రీవ్యాయామవిద్యాప్రశంసా భాస్కరమాల—(ప్ర.) రామారాయవ్యాయామసంఘము, అమలాపురము
షణ్మానము—(ప్ర.) బి. వి. సుబ్బారాయుడు, ఏలూరు
సాలుసరిలెఖ్ఖలనివేదిక—(ప్ర.) గుంటూరుజిల్లా కోవాపరేటివ్ సంఘము, తెనాలి
సువర్ణకోశము—యస్. వి. రాఘవఅయ్యంగారు
సువర్ణపద గృహక్షేత్రదర్శనము—వి. కృష్ణమాచార్యులు
సూక్తిరత్నాకరము— (ప్ర.) కె. మునిస్వామినాయుడు అండ్ కో., మదరాసు
సృష్టివిస్మయ: తోటపని— బి. సత్యనారాయణ
స్త్రీవిద్యల్లకసామర్థ్యము— జె. మల్లపరాజు

## పురాణములు

మహాపురాణసారము, భా. ౧—యం. పార్వతీశ్వరశాస్త్రి
శ్రీభాగవతము, భా. ౧. — (అను.) యస్. శింగరాచార్యులు, జగ్గయ్యపేట
శ్రీమదాంధ్ర భాగవతము, దశమస్కంధము, భా. ౧. —(ప్ర.) వి. సీతమ్మ, చలపల్లి

## ప్రకృతి శాస్త్రము

ప్రకృతి శాస్త్రము, భా. ౪. —జి. వెంకటరామయ్య, బి. యస్. దత్.
బాలవిజ్ఞానశాస్త్రము, భా. ౨-క. వీరభద్రయ్య

## భూగోళశాస్త్రము

కృష్ణాజిల్లా భూగోళము—వి. పురుషోత్తం
గంజాంజిల్లా భూగోళము—యం. పార్వతీశ్వరశాస్త్రి
చిత్తూరుజిల్లాభూగోళశాస్త్రము—పి. కె. నారాయణ అయ్యంగారు
తణుకుతాలూకాభూగోళము—యం. సూర్యనారాయణ
తెనాలితాలూకా భూగోళము—యం. రాధాకృష్ణమూర్తి, టి. రామమూర్తి
పటములను అనుసరించిన భూగోళశాస్త్రము—కె. దొరస్వామిఅయ్యంగారు
ప్రపంచభూగోళము—ఆర్. శేషగిరిరావు
బళ్లారిజిల్లా భూగోళము—ఎ. కె. బాలసుందరం, డి. బాలసుందరం
రామచంద్రపురం తాలూకా భూగోళము—కె. యస్. మహాముని

## మంత్రశాస్త్రము

సకలదేవతా కైవల్యమను మహామంత్రరహస్యము—సి. చిన్నయ్య

## మతము—హిందు

అనంతవ్రతకథా—(ప్ర.) వి. కే. శర్మ, కర్నూలు
ఆకాశచక్షుర్దర్శిని—(ప్ర.) పి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము

గోత్రప్రవరలు—సి. లక్ష్మీనరసింహశాస్త్రి
జాతీయ సమష్టి ధర్మతత్వరహస్యము—పి. వెంకటకృష్ణదాసు
వాయిూ శౌచాచారనిరూపణ—ఆర్. ప్రసాదశర్మ
మానవజీవితము, భా. ౧,౨,౩,—కే. బలరామకృష్ణయ్య
శ్రీసనాతనమానవధర్మములు, బుధధర్మశాస్త్రము —(ప్ర.) సనాతనగ్రంథమాల, కొల్లూరు
షడ్వైశ్యధర్మసంగ్రహము—(ప్ర.)సి. నరసింహసిద్ధాంతి, కొల్లపూరు

## —ఇతరములు

ఆత్మసంపద— రెవ. జె. ఆలన్
ఏసునాథస్తుతి పద్యములు— కే. వీరభద్రాచార్యులు
క్రీస్తుమత నిదర్శనములు— డబ్ల్యు. హెచ్. కాంప్‌బెల్
క్రైస్తవమతదిద్దుబాటు నాటకము—(ప్ర.)యఫ్. యల్. కోల్‌మన్, రాజమహేంద్రవరము
క్రైస్తవమతబోధిని—(ప్ర.) ఆంధ్ర ఇవాంజిలికల్ లూథరన్‌సొసైటి, గుంటూరు
తెలుగుకీర్తనలు — (ప్ర.) గోదావరి డెల్టా మిషన్, చాగల్లు
తెలుగు బైబిలునిఘంటువు, భా. ౨. — రెవ్. జె. అబ్లి, రెవ్. పి. లీపెన్‌రింగ్, పి. బి. పాల్
రెండవతరగతి బైబిలువాచకము, తరగతి, ౨—(ప్ర.)ఆంధ్రఇవాంజిలికల్ లూథరన్‌చర్చ్, గుంటూరు
శూరప్రవర్తయగుయిర్మియా—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
సత్యావతారచరిత్ర—బునయన్‌జోసఫ్
సువార్తపాట—జి. సామ్యూల్

## మాహాత్మ్యము

శ్రీకార్తీకమాహాత్మ్యము—వి. సూర్యనారాయణ శర్మ
శ్రీ భద్రాచలరామచంద్ర మాహాత్మ్యము—టి. సీతారామయ్య
శ్రీచుదరుణాచలమాహాత్మ్యము—(అను.) వి. గోపాల్
శ్రీశైలమాహాత్మ్య వనస్పతిరసరసాయన సిద్ధకల్పవల్లీ—కె. వి. దత్తానందస్వామి

## రాజకీయము

సైమన్ కమిషన్ నివేదిక --- (ప్ర.) డి. కేశవరావుపంతులు, బెజవాడ

## వేదాంతశాస్త్రము

జీవన్ముక్తి—పి. నరసింహకవి
నిష్కామయోగము — (ప్ర.) టి. లక్ష్మీనారాయణ, అంగలూరు
మాయావిచారణ అను జ్ఞానప్రబోధ—బి. శేషమ్మ
వేదాంతగీతాడిండిమము—పి. నారాయణశర్మ

## వ్యవసాయశాస్త్రము

వ్యవసాయశాస్త్రము—(ప్ర.) పి. యం. మురుగేశముదలి

## వ్యాకరణ శాస్త్రము

ఆంధ్రభాషానుశాసనము— యం. సూర్యనారాయణ శాస్త్రి
శారదావ్యాకరణము—టి. రాజగోపాలరావు

## శతకములు

చెలికానిశతకము—యన్. నరసాచారి
దీనబాంధవశతకము—కె. నాగేశ్వరదాసు
శతకత్రయము—కె. వెంకటనారాయణ
శ్రీఆత్మబోధసిద్ధేశ్వరశతకము—కె. రామస్వామి
శ్రీభవానీశంకరాష్టోత్తరశతకము—కె. వెంకటరత్నం
శ్రీరామరామశతకము—ఆర్. రామదాసు
శ్రీరామశతకము—డి. లక్ష్మీనరసమ్మ
శ్రీవీరబ్రహ్మశతకము—బి. హనుమయ్య.
శ్రీవెంకటేశ్వర శతకము— జె. సుబ్రహ్మణ్యశాస్త్రి
సుమతిశతకము—(ప్ర.) యం. యస్. శర్మ అండ్ కో., తెనాలి
సుమతీశతకము —(ప్ర.) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము
హరశతకము— పి. నారాయణశర్మ

### సంగీతశాస్త్రము

గ్రామఫోన్ ప్లేట్లలో పాడిన సంగీతకీర్తనలు, భా. ౧. ౨.—(ప్ర.) వసంతాబుక్ డిపో, మదరాసు

హార్మోనియమానుభవసంగీతరత్నము — టి. యస్. శివ రామలింగం

### స్తోత్రములు

నాగపీఠికామాక్షీస్తోత్రము, నక్షత్రమాల—ఎ. వీరబ్రహ్మాచార్యులు

శ్రీకృష్ణస్తోత్రమాలామృతము—యం. కృష్ణమూర్తి

శ్రీరామనామ స్తవము — జానకిరామమూర్తి

శ్రీవెంకటేశ్వరాష్టోత్త— త్వబోధన రాజము—బి. రూపసింగ్

శ్రీసద్గురురంగేశ్వరస్తోత్రము—బి. హనుమయ్య

శ్రీశైల పూజాస్తోత్ర నామావళి—(ప్ర.) శ్రీరాజరాజేశ్వరీ అండ్ కో, నంద్యాల

### హరికథలు

భక్తివైరాగ్య దంపతుల సచ్చారిత్రము, హరికథ—జె. సుబ్బరామదాసు

### సారస్వతము

కాళిదాసుని కళాప్రతిభలు— కె. రామకృష్ణయ్య

భాషాభ్యుదయము—సి. పిచ్చయ్య శాస్త్రి

సారస్వతవ్యాసములు, భా. ౧—టి. రాజగోపాలరావు

---

# తమస్సు

శ్రీమతి చావలి బంగారమ్మగారు

కను మూసి లేచేను-వెనుదిరిగి చూచేను
కనలేదు నాజంట-వినలేదు ఆజాడ
గుండె గుబగుబలాడెను
నాగొంతు
ఎండి గుట కడదాయెను.

పిలచేను పిలచేను-అలసిపోయేను
అలసిపోయిన గుండె-అట్టెముడి విడి పోవ
ఆకాశమున కెగిరితి
అక్కడా
అంధకారమె జూచితి.

కేక వినబడదాయె-చూపు కనబడదాయె
అంధకారములోన-అట్టె రెక్కలు ముడిచి
అవనిపై నే బడితిని
అక్కడా
అంధకారమె గంటిని.

---

# సంగీతపరిషత్: గాయకమహాసభ, చెన్నపురి, 1932

ఈసభ కడచిన డిసెంబరు 23-వ తేదినుండి సంగీత పరిషత్తువారి యాజమాన్యమున గాయకమహాసభ టైగరు వరదాచార్యులుగారి యధ్యక్షతను జరుపబడెను. సభకు పెక్కుదూర దేశములనుండి సహితము ప్రతినిధులు వచ్చి యుండిరి. 24-వ తేదినుండి రాగలక్షణము, నాట్యవిద్య, తాళము మున్నగు విషయములగూర్చియు, గొందరు రచించిన సంగీతవిషయైకవ్యాసములందలి యంశములగూర్చియు చర్చలు ప్రారంభింపబడెను. డెబ్బదిరెండు మేళకర్తల ప్రస్తారక్రమము అసంపూర్తిగ నున్నదనియు, చ్యుత పంచమము చేర్చికూడ మరి 36 మేళకర్తలనేర్పరుపవచ్చునని యు నిట్లు ఒకరు చదివినవ్యాసముపై చర్చ జరిగిన పిమ్మట కాలముచాలమి మరియొక్క వత్సరమున పూర్తిగ చర్చించుటకు వాయిదావేయబడెను. అచ్చుపుస్తకములలో కీర్తనములు, గీతములు, వర్ణములు, స్వరజతులు మున్నగువానియందు కానవగు తప్పులగూర్చి వ్యాసము చదువబడెను. తాళముగూర్చియు, పూర్వపుగ్రామమూర్ఛనలగూర్చియు, ఆధునికసంగీతగ్రంథకర్తలగూర్చియు వ్యాసములు చదువబడెను. కాలము చాలనందున విం. వ. నరసింహాచార్యులుగారి "రాగపద్ధతి"గూర్చిన వ్యాసము చదువబడిన ట్లెంచిరి. 'భరతనాట్యావశ్యకత' గూర్చియు నొకదినము పూర్తిగ చర్చజరిగినపిమ్మట యీతీర్మానము లామోదింపబడెను:

## తీర్మానములు

౧. భరతనాట్యము పూర్వమునుండి ఘనతగాంచి యుండుటచే నాకళ యభ్యంతరకరమగునది కాదనియు, ప్రతివారు నాదరింపదగినదనియు నీసభవారు అభిప్రాయపడుచున్నారు.

౨. భరతనాట్యము ఇప్పుడు వేగముగ ననాదరణ పాలగుచుంటను ఈసభవారు ఆతురతతో గ్రహించి లలితకళను పోషించు ప్రతిసంఘమును, మరి జనులును, యీకళను పోషించుటకు కోరబడుచున్నారు.

3. ఈకళగూర్చి సక్రమముగా అభిప్రాయములను నివేదించి ప్రతివారు సరియగు విధమున నీకళను ఆదరించుటకు వలయుసాధనములు పేర్కొనుటకు మద్రాసు సంగీతపరిషత్తువారిని ఈసభవారు కోరుచున్నారు.

౪. ముఖ్యముగా స్త్రీసంఘములలో కళ నుద్ధరించుటకు ప్రథమప్రయత్నముగా నీవిద్య తమసంఘములలో చేర్చుటకు వలయు ప్రణాళిక చేర్చి యీకళను నిర్వహించుట భావ్యమని ఈసభవారు తలంచుచున్నారు.

## రాగలక్షణము

రాగలక్షణముగూర్చి యీవిధమగు తీర్మానములు గావింపబడెను:

### బేగడరాగము:—

ఆరోహణము: స గ రి గ మ ప ధ ప స

అవరోహణము: స నీ ధ ప, మా గ రి స

ఇంకు 'ప ని స', 'స ని ధ ని స' మున్నగు ప్రయోగములు కలవు. ఇయ్యవి ప్రాచీనప్రయోగములుగ నెంచబడెను.

### ఆరభి:—

ఆరోహణము: స రి మ ప ధ స

అవరోహణము: స ని ధ ప మ గ రి స

గ, ని, లు అల్పప్రయోగములు.

### దేవగాంధారి:—

ఆరోహణము: స రి మ ప ధ స

అవరోహణము: స ని ధా ప మా గ రీ స

ఇందు 'ప ధ ని స' ప్రయోగము కలదని యెంచబడెను. అందుచే గొందఱు 'స రి మ ప ధ ని స' అని ఇట్లు అవరోహణముంట భావ్యమనిరి. ఇయ్యది భాషాంగరాగము. పై మూడురాగములు ౨౯-వ మేళము జన్యములుగ నంగీకరింపబడెను. ఆరభి, దేవగాంధారి రాగములందలి ధైవతము చతుశ్రుతిధకన్న నధికమగునది కలదని విం. వ.




సంగీతమహాసభ, చెన్నపురి (౧౯౩౧ డిసెంబరు)

నరసింహాచార్యులుగారు సూచించినది అధ్యక్షులు అంగీకరించిరి.

దేశ్యతోడి:—

ఈరాగ మంతగ వాడబడుటలేదని ఒకరు సూచించిరి. సంగీతత్రిమూర్తులలో నొకడగు శ్యామశాస్త్రులు వారి మునిమనుమడు శ్యామశాస్త్రిగారు ఈరాగమున గల సుబ్బరాయశాస్త్రిగారి 'కమలాంబికే' కీర్తనము పాడి చూపిరి. ఇంకను కొందరు కొన్నికీర్తనముల పాడిరి. అంత ఆరోహణావరోహణము లిట్లు ఎంచబడెను:

ఆరోహణము: స గ మ ప ధ ని స

అవరోహణము: స ని ధ ప గా రి స

ఇందుగల మధ్యమము శుద్ధమధ్యమమని పెద్దలు అభిప్రాయపడిరి. కొలదిమంది ప్రతిమధ్యమము కలదనిరి. ఇది ఛాయరాగము.

వరాళి రాగము:—

కొందఱు ఆరోహణము 'స రి గ మ ప ధ ని స' అనియు, నవరోహణము సంపూర్ణమనియు నెంచిరి, కొందఱు త్యాగరాజు, క్షేత్రజ్ఞుడు, దీక్షితులు మున్నగు వారి కీర్తనలు పాడినపిమ్మట 'స రి గ రి' ఇట్టిప్రయోగములు ఈరాగమున కన్పించుటచే నీరాగముయొక్క ఆరోహణావరోహణములు సంపూర్ణాసంపూర్ణములుగ తీర్మానింపబడెను. ఇయ్యది 39-వ మేళమని ఎంచబడెను.

పంతువరాళి:—

ఈ రాగము సాధారణ గాంధారయుతముగ పాడుట కలదా? యనునంశము ముందు చర్చింపబడెను. క్షేత్రయపదములు 'పడతి నేను', 'వద్దంటే' మున్నగు నవియు నప్పుడు పాడబడెను. 'స ధ ప', 'పమగమ' మున్నగు ప్రయోగము లున్నట్లు గ్రహింపబడెను. ఈ రాగము అంతరగాంధారముతో పాడుటయె విశేషమని పెద్దలు చెప్పిరి. ఒకరు త్యాగరాజుకీర్తనములు పాడిరి కాని వారును కేవలము సాధారణ గాంధారముతో పాడియుండలేదని తలంపబడెను. తాము అం. గ. నొప్పించలేదని చెప్పిరి కాని యది సా. గ. సహితము కాదని యంగీకరించిరి. కొంత హెచ్చుగాంధారమె పాడితిమనిరి. అంత పంతువరాళిరాగము అం. గ. కలది కావున 51 వ మేళజన్యముగ నెంచవలసిన దను తీర్మానము అంగీకరింపబడెను. ఇయ్యది సంపూర్ణసంపూర్ణము.

కామవర్ధని:—

ఇయ్యది 51-వ మేళము.

సారంగ రాగము:—

ఆరోహణావరోహణములు స రి గ మ ప ధ ని స— స ని ధ ప మ రి గ మ రి స—అని ఎంచబడెను. 'సపామప' మున్నగు ప్రయోగములు రంజకములని ఒకరు చెప్పిరి. 'పధాప' ప్రయోగము బహుళముగ నున్నది. ఇయ్యది ౬౫-వ మేళజన్యము.

హామీరుకళ్యాణి:—

ఇయ్యది సంపూర్ణసంపూర్ణరాగమని యంగీకరింపబడెను. "స రి స, ప మ ప ధ ని స, ధ ప ని ధ ప ని రి స, రి మ గ మా రీ స"—ఇట్టిప్రయోగములు రంజకములుగ ఒకరు చూపిరి. 'గ మ గ రి స' ఇట్టిచోట శుద్ధమధ్యమము వచ్చునని ముత్తయ్యభాగవతరుగారు చూపిరి. ఇయ్యది ౬౫-వ మేళజన్యమని ఎంచబడెను.

యమునాకళ్యాణి:—

ఈరాగము ఆరోహణావరోహణములు స రి గ ప ధ స—స ని ధ ప మ గ మా రి స - అని అంగీకరింపబడెను. 'గ మ గ రి' అను ప్రయోగములందు శుద్ధమధ్యమము వచ్చునని సూచింపబడెను. ఇయ్యది ౬౫-వ మేళజన్యముగ నెంచబడెను.

ఎం. వ. న.



# విమర్శనము



## "ఆంధ్రప్రకాశికా" పునరుద్ధరణము

ఆంధ్రదేశమున మొట్టమొదటి వార్తాపత్రికయై 45 సంవత్సరములు జయప్రదముగ నడిచి శ్రీ ఎ. సి పార్థసారథినాయుడిగారి మరణానంతరము కొన్ని సంవత్సరములకాలము ప్రచురణము లేక అంతరించిన "ఆంధ్ర ప్రకాశిక" ప్రతి ఆదివారమున ప్రకటింపబడు ప్రజాపత్రికగ జాతీయసేవ చేయునిమిత్తము డి. యస్. రావుగారి సంపాదకత్వమున మరల గత డిసెంబరు నెల రెండవవారమునుండి మదరాసు పాతచాకలపేటనుండి ప్రచురింపబడు టెంతయు మోదావహమగు విషయము. దీనిని సంపాదకులు నిష్పాక్షిక ప్రజాహిత వారపత్రికగ చేయవలయునని సంకల్పించియుండు టెంతయు ప్రశంసార్హము. ఆంధ్రదేశ పత్రికాసామ్రాజ్యమున మహోత్సవమున అగ్రతాంబూలము నందుకొనిన ఈ పత్రిక ఆంధ్ర దేశీయుల ఆదరణ సహాయ ప్రోత్సాహములవలన వృద్ధి గాంచి చిరకాలము కొనసాగునుగాక.

---

## 'మరపురాని అన్నపూర్ణ'

వెల తెలియరాదు.

కీ. శే. శ్రీ దరిశి అన్నపూర్ణమ్మగారి ముద్రిత వ్యాసములును, కథలును, ఆమెయొక్క జీవితమునందలి గుణవిశేషములను గురించి వ్రాయబడిన మిత్రుల సానుభూతిలేఖలును, పత్రికాప్రశంసలును గల గ్రంథ మిది. అన్నపూర్ణగారి భర్తయయిన దరిశి చెంచయ్యగారు వ్రాసిన 'దురదృష్టవతులైన స్త్రీ' లను వ్యాసము రొక్క రెండుభాగములును ఇందు గలవు.

అన్నపూర్ణమ్మగారు 25 సంవత్సరముల చిన్న వయసులోనే మరణించిరి. అప్పటికే ఆమె దేశసేవ యందును, సంఘసంస్కరణయందును ఆసక్తి గలిగియుండెను. స్త్రీపునర్వివాహములయం దామె చూపిన శ్రద్ధ అనిర్వచనీయము. ఆమెకార్యదీక్ష ప్రశంసనీయము. అభిప్రాయములకు తగినంత సహాయము గూడ భర్తగారిచే బడయుచుండెను.

ఈమె వ్రాసినకథలలో చిలుక కాకి కథ తప్ప తక్కినవన్నియు సంఘసంస్కరణకై వ్రాయబడినవి. సంఘస్థితులను ఎట్లున్నవాటి నట్లే కథలలో నిమిడ్చి వ్రాయుటవలన సంఘమందలి లోపములు సులభముగా తెలియగలవని యభిప్రాయము. యథార్థస్థితిని ఎంతచక్కగ వర్ణించినను ఇట్టికథలు సంఘసంస్కరణ కుపయుక్తములగుచున్నవా? 'కావ్యధోరణి కార్యధోరణి' కావలయును. వ్యాసములు, సాంఘికరాజకీయ సంస్కరణములను గురించినవి యిందు గలవు.

వ్యాసములయందు కొన్ని సందేహములు గల్గుచున్నవి. అస్పృశ్యతను గురించి వ్రాసినభాగమున నొక వాక్యమిట్లున్నది: 'అగ్రవర్ణములవారిడు బాధలు పడజాలక నిమ్నజాతులవారు ఏక్రైస్తవమతమునో ఏ మహమ్మదీయ మతమునో స్వీకరించి సర్వమానవసౌభ్రాతృత్వము (సౌభ్రాత్రము) ననుభవించుచున్నారు.' ఈవాక్యమునందు వ్రాయబడినది యథార్థమేనా? క్రైస్తవమతమును మహమ్మదీయ మతమును స్వీకరించు హీనజాతివారికి కారణములు అగ్రజాతివారిడు బాధ లేవా? అట్లన్యమతము స్వీకరించినవారైనను 'సర్వమానవ సౌభ్రాతృత్వము' ననుభవించుచున్నారా?

మరియొకచో విడాకులచట్టమును గురించి చర్చ చేయుచు 'మనపూర్వులు విడాకులమార్గము ననుసరించి నట్లు పురాణేతిహాసములవలన తెల్లమగును' అని వ్రాసిరి. ఏపురాణమం దట్లున్నదో వ్రాసి విడాకుల నవలంబించిన వారినిగురించి కొంచెముగ వ్రాసియుండిన బాగుండెడిది.

'రాజు'

---

## i. 'గాంధిగీత'

కవి: బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు. వెల ౦-౮-౦.

'గాంధిగీత' కృతికర్తకు మహాత్మునియందు గల భక్తివిశేషమును సూచించునదై యున్నది. గాంధిజీ జీవితవిశేషములను, ఆతని రాజకీయ నైతికసిద్ధాంతములను ఈ 'గీత' ప్రస్తుతించుచున్నది. కొన్నియెడల గ్రంథకర్తకు గల దేశభక్తియు విదితమగును. వారీమణులను రాజకీయములందు మార్గదర్శినులుగ జేసెనని గాంధిజీని పొగడు గీతములు శ్రేష్ఠతమములని చదువదగును.

## ii. 'తెలుఁగుసీమ'

కవి: బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు. వెల ౦-౪-౦.

'తెలుఁగుసీమ' గీతికారూపమున నాంధ్రుల ప్రతిభను జాటునదై యున్నది. ఆంధ్రమాత స్వరూపకల్పన హైందవజాతీయత కుపాంగమే యగు నను సత్యమును జాటునట్టియు, కవివరుని కవితాశక్తిని సూచించునట్టియు నీ క్రిందిగీతిని చదువరులకు సమర్పింతును:

"భాగ్యఖని యయి భవ్యపదమయి
వరలుమాతకు భరతభూమికిఁ
దిలకరూపిణి తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!"

పై రెండుగ్రంథములును మానవాదర్శ గ్రంథ మండలియందు ౧౦, ౧౧ పుష్పములుగ ప్రకటితము లయినవి. ప్రకాశకులు: మేనేజరు, మానవాదర్శ గ్రంథ మండలి, అంగలూరు, కృష్ణా జిల్లా.

స. చం. శా.

---

## లేమొగ్గ

రామభద్రరావు భావలత ప్రకృతిచైతన్య శోభ లకుపులకించి "లేమొగ్గ"ను తొడిగింది. "లేమొగ్గే" భావుకాళి కింత పరిమళవ్యాపృత మవుతూంటే అది పూపప్రాయం గడచి తెలిమొగ్గయి రేకులరిప్పి సురభిళిస్తే ఎల్లావుంటుందో!

"మాతృకేగంటి చూపుల"కే ప్రభవించిన ఈ "లేమొగ్గ" వినమితలతికలో పాటు కృతజ్ఞతాస్నాతయై ఆమాతకే వొంగి దోయిలించి విడివడని కనులతో జోహారులు గ్రుమ్మరిస్తోంది.

ముకుళిత చేతస్కులనుచేయు "హిమసంతము" నేలమీద పక్షుల్లా అల్లాడుచున్న దిక్కుమాలిన దీనులకై పత్రములనొదిగి బాష్పకణాలటు హిమబిందువుల రాలుస్తోంది.

"కూడుగుడ్డలు కరవయి కొంప లేక
చలికి దమచాయ వడకు బీదలను గాంచి
తరులు కార్చెడి కన్నీటి ధారలటుల
పర్ణముల రాలు హిమబిందుపటలి తోచె."

కవి ఎంతటి కరుణైకముగ్ధుడో దీనినుండి తెల్లమవుతోంది.

మాతృదేశసేవాపరతంత్రలై భారతాంగనలు— ఎండ కన్నెరుగని ముగ్ధకాంతలుకూడ—విపణివీథులబడి ఒకమహాదీక్షానియతితో ఉజ్జ్వలాంగులై ప్రభవించుచూ 'తక్లి' త్రిప్పుచూ నడచుచుండ ఉద్విగ్నుడై కవి 'ఉపనిషన్మధు' వొలికిన ఈ తలాన

"చెరిగిపోలేదు తొల్లింటి జీవరేఖ
నిలిచియున్నది పుణ్యాంగనల సతంబు"

అని సమ్మోదము వెలిబుచ్చుచున్నాడు.

తన్మయత్వములో మునిగి తాత్వికత మరచి వింతగా కలికితుంగరువాట మరచి రాధికాకాంతయి భక్తి విరహము వరదకట్టి పారించాడు,

"పాడరా నాకృష్ణ
పాడు నాతండ్రి
పరమపావనగీతి
పలికేటి మురళిరా పాడరా

పాటవినుకొరటాల
బడి తేలిపోయెదను
తనువు పులకింపగా
తాండవము చేసెదను పాడరా

ఝాలు ప్రవహింపంగ
ప్రాకు లలరింపగా
ఫణులు తల లూపంగ
పసు లాలకింపంగ పాడరా

వెన్నెలలు కురుగంగ
వినువీధి తడియంగ
దిశలెల్ల నీగాన
దివ్యామృతమె నిండ పాడరా."

"అత్తింటికి పయనము" అనుపద్యము ఎంతో ముద్దుగా వుంది. ఆ భావసారళ్యము, పలుకుమాధుర్యము—కడ సారిగీతిలో-అంతర్హిత అనుభూతితో కవి హృదయానుభూతి అల్లా వ్యక్త పరచినందుకు ఆవెర్రి పడుచు Thank you very much! అన్నట్టు ఆపద్యము చదివిన ప్రతి వారికీ తట్టుతుంది.

"ఆలయకాడు మీటుచూ" పాడించు ఆ పాట పోల్చుకో లేక "వసంతోదయము" అనే గీతిలో కవి

"ఎవని రాకనుగూర్చి
ఈప్రకృతి కులుకు?
ఎవని స్వాగతమునకో
ఈచైత్రశోభ!
కనులపంటవు పేయు
కర్ణపేయంబౌను"

అనే ప్రశ్నకు తానే సమాధానమైనట్టుగా తన్మయత్వములో నిలిచిపోతాడు.

"మాతృప్రేమ" అనే కావ్యములో
"బాలువదనమునన్ భావపాశములను
చదువుకొను ప్రేయసి"

శిరము వూర్కొని ఆమె దివ్యస్థితికి జోహారుపెడతాడు.

ఈనవయుగ సమ్మేళనములో తొలికేకలు విడివడుచున్న ప్రాతః సూర్యునికి ఎత్తిన కరాలతో హారతెత్తిన ఎడదతో నిల్చిపోతాడు శ్రీరామభద్రరావు.

జ. రా.

---

## వేణీసంహారమ్

డిమ్మీ ౧౬ పుటల సైజు. ౨౨౮ పుటలు, వెల రు ౧-౮-౦.

కర్త: భట్టనారాయణ కవి.

తెలుగులిపియందు క్రొత్తగా చక్కగా ముద్రితమయిన ఆరంకముల సంస్కృత నాటకము. శ్రీలక్ష్మణసూరి విరచితమగు చూడామణి యను వ్యాఖ్య గలది. నాటకమునందలి శ్లోకములకు సూచిక గ్రంథాంతమున గలదు. ముద్రణక్రమము ముచ్చటగ నున్నది. ప్రకాశకులు వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.

---

## ఆంధ్ర హితోపదేశ చంపువు

క్రౌను ౧౬ పుటలసైజు, ౨౭౮ పుటలు, వెల రు. ౧-౮-౦.

గ్రంథకర్త: మహోపాధ్యాయ కళాప్రపూర్ణ, వేదము వేంకటరాయశాస్త్రిగారు, కీర్తిశేషులు. శ్రీశాస్త్రిగారు వెనుక కేవలము గద్యరూపమున వనువదించిన హితోపదేశమును చంపువుగా నిట్లు రచియించిరి. మూలమున

గద్యమునకు తెనుగున గద్యము, శ్లోకమునకు పద్యము. శ్రీశాస్త్రిగారి వైదుష్యము, రచనా వైచిత్ర్యము నాంధ్ర లోకము చక్కగా ఎఱిగియేయున్నది. వారు కీర్తిశేషులయ్యును, వారి యీ గ్రంథకృతి ముద్రితమయి యాంధ్రప్రపంచమున కందజేయ తోడుపడిన సుకృతులు ధన్యవాదముల కర్హులు.

ప్రకాశకుడు: వేదము వేంకటరాయన్, ౮, మల్లికేశ్వర వీధి, జి. టి. మదరాసు.

---

## విరజోపాఖ్యానము

రచయిత: చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు, ఉభయాంధ్రపండితులు, శ్రీరామా హైస్కూలు, మచిలీపట్టణము.

శ్రీ శాస్త్రిగారు, కింకపేంద్రఘటాపంచాననులు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి ప్రియశిష్యత్వమును బడసినవారనుటయే చాలును, మరి వీరి కవిత్వమును వేరుగ బ్రస్తుతింప బనిలేదు. పౌరాణికమయిన రాధాకృష్ణ చరిత్రమే యీపద్యకావ్యమున మృదుమధురశైలిని గూర్పబడినది. ఈకావ్యమును ప్రశంసించుచు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు దీనికి ఇరువదిరెండు పేజీల యుపోద్ఘాతమును వ్రాసినారు. ఇంకను పలువురు పండితుల యాదరమును బడయజాలిన యీకావ్యమును అఖిలాంధ్ర లోకము సమ్మతింపగలదు.

ఆచార్య.

# గ్రంథస్వీకారము

## అనుభవానందము

బెజవాడలోని ప్రకృతీకార్యాలయమువారి గ్రంథమాలయందలి ౧౬-వ ప్రచురణము. శ్రీమదాయుర్వేద సుధానిధి, పొత్తూరి కృష్ణంరాజయోగీంద్రసోదరులగు పొత్తూరి రామరాజయోగీంద్ర రచితము. రెండవకూర్పు, ౧౯౩౨. వెల ౦-౧౨-౦. చందాదారులకు ౦-౮-౦.

ఇందు గంజాయి, త్రాగుడు, పొగాకు, వ్యభిచారము, కృత్రిమాహారవిహారములు, నల్లమందు, మిఠాయి మొదలగువానివలన హాని కీడులును, సహజాహార విహారముల మేలును ఆవశ్యకతయు, నాగరికతయనసేమి యను సంగతియు, జ్ఞానము, హఠయోగము, రాజయోగము, అహింస, భగవంతుడు మొదలగు మహద్విషయముల గూర్చియు వివరముగ వ్రాయబడియున్నది. క్రౌను సైజున ౧౬౬ పుటలు.

---

## ముముక్షుతారకము

తెలంగున బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారిచే గూర్పంబడి వక్కలం సుబ్రహ్మణ్య అప్పయ్యశాస్త్రిగారి భార్యయగు పుణ్యవతి వెత్తి జానకమ్మగారిచే ప్రకటింపంబడినది. ఈపుస్తకము వలయువారు 'వావిలాల వేంకటశివావధానులుగారు (పింఛెను సబ్ జడ్జి), బందరు రామానాయడుపేట'అని వ్రాయవలెను. చిన్నిసైజున ౩౭ పుటలు.

---

## రామప్రియ

కథలపుస్తకము. గ్రంథకర్త, "కోటీకుటీనయ"ను వ్రాసిన తాత కృష్ణమూర్తిగారు, బి. ఏ., యల్. టి., భద్రాచలం, తూర్పుగోదావరిజిల్లా. పీఠిక డాక్టర్, బుర్రా శేషగిరిరావు, ఎం. ఏ., పి హెచ్. డి. గారిచే వ్రాయబడినది. క్రౌనుసైజున ౧౬౬ పుటలు. వెల ౧౨ అణాలు. ఇందు రామప్రియ, దాంపత్యము, భద్రాచల క్షేత్రము, కథ (?), సుశీల, తాచెడ్డకోతి, అపుత్రస్య-?, రాజా, హాస్యము, సంతానసమస్య అను ౧౦ కథలును గలవు. పైవానిలో కొన్ని "భారతి" లోను "గృహలక్ష్మి" లోను లోగడ ప్రచురింపబడియుండెను.

---

## ఆరుకోట్ల తిరుగుబాటు

గ్రంథకర్త: బి. సూర్యనారాయణమూర్తిగారు, బి. ఏ. ప్రకాశకులు: శ్రీహరిజనాశ్రమము, పొన్నమండ, తూర్పుగోదావరిజిల్లా. ఆశ్రమప్రచురణము, నెం. ౧. గ్రంథవిషయము అస్పృశ్యతాదోషనివారణ ప్రబోధము. క్రౌను సైజున ౨౦పుటలు. వెల ౮అణాలు.

---

## ఉపాయనము

ఏలూరు ఆదివారపేటలోని బొడ్డు మల్లికార్జునరావుగారిచే ప్రచురింపబడినది. వీరి జ్యేష్ఠ పుత్రుడైన చిరంజీవి నాగభూషణరావునకు మ-రా-శ్రీ, మాదా గంగరాజుగారి కుమారుడు సుబ్బారావుగారి పుత్రిక చిరంజీవిని సౌభాగ్యవతి సౌందర్యవతి నిచ్చి జరిపిన కల్యాణమహోత్సవకాలమున గావించిన పండితాశీర్వాద పద్యములను, అష్టావధానాదుల నచ్చొత్తించి "ఉపాయనము" గ పంపబడిన గ్రంథ మిది. క్రౌనుసైజున ౧౫౪ పుటలు. ముచ్చటయిన అచ్చును, అట్టయు.

---

## ఆర్యకవి కుతంత్రము

గ్రంథకర్త: సూర్యదేవర రాఘవయ్య చౌదరిగారు. ప్రథమఖండమున పంచముల చరిత్రమును, ద్వితీయ ఖండమున రామాయణ విమర్శనమును గలవు. క్రౌను సైజున ౧౩౭ పుటలు. వెల ౧ రూపాయి.

---

## రామచంద్రతారావళి

ఆదిపూడిలోని ఆఘవి నాశ గ్రంథమండలివారి ద్వితీయ కుసుమము. కర్త: దాసరి అంజదాసుగారు, ఆదిపూడి, బాపట్ల తాలూకా. క్రౌనుసైజున ౧౮ పుటలు. వెల ౧ అణా.

---

## సీతా విజయము

కర్త: దాసరి లక్ష్మణస్వామిగారు, పిఠాపురము. క్రౌనుసైజున ౧౨౩ పుటలు. వెల ౧౦ అణాలు.

---

## లోకలుబోర్డు (మాసపత్రిక)

౧౯౩౩ జనవరిది. సంపు. ౧, సంచిక ౯. చాగంటి శేషయ్యగారు సంపాదకులు. డెమ్మీసైజున ౮౮ పుటలు. చందా సంవత్సరమునకు మూడు రూపాయలు. చిరునామా: ప్రొప్రయిటరు 'లోకలుబోర్డు', కపిలేశ్వరపురం, తూర్పుగోదావరిజిల్లా.

---

## శ్రీ కోదండరామవిలాసము అను ఆనందదాసు చరిత్రము

గ్రంథకర్త: గుంటూరు మండలస్థ చాగంటి పుర వరవాస్తవ్యులగు మారూరి మహానందిరెడ్డిగారు (నందదాసు). భక్తివిషయక గ్రంథము. క్రౌనుసైజున ౧౦౮ పుటలు. వెల ౮ అణాలు.

---

## నిర్వచనభారతగర్భరామాయణము

గ్రంథకర్త: రావిపాటి లక్ష్మీనారాయణగారు, గురజాల. డెమ్మీసైజున ౬౬ పుటలు. వెల ౭ అణాలు. పద్యకావ్యము.

---

## కవిత్వము – దారిద్ర్యము

గ్రంథకర్త: వి. రామసుబ్బరాయుడుగారు, బి. ఏ., హెడ్మాస్టరు, శ్రీరామసురభి లక్ష్మీరాయ మిడిల్ స్కూలు; ప్రెసిడెంటు, స్నేహలతా కవితా సంఘము, కొల్లాపురం, జటప్రోలు సంస్థానము. డెమ్మీ సైజున ౪౭ పుటలు. వెల తెలియదు.

---

## జానకీపతి శతకము

అభినవ సరస్వత్యనుబంధము ౫.౨. గ్రంథకర్త: వాజపేయయాజుల రామసుబ్బారాయడుగారు, బి. ఏ. డెమ్మీసైజున ౧౬ పుటలు. వెల తెలియదు.

---

## ఆరోగ్యమాధవము

కర్త: వాజపేయయాజుల రామసుబ్బారాయడుగారు, బి. ఏ. గద్యపద్యాత్మకము. క్రౌనుసైజున ౩౦ పుటలు. వెల తెలియదు.

---

## విప్రనారాయణ నాటకము

(ఐదంకముల సాంఘిక నాటకము.) బళ్లారిలోని శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలయందలి ౬-వ పుష్పము. గ్రంథకర్త: రూపనగుడి నారాయణరావుగారు, క్రౌను సైజున ౧౫౦ పుటలు, వెల ౧౨ అణాలు.

---

## కథాగుచ్ఛము

కర్త: కొడాలి సత్యనారాయణరావుగారు. ప్రకాశకులు: కాసంశెట్టి కృష్ణమూర్తిగారు, ప్రొప్రయిటరు, కా. శేషగిరిరావు అండ్ బ్రదర్సు, ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా. క్రౌనుసైజున ౮౯ పుటలు. వెల ౦-౧౨-౦. దీనికిని విశ్వనాథ సత్యనారాయణగారు ఉపోద్ఘాతము వ్రాసిరి. ఇందు, మనుచరిత్రము, ఆముక్తమాల్యద కథలు గలవు.

---

## వీరగాథలు

కర్త: ఆకుండి వెంకటశాస్త్రిగారు, తెలుగుపండితులు, మద్రాసు సేవాసదనము హైస్కూలు, చేట్‌పట్. ప్రకాశకులు: శ్రీవ్యాసనికేతనము, ఆర్యాపురం, రాజమహేంద్రవరము. క్రౌను సైజున ౬౪ పుటలు. వెల ౪ అణాలు. ఇందు ఘటోత్కచ భీమసేనులు, సౌప్రోబురస్టములు, భీమసేనహనుమంతులు, అభిమన్యుడు, పరశురాముడు, అను కథలు కలవు.

---

## నా ఎలెక్షను అనుభవము

గ్రంథకర్త: యద్దనపూడి వెంకటరత్నం పంతులుగారు, తాడేపల్లిగూడెం. క్రౌనుసైజున ౧౪౪ పుటలు. వెల తెలియదు.

---

## శ్రీ కృష్ణభారత ప్రాశస్త్యము

కర్త: వాజపేయయాజుల రామసుబ్బారాయడు గారు, బి. ఏ. గ్రంథప్రశంస. క్రౌను సైజున ౨౨ పుటలు. వెల తెలియదు.

---

## శ్రీ సీతారామస్మరణ

నక్షత్రమాల. కర్త: కంచెర్ల వేంకటహనుమయ్య గారు, టీచరు, బి. హెచ్. ఇ. స్కూల్, పెరువాళ్లపల్లె, వినుకొండతాలూకా. చిన్నిపొత్తము. ౧౧ పుటలు.

---

## మచిలీపట్టణ బ్రాహ్మసమాజము: అర్ధశతాబ్ద వృత్తాంత నివేదిక

క్రౌను ౫౪ పుటలు.

---

## హనుమానుడు

కర్త: కొడాలి సత్యనారాయణరావుగారు. గుంటూరులోని ఆంధ్రక్రైస్తవ కళాశాలయందు అధ్యాపకులుగ నున్న శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, ఎమ్. ఏ. వ్రాసిన తొలిపలుకు ఇందు గలదు. పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులో ఎడ్యుకేషనల్ పబ్లిషర్సుగ నున్న పాలిపేరరాజుగారివద్ద గ్రంథములు దొరకును. క్రౌనుసైజున ౧౦౨ పుటలు. వెల ౭ అణాలు.

---

## మిలన్

శ్రీ రామనరేశత్రిపాఠిగారి హిందీగ్రంథానువాదము. అనువాదకర్త: అష్టావధాని కాళహస్తి వేంకటనరసింహారావుగారు, ఈమని, గుంటూరుజిల్లా. పద్యకావ్యము. క్రౌనుసైజున ౫౩ పుటలు. వెల తెలియదు.

## శ్రీమన్మహారాజ సంస్కృత మహాపాఠశాలా (త్రైమాసికీ) పత్రికా

సంస్కృతము. సంపు. ౬, సంచికా ౪. అక్టోబర్ ౧౯౩౨. సంపాదకుడు, హెచ్. యోగనరసింహార్యః, ఎమ్. ఏ., శ్రీమన్మహారాజ సంస్కృత మహాపాఠశాలాధ్యక్షః, మైసూరు. డెమ్మీసైజున ౪౦ పుటలు.

---

## My Spiritual Dream

ఆంగ్లము. కర్త: ఎ. కె. మునిగారు. పెకోర మాన్ ఆఫ్ గాడెస్ ఇండియా గ్రంథమాల, మద్రాసు. మనోరంజనీప్రెస్ యందు ముద్రితము. క్రౌనుసైజున ౧౬ పుటలు. వెల ౨ అణాలు.

---

## Kriparam's Film Review

వారపత్రిక, ఆంగ్లము. సంపు. ౧, సంచిక ౬. బొంబాయి, ౧౭ డిసెంబరు ౧౯౩౨. సంవత్సర చందా ౩ రూపాయలు. విడిప్రతి ౩ అణా.

---

## Scrutator

ఆంగ్లము. వారపత్రిక. నెల్లూరునుండి వెలువడుచు, జాతీయ అంతర్జాతీయ సమస్యలను చర్చించునది. పి. యస్. ఆర్. ఆంజనేయులుగారు, మేనేజింగ్ ఎడిటరు. జార్జిజోసెఫ్‌గారు, ఎమ్. ఏ., బ్యారిష్టరు, కన్సల్టింగ్ ఎడిటరు. సంపు. ౧, సంచి. ౪, ౫. ౨౩-౧-౩౩. సంవత్సర చందా ౫ రూపాయలు, విడిసంచిక ౧ అణా.

---

## మ న వి మా ట లు

### శ్రీ వేంకటేశ్వరాయుర్వేద కళాశాల, తిరుపతి

తిరుమలతిరుపతి దేవస్థానపరిపాలనమున నీకళాశాల కొన్ని యేండ్లక్రిత మారంభింపబడి నాటినుండియు చక్కగ నిర్వహింపబడుచు వచ్చినది. దీన శిక్షబొంది పట్టములను గడించిన విద్యార్థులు పలువురు నేడు దేశమున నచ్చటచ్చట సొంతముగ నౌషధశాలలను స్థాపించియు, స్థానికసంస్థల నుద్యోగములను గడించియు ప్రజాసేవ గావించుచున్నారు. ఈకళాశాల కనుబంధముగ నొక ఔషధశాలయు నడపబడుచుండి పలువురకు-అందు ముఖ్యముగ దేశదేశములనుండి వచ్చు యాత్రికులకు-మిక్కిలిగ నుపయోగించుచుండినది. కాని యేకారణముననో కాని యీయౌషధశాలకు కడచిన యేట స్వస్తి చెప్పబడినది. ఇట్టి సేవాసంస్థలను స్థాపించి యాత్రికులకు పలువిధముల సౌకర్యముల నొనగూర్పవలసిన మహంతుగారే దీని యంతమునకు పూనినందున దేశములో చాల అలజడి కలిగినది. దీనికి తోడు నేడు కళాశాల నుగూడ మూసివేయ తీరుమానించినటుల వార్తలు తెలియవచ్చినవి. ఇందువలన ప్రజలయందును, ఆయుర్వేదవిద్యాభిమానులయందును మరింత యలజడి గలిగినది. ప్రభుత్వము వారే ఆయుర్వేదవిద్య నాదరించుచున్న యీ తరుణమున మహంతుగారు ఇట్టిపనికి బూనుట ధర్మ మనశెల్లదు. ఇదియు నొకవ్యయకర్తనమా, అనవసరమయిన వానిని నిలుపుట వ్యయకర్తనమగుగాని? ఇప్పటికిని మించినది లేదు గాన మహంతుగారు ఈకళాశాల నెప్పటితీరున నడపజూచుట, ఆపివేసిన యౌషధశాలను మరల నెలకొలుపుట స్వధర్మపరిపాలన మగును.

---

### శ్రీ కాళ్లకూరి గోపాలరాయసన్మానము

గోపాలరావుగారు పండితులు, కవులు, అనేకకృతులకు కర్త లనిపించుకొని భాషాసేవ చేసినవారు. వీరి కృతులలో నెల్ల నుత్తమన బరగినది 'వాల్మీకి'. వీరి ప్రజ్ఞావైశారద్యముల గాంచవలయునన్న 'వాల్మీకి' యందే గాంచనగును. ఈమహామహుని యీభాషాసేవను గుర్తించి వీరి నితోధికభాషాసేవకై ప్రోత్సహింప నాంధ్రప్రపంచము పూనినది. ఈపూనికయందు నెల్లూరి యాంధ్రసభవారు మొదటిచేయి చూపి స్వధర్మమును నెరవేర్చిరి. ఈసభవారి 'వాల్మీకి' నాటకప్రదర్శనమునందలి రాబడియంతయు గోపాలరావుగారికి సమర్పింప నేరుపాటు. కేవల మీరాబడి యేపాటి యుండగలదు? ఇందులకయి మరికొంద రాంధ్రప్రముఖులు వీరిపేర నొకనిధి నేరుపాటుచేసి ఆంధ్రోదారులనుండి విరాళముల నభ్యర్థించినారు. ఉదారు లిప్పట్టున వీరియభ్యర్థనమువంకకు దృష్టిని మరల్చి తన్మూలమున భాషాసేవను గావించుట ధర్మము. గోపాలరావుగారును

ఉదారుల యాదరమున మరింత భాషాసేవను జేయ గడంగ నవకాశము గలుగును.



దక్షిణభారత హిందీ ప్రచారసభ, చెన్నపురి

హిందీభాష నిఖిలభారత దేశైకభాష కావలయునని నిశ్చయింపబడినపిదప దానిని దక్షిణభారతదేశమున వ్యాపింపజేయుటకయి పదునాలుగేండ్ల నాడు దక్షిణభారతహిందీ ప్రచారసభ చెన్నపురమున నెలకొనినది. అది నాటినుండి క్రమముగ దన యాశయము నకు రూపము నొసగుచు దేశ శ్రేయోదాయకములగు విద్యాసంస్థలలో పరిగణనార్హతను బడసినది. బహుముఖముల దేశీయులకు హిందీయెడ నభిమానమును, అభిరుచిని గలిగించి, పెక్కురకు దానిని బోధించినది. పట్టణములవారే కాక పల్లెలవారును విరివిగా హిందీ నభ్యసించుచున్నారు. కొందరు పండితులు నగుచున్నారు. పురుషులకంటె స్త్రీలు ద్విగుణోత్సాహముతో చదువుచున్నారు. దేశీయులలో నిప్పటి కయిదున్నర లక్షలు హిందీ నేర్చినారు. వారిలో నాల్గులక్షలమందికి వ్యవహారజ్ఞాన మలవడినది. కడచిన పది యేండ్లనుండి పరీక్షలలో కృతార్థులయినవారు ఇరువదిమూడువేలమంది గలరు. ప్రకృతము పరీక్షాకేంద్రములు మూడువందల కెక్కుడుగ నున్నవి. ఇందు రెండువంతులు గ్రామకేంద్రములు. మూడువందలమంది నానాస్థలముల ప్రచారమును గావించుచున్నారు. వీరిలో, సగముమంది ఆంధ్రరాష్ట్రమునకు చెంది యున్నారు. తక్కిన కేరళ, కర్నాటక, ద్రావిడరాష్ట్రముల నొకటికంటె నింకొకటి వ్యాప్తిప్రచారములు తక్కువగా నున్నవి. ఇం దాంధ్రదేశ మగ్రస్థానమును గాంచినది. ఆంధ్రు లానందింతురుగాక!

'హిందీ' అభ్యాసము సుకర మగుటకయి యీసభ పెక్కుగ్రంథములను నాలుగు ప్రధానరాష్ట్రభాషలయందును ప్రకటించినది; పరీక్షలయందు విజయమును గాంచినవారికి పట్టముల నొసగుచున్నది; ప్రచారకుల సమావేశములను కూర్చుచున్నది. ఈ సభ యిట్లే ఎడతెగని దీక్షతో పనిచేయుచుండునేని హిందీ నిఖిలభారతదేశభాష యగుట సుసాధ్యము కాగలదు. భారతదేశమునందలి ఎల్లరాష్ట్రములవారును పరస్పరభావములను సౌహార్దముతో గ్రహించి మెలగుట కవకాశ మప్పుడధికముగ లభింపగలదు. తద్ద్వారమున దేశాభ్యుదయము ప్రాపించుట నిక్కము. ఈ సభ నెలకొనిననాటినుండి హిందీ కిట్టి వ్యాప్తిని గలిగింప గట్టి పూనికతో పనిచేయుచున్న సభానిర్వాహకు లెల్లరు నభినందనార్హులు.



బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల
వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తిమహోత్సవము

పందొమ్మిదవ శతాబ్ది చివరపాదమున జీర్ణప్రాయముగ నుండిన యాంధ్రకవితా సామ్రాజ్యము నుద్ధరించి దేశమునం దంతటను

విజయపతాకలను నెలకొలిపిన పండిత కవి సార్వభౌములు శతావధానులు శ్రీ తిరుపతి వేంకటకవులు. వీరి సరసశిల్పనైపుణిచే కవితాలతాంగి నవ్యాలంకారభూషితయు, నూతనోత్సాహభరితయు నయి క్రొత్త పోకడలతో సహృదయహృదయరంగముల కెక్కి నర్తనము చేయదొడగినది. ఆంధ్రదేశమున పలువురీమహామహులకు వరివస్య సలిపి తదనుగ్రహమున కవులు, పండితులు నయి పేరున కెక్కిరి. నేడీనాట శ్రీ శతావధానుల శిష్యులు, ప్రశిష్యులు ననంఖ్యాకులు గలరు. ఇట్లాంధ్రవాణికి పుష్టినిగూర్చి, యాంధ్రులకు సాహిత్యకవిత్వసంపదల ననుగ్రహించి శకపురుషులన మించిన శ్రీ తిరుపతి వేంకటకవుల పవిత్రనామము లాంధ్రుల కెల్లరకును నిరంతరస్మరణ మననయోగ్యములు.

ఇటీవల నాంధ్రులు నూతనోత్సాహభరితు లగుచుండుట హర్షింపదగినది. తత్ఫలముగ వారు తమ దృష్టిని సారస్వతముపై పునకును మరల్చినారు. కొందరు సాహిత్యమును, కొందరు కవిత్వమును, కొందరు విమర్శన శక్తిని సాధింప నమకట్టినారు. మరికొందరు యథాశక్తిని కవిపండితపోషణము నొనరించి ధన్యులగుచున్నారు. ఇట్లెల్లరు నేదో యొక విధమున నవీనమార్గముల నవలంబించి సారస్వతాభివృద్ధికి పాటుపడుచున్నారు. ఇది యంతయు నాంధ్రవాఙ్మయాభ్యుదయమునకు నిదర్శనము కాగలదు.

ప్రకృతము బందరుపౌరులు శ్రీ వేంకటశాస్త్రిగారికి షష్టిపూర్తి మహోత్సవమును సంకల్పించియుండుట హర్షింప దగినది. సకలాంధ్రప్రపంచమును నీయెడ తత్సంకల్పమునకు దోహదమును గూర్చి దానిని సర్వలక్షణసంపన్నముగ నిర్వహించి కృతకృత్యతను గాంచవలసియున్నది. ఈమహోత్సవముతోపాటు ఆంధ్రవిశ్వవిద్యాలయములో శ్రీ వేంకటశాస్త్రిగారి పేర నొకపతకమును నెలకొలుపుటకును, వారి గ్రంథములను సంపుటములుగ ప్రకటించుటకును గొందరి సూచనలు గలవు. ఈ సూచనల సామంజస్యమును వేరుగ జెప్ప బని యుండదు. శతావధానులు తమ కొనరించిన మహోపకృతికిని, తమకు వారియందు గల యనూనగురుభక్తికిని అర్హమగు శాశ్వతజ్ఞాపకచిహ్నము నీరీతి నెలకొలుపుట సముచితము; ధర్మము. కాని యీ షష్టిపూర్తి మహోత్సవము దక్క దక్కిన యే స్మృతిచిహ్నమైనను తిరుపతివేంకటకవు లిరువురి పేరను వెలయవలయు గాని యొకరి పేర మాత్రము వెలయుట సముచితము గాజాలదు. తిరుపతివేంకటకవుల యవినాభావ మాంధ్రవిద్వల్లోకము గుర్తింపనిది కాదు.

'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అన్న రీతిని ఆంధ్రలోకమంతయు తిరుపతివేంకటకవిద్వదుచ్ఛిష్ట మనదగును. 'శిష్యులము, ప్రశిష్యులము, తత్పరంపరలోనివారము' అనువారు నేడాంధ్రలోకమున పందలాదిగ గలరు. వారిలో పలువురు శ్రీమంతులును. శతావధానులవలన

సాహిత్య కవిత్వసంపదలను కొల్లగొనినవారు కేవలము వారివేర నొకపతకమును నెలకొలుపుట, పుస్తకముల నచ్చొత్తించి యిచ్చుట అనునది అల్పమాత్రాభ్యర్హణము కాగలదు. మీదు మిక్కిలి ఉభయుల తాహతునకును చాలునది కాజాలదు. కనీస మేలుట రెండు విద్యార్థివేతనముల నయినను నెలకొలుపుట సముచితము. ఇవి యిరువురు విద్యార్థులకు— ఒకటి 'ఉభయభాషాప్రవీణు'నకు, మరియొకటి తెలుగు బి. ఏ. కు—ఆంధ్రసాహిత్య, కవిత్వ తత్త్వపరిశీలనమునకయి యుద్దేశింపబడవల యును. దీన నేటేట నిరువురు విద్యార్థులను సాహిత్యకవిత్వతత్వ పరిశీలనమున తయారు చేయుట సమకూడును; ఆంధ్రవాఙ్మయమును మరింతి యభివృద్ధిని గాంచుట కవకాశము లేర్పడగలవు; తిరుపతివేంకటకవి శతావధాని ద్వయమునామమును దేశము, వాఙ్మయము నున్నంతకాలము నిలిచియుండగలదు. ఇట్టిది శతావధానులు వాఙ్మయమున కొనరించిన సేవకు తగిన ఫలము. ఇట్టి తచ్ఛిష్య ప్రశిష్య పరంపర కావింపదగిన గురుపూజనము.

---

## హిందీ - నాగరిలిపి

౧౯౩౨-వ సంవత్సరము డిసెంబరు కడపట దక్షిణభారత హిందీప్రచార సభ (చెన్నపురి) జరిపిన రెండవ పట్టప్రదాన మహోత్సవ సమయమున నుపన్యసించిన ప్రొఫెసరు షుప్టరి గారు "హిందీభాషకు నాగరిలిపి బాగుగనే యున్నది" అని అంగీకరించియు, "ఐరోపీయులును, మహమ్మదీయులును దానిని వాడుట సులభము కాకున్నది. కావున కొంతకాలము వరకు రోమన్ లిపిని-అనగా ఆంగ్లభాషవ్రాయు లిపిని-వాడుట అవసరము. దీనిని వాడినచో మహమ్మదీయులును, ఐరోపీయులును త్వరగా హిందీని నేర్చుకొనగలుగుదురు.........హిందీని వ్రాయుటకు రోమన్ లిపిని వాడినచో ఉద్యమము శీఘ్రముగా ప్రబలును" అని యొక సలహా నిచ్చినారు. వీరి సలహా ప్రశ్నాంతరము. నాగరి లిపికంటె భిన్నమయిన లిపి లేకున్న హిందీభాష దేశసామాన్యభాష యగుట దుర్ఘట మనువారును గలరు.

సకలభారతదేశ భాషలును సంస్కృత మాతృకము లనియు, కావున నవి పరస్పర సంబంధ సాదృశ్యము కలిగియున్న వనియు ననేకులు భాషాతత్త్వవిదు లంగీకరించి యున్నారు. అటులయ్యు భాషలు తమ ప్రత్యేకతను కోలుపోవక క్రమవృద్ధిని గాంచుచున్నవి. ఏ కొన్నిటికో తప్ప, తక్కినవాని కన్నిటికి ప్రత్యేకము లిపులు గలవు. వీని మాతృకయగు సంస్కృతమునకు అసంస్కృత పూర్వరూపమును కనుగొనుటకు వివిధ మార్గముల పరిశోధనములు కొనసాగుచున్నను ఫలము వివాదగ్రస్తముగనే నిలిచియున్నది. భాషాస్వరూపనిర్ధారణమే యిట్లుకాగా లిపినిర్ధారణముమాట చెప్పబనిలేదు. కాని సంస్కృతమునకు లిపి నాగరియని యొక వాదము కలదు. దీని నంగీకరించిన హిందీకి లిపియే లేదనవలెను.

అయిన, హిందీమరాఠీభాషలు రెండును నాగరి లిపియందు వ్రాయబడుచున్నవి.

సాధారణముగా ఏభాషనయిన నేర్చుకొనువారాభాషకు గల లిపిని నేర్చుకొందురు కాని, దానిని త్రోసిపుచ్చి క్రొత్తలిపిని కల్పించుకొనజూడరు. భారతీయులందరు ఆంగ్లమును చదువుచున్నారు. వారిలో నాగరిలిపిని వాడుట సులభము కాదనుకొను నాంగ్లేయేతరులగు ఐరోపీయులు, మహమ్మదీయులు, ఇతరులు ననేకులు కలరు. వారెల్లరకు నాంగ్లభాష నేర్చుకొనుటకయి యొక క్రొత్తలిపి కల్పింపబడినది కాదు. అంతేకాక ఒక్కలిపితో పెక్కుభాషలు ప్రవర్తిల్లుచున్నవి; కాని ఒక్కభాషకు పెక్కులిపు లుండుట కానరాదు. కావున నట్టితలంపయినను వింతగా తోచకమానదు. మీరుమిక్కిలి త్వరలో హిందీభాష భారతదేశసామాన్యభాష కావలయునని కోరినచో నాగరిలిపియే యొప్పినది. ఏభాషనేని నేర్చుకొనుటకు లిపి ఎన్నడును అడ్డుతగులదు. హృదయము లడ్డుతగులుచో దానికి నిష్కృతి లేదు.

---

కీ॥ శే॥ శ్రీ జనమంచి వేంకటరామయ్యగారు

౧౯౩౨ డిసెంబరు ౨వ తేదికి అఱువది వత్సరాల జీవితము గడచి, ఈవత్సరము (౧౯౩౩) జనవరి ౧౯ వ తేది శ్రీ జనమంచి వేంకటరామయ్యగారు (రాజమహేంద్రవరము స్వగృహమున) పరమపదించినారు. అఱువది వత్సరాలమనిషి సారస్వతములో దీక్షితుడై ఉన్నాడంటే సాధారణముగా ఆతడు ఏ పూర్వఫక్కి వ్రాతలోనో రుచిమరగి నవీనధోరణులకు మడి కట్టుకునే ఉంటాడనిపిస్తుంది, మనము ప్రయత్నించకుండానే. కాని శ్రీ వేంకట



కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు

రామయ్యగారు నవీన రచనలకు చవి గొనడమే కాకుండా తమ రచనలలో నూతన ఫక్కికి సౌహార్దము ప్రసాదించారు, పూర్వఫక్కికి వైరుధ్యము నిలవనీక. వారి రచనలలో చూపుపట్టిన ఆధునికత కంటెను కూడా, వారి సంభాషణలలో నిజముగా ఆధునిక సారస్వత గతుల యెడలా, వాని చిరసౌభాగ్యము నెడలా వారి సంభావన, ఆశ ఉజ్జ్వలముగా వెలుగుతూ కానవచ్చేవి. వారు తెలుగులో కవి, పండితుడు కావడమే కాక, ఆంగ్లములో మంచి

కావ్యపరిచయము వారి సంస్కృతికిగాను పెద్ద సంపత్తి. సంస్కృతభాషనుండి మాలతీమాధవము, ఉత్తరరామచరిత్రము, విద్ధసాలభంజిక, మేఘసందేశము తెలుగులో తర్జుమా చేసినారు. ఇది వారి రచనల జాబితాగానే తీసుకోవలెనంటే ఇంకా చేర్చవలసి ఉంటుంది: తెలుగులో 'నవకుసుమాంజలి' అని ఒక స్వతంత్ర కావ్యాలసంపుటము. మఱి పదియేను కావ్యాలు ఒకసంపుటముగా రానున్నవట. నిజానికి సంస్కృతనాటకాల తర్జుమాలూ కొన్ని యింకా ప్రకటితములు కాలేదు. వారి కావ్యరచన సరళము, ధారాళము, ప్రసన్నము; సౌమ్యసుందరమైన భావముతో అలరారుతూ ఉంటుంది. తర్జుమాలలో, అది స్వతంత్ర రచనయేమో అనిపించే సామగ్రి వీరిమొక కన్పట్టేది తరుచుగా దొరకదు.

కావ్యములోనే కాక నాటకములో కూడా స్వతంత్రముగా చేయి నడపిద్దామనేది వీరి తుది ఉద్యమాలలో ఒకటి. ఈనడుమ భారతిలో ప్రకటించిన 'పతిపత్నుల సరస సల్లాపము'లను వెన్నంటి ఒక సాంఘిక నాటకము వ్రాయవలెనని సంకల్పించి ఉండిరి. ఈ సంచికలో పడ్డ 'ముగల్ సామ్రాజ్యపతనము' అనే కావ్యములో ఒకచోట 'బ్రిటిష్ సామ్రాజ్య వైభవము' అంటూ వ్రాయదలచుకొన్నట్టు చెప్పి ఉన్నారు. కాని యివి రెండూ, బహుశః మఱి కొన్ని సంకల్పాలతో పాటు, మన లోకములో నెఱవేఱ దలచుకోలేదు.

రచించి ఉంచినవైనా ప్రకటించే యేర్పాట్లు జరిగితే, ఒకకవి కావ్యజీవితము సంపుటము కట్టి భండారములో ఇక విసరివేయవచ్చును. తమ జీవితములో ౪౨ వత్సరాలు పెద్దాపుల వారు ఉపాధ్యాయులుగా ఉండిరి. ఉత్సవపులలో ప్రసిద్ధులై ఉన్న ఆంధ్రు లనేకులు వారికి శిష్యులు. అటుపై వారు కవిగా ఆంధ్రలోకమునకు పరిచితులు. వీరి నిర్యాణము ఆంధ్ర లోకమునకు శోకకారణము.

---




ప్రపంచపరిస్థితులు విషమావస్థను బడయుచున్నవి. అనేకరాజ్యములందు స్థిరప్రభుత్వములు దుర్లభములుగ నున్నవి. జర్మని ప్రభుత్వములు నాలుగుసారులు మారినవి. నాజిపక్షమునకును, కమ్యూనిస్టుపక్షమునకును ఘోరమైన సంరంభము ప్రవర్ధమానం బగుచున్నది. జర్మనుదేశ మొకవైపునను రుష్యా కమ్యూనిస్టు ప్రాబల్యమునందును, ఒకవైపున ఇటలీ ఫాసిస్టు ప్రాబల్యము నందును, ఒకవైపున దుర్భరపరాజయ దారిద్ర్య దుఃఖము నందును మునిగి, కర్తవ్యనిర్ణయము దుస్తరముగ చేయుచున్నది. హిట్లరుగారిటలీయందు ముస్సలోనివలెను నిరంకుశ సర్వాధికారమును బడయుటకు చేయుచున్న ప్రయత్నములు సఫల మగుటకు సూచనలు పొడకట్టుచున్నవి. మార్చి 5-వ తేదిని జరుగనున్న యెన్నికలు కొంతవరకును జర్మను అదృష్టమును నిర్ణయింపగలవు. ఈలోపుగను కమ్యూనిస్టు పక్షమును హతమార్చుటకు హిట్లరుపక్ష మవలంబించుచున్న నిర్బంధ దండవిధానము సకల విధములను నిరసనార్హముగ నున్నది. హిట్లరు పక్షమువారి చర్యలు తిరిగి జర్మనీయందు సైన్యాధికార ప్రాబల్యమును నిగూఢమును జేయ సమకట్టుచున్నటులు వదంతులు గలవు. సంగ్రామ మహాదుఃఖానుభవము సైన్యసంస్కారవర్ధితమైన జర్మను హృదయమునందు పరివర్తనమును గలుగజేయని విధమును నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. జర్మను భయపీడితమైన ఫ్రాన్సుదేశమునకు జర్మనువ్యవహారములు కోపావేశమునకు గారణములై సైన్యరక్షణవ్యవహారములకు సకల శక్తులను వినియోగించుచున్నది.

ఫ్రాన్సుదేశము అమెరికాకీయవలసిన అప్పు వాయిదా సొమ్ము నిచ్చుటకు నిరాకరించినను సైన్యవ్యయము మాత్రము తగ్గుట లేదు. ఆర్థికసంస్కారణము లే దేశమునందును సైన్యవ్యయభారము తగ్గనంతవరకును సాధ్యములు గావు. దేశక్షేమమునకు సైన్యమును, సైన్యమునకు ద్రవ్యమును, ద్రవ్యమునకు పన్నులును సాధనములైనపు డీవిషమవృత్తమున కార్యాంతరములు దుర్లభములు. ఆయుధవిసర్జనము చేయవలసిన యవసరమును నంగీకరించుచు నుచితరీతిని చేయవలయునని చెప్పుట ప్రయోజనకరము గాదు. ఎవరికివారే

తరరాజ్యముల ప్రయోజనములకును వినియోగపడుటలేదు. ఆయుధవిసర్జన సందర్భములందును, నష్టపరిహార సందర్భములందును నీవిషయము విస్పష్ట మగుచున్నది. మహారాజ్యము లన్నియును వారి రాజ్యభారమునకవసరమైన ఆయుధధారణమును చేయుచున్నటులును, అంతకన్నను తగ్గించుటకు వీలు లేనటులును ప్రకటించుచున్నవి. జపాను ప్రత్యక్షముగను మంచూరియాయందు యుద్ధప్రస్థానమును జేయుచున్నది; నానాజాతిసమితి చేసిన నిర్ణయములను ప్రతిఘటించుటకు బూనుకొనుచున్నది. నానాజాతిసమితి జపాను వాంఛితముల నామోదించనపుడు సమితినుండి విడిపోవుటకును నిశ్చయించినటులు ప్రచురింపబడినది. ధర్మాధారము లేని సమితినిర్ణయములు ధర్మరక్షణమునకు నిరుపయోగము లగుటయందు విచిత్రము గనుపడదు. బ్రిటిషు రాజ్యాధికారు లీప్రళయావస్థయందు మౌనముద్రను వహించుట ధర్మముగాదు. జపాను రాజ్య మాసియాఖండనాయకత్వమును బూనుటకు చేయుచున్న విశ్వప్రయత్నములకు ప్రతిఘటనమును బూనవలసిన భారము బ్రిటిషు సామ్రాజ్యముమీాద నున్నది. బ్రిటిషుసామ్రాజ్యాధికారులు ధర్మరక్షణమునకే కాక ఆత్మరక్షణమునకును నీమార్గము నవలంబించుట యవసరమని సామ్రాజ్యపరిస్థితులు విస్పష్టము చేయుచున్నవి.

* * *

### బ్రిటిషు సామ్రాజ్యము

బ్రిటిషుసామ్రాజ్యమును బంధించిన పాశబంధములు శిథిలము లగుచున్న విధమును సామ్రాజ్యవ్యవహారములును, సామ్రాజ్యాంతర్భాగముల వ్యవహారములును వేయినోళ్లను చాటుచున్నవి. జాతీయప్రభుత్వ మవలంబించుచున్న నిర్బంధవిధానము సామ్రాజ్యమునందంతటను ధర్మహానిని గలుగజేయుచున్నది. కార్మికనాయకుల దండనము, వ్యాపార రక్షణవిధానము, పన్నులభారము, వ్యాపారపరిశ్రమల క్షీణత్వము, కన్సర్వేటివుపక్ష ప్రాబల్యము, సామదానములకు నిరాదరణము బ్రిటిషు రాజ్యాధికారుల నావహించిన భయభ్రాంతులకు నిదర్శనము గాని సాహసధైర్యములకు నిదర్శనము గాదు.

ఐర్లాండు ఎన్నికలందు డివెలెరాగారి పక్షమునకు సంపూర్ణ విజయము గలిగినది. ఐర్లాండు సామ్రాజ్యమునుండి విడిపోవుటకు సిద్ధముగ నున్నది. పరిషియా ప్రభుత్వము మట్టినూాసె యొడంబడికను మార్పుచేయుచున్నది. ఫ్రాన్సుదేశము బ్రిటిషుప్రభుత్వోద్దేశముల ననుమానించుచున్నది. ఈజిప్టునందెప్పటివలెనే అవిశ్వాసము ప్రబలుచున్నది. ఒటావాయొడంబడిక పేరునకు సామ్రాజ్యవ్యాపారరక్షణము చేసినను క్రియకు వ్యాపారరక్షణవిధానమును శిథిలము చేసినదని సహాయకార్యదర్శి హోరు బెలిషాగారు తెలిపిన యభిప్రాయము సార్థకమగుచున్నది. బ్రిటిషు

ప్రభుత్వము హిందూస్థానముపట్ల చూపుచున్న నిరాదరణ స్వభావమును మూడవ రౌండు టేబిలు సభాసమావేశము, ప్రభుత్వాధికారుల ప్రసంగములు, రాజప్రతినిధి ప్రసంగము, దేశావృతమైన నిర్బంధవిధానము, ఇతర వ్యవహారములు విశదము చేయుచున్నవి. లండను నుండి టోకియోవరకునుగల దేశములన్నియును కలహబీజములతోను, సంగ్రామ ప్రయత్నములతోను, రాగద్వేష భావములతో నావరింపబడినవి. ఈనడుమను మినుకు మినుకు మనుచున్న జినివాశాంతి దేవాలయ కాంతులీ గాఢాంధకారమునందు గోచరముగాకున్నవి. ఈసందర్భములం దాత్మసంరక్షణ మునకైనను బ్రిటిషు ప్రభుత్వము హిందూస్థానముపట్ల నుదారస్వభావమును బూనుట శ్రేయస్కరము.

* * *

హిందూస్థానము

హిందూస్థాన మాత్మోపలబ్ధికి పొందుచున్న దుఃఖవేదన వర్ణనాతీతము. బాహ్యాభ్యంతర శత్రువుల ప్రతిఘటనము ప్రజాశక్తిని స్తంభింపజేసినది. దారుతుల్యమును జడమయమును నైన ప్రభుత్వవిధానమువలెను నాచార వ్యవహారవిధానమును ప్రజాప్రవృత్తిని స్తంభింప చేసినవి. మూడవ రౌండు టేబిలు సభ ముగిసినది. సప్రూ జయకరు గారులు, సర్ పాత్రో కేల్కారుగారులు, మహమ్మదీయప్రముఖులు స్వదేశములకు చేరి లాభనష్టములను గుణించుట కుపక్రమించిరి. సాంకి ప్రభువు, సర్ సామ్యుయల్ హోరుగారు సమగ్రహించిన ఆశాసాగరమునుండి అక్షయముగ నాశలను నిర్మించుట కుపక్రమించిరి. ఫెడరేషను, కేంద్ర ప్రభుత్వమునందు పూర్ణబాధ్యత, ఆర్థికాధికారము, సైన్యవ్యయ నియమాధికారము మొదలగు మహాఫలము లాశాసాగరము నుండి బయలుపడెడి మార్గము కనుపడదు. నిర్బంధవిధానముమాత్రము యథాప్రకారము సాగుచున్నది. నిరంకుశ శాసనములు, ఆర్థిక నిర్ధారణములు, అప్పుల ఏర్పాటులు, రాగల స్వరాజ్యసౌధమునకు సుస్థిరమైన పునాదులని ప్రభుత్వాధికారు లనవరతము ఘోషించుట పరిపాటియైనది. ఒకవైపున రాజ్యాంగవిధానమును రెండవవైపునను శాంతి న్యాయసంరక్షణమునకై నిర్బంధశాసన నిర్మాణములు సాగుచున్న వని రాజప్రతినిధివలెను హోరు బట్లరుగారులును ఘోషించుచున్నారు. రాజ్యాంగసంస్కరణము లెటులున్నను నిర్బంధవిధానానుభవము మాత్రము ప్రజలకు తప్పనిసరియై యున్నది.

విదేశాధికారులవలెను స్వదేశ పండితులును ఆత్మోపలబ్ధికి ప్రతికూలురుగ నున్నారు. హరిజనోద్ధరణమునకు సనాతనులు చూపుచున్న ప్రతిఘటనము దేశధర్మాభ్యుదయము పట్లను నిరాశను గలుగజేయుచున్నది. ఇట్టి మహోపద్రవస్థితియం దైనను ప్రజలు, పాలకులు స్వధర్మనిర్వహణావసరమును గ్రహించ

వలసియుందురు. మార్చిమాసారంభమునందు ప్రకటితము కానున్న తెల్లపుస్తక మైనను రాజ్యాంగనిర్మాణముల యథార్థస్థితిని తెలుపుట యుచితము. హరిజనుల నిర్బంధములను తొలగించుటకు శ్రీ రంగయ్యరుగారు ప్రవేశపెట్టిన శాసనములకు రాజప్రతినిధి సమ్మతించి విశాలదృష్టిని చూపుట ప్రశంసార్హముగ నున్నది. సంస్కారులును, సనాతనులును రాగద్వేషభావములను వదలి బిల్లుల యందలి గుణదోషములను చర్చించుటయును, నిర్ణయించుటయును ధర్మసంరక్షణమునకును దేశాభ్యుదయమునకును శుభసూచకము. ఇట్టి విషమస్థితియం దైనను ప్రభుత్వము నిరంకుశలక్ష్యమును వదలి విశ్వాసలక్ష్యమును బూనిన గాని దేశమునకును, ధర్మమునకును ప్రయోజనము కలుగజాలదు.

* * *

గాంధిమహాత్ముడు

గాంధిమహాత్ముడు శాంతిప్రియుడు, ధర్మాత్ముడు, సత్యసంధుడు, సిద్ధసంకల్పుడు, లోకబాంధవుడు, ప్రజానాయకుడు. దేశమునందు పలుకుబడి గల గాంధిమహాత్ముని యొక్కయు కాంగ్రెసునాయకుల యొక్కయును సహకారము లేక రాజ్యాంగనిర్మాణము వికాసవంత మైనను సంకుచిత మైనను ప్రయోగసాధ్యము కాదు. నాగరక ప్రపంచమంతయును శాంతిస్థాపనమునకు మహాత్ముని విమోచనమును కోరుచున్నది. కార్మికనాయకులు, మితవాద నాయకులు, శాంతికాములు గాంధిమహాత్ముని విమోచనము నాకాంక్షించుచున్నారు. దేశమును కలవరపరచుచున్న హరిజనోద్ధరణమునకును గాంధిమహాత్మునకు స్వేచ్ఛాస్వాతంత్ర్యము లత్యంతావశ్యకములు. భారతప్రభుత్వమును, బ్రిటీషుప్రభుత్వమును విశాలదృష్టిని గలిగి గాంధిమహాత్ముని విడుదల చేయుటయును, రాజ్యాంగ సంస్కరణముల విషయమై గాంధిమహాత్మునితో సంప్రతించుటయును సకలవిధముల కార్యసిద్ధికి సాధనము. మహోపద్రవావస్థయం దధికారాభిమానము, గౌరవప్రతిష్ఠలు నిరర్థకములు. ప్రపంచావృత మైన విషాదావస్థయం దాంధ్రులును యథాశక్తిని స్వధర్మారాధనమును జేయుట సంకల్పసిద్ధికి సాధనము.

* * *

ఆంధ్రుల కర్తవ్యము

దేశావృత మైన విషాదావస్థయం దాంధ్రులును యథాశక్తిని స్వధర్మారాధనమును జేయుచుండుట భావిభాగ్యోదయమునకు శుభచిహ్నము. ఆంధ్రప్రబోధకాంతులు రాజకీయ సాంఘిక కార్మిక వాఙ్మయాది రంగములందు పొడసూపుచున్నవి. స్వాతంత్ర్యప్రియ మైన ఆంధ్రహృదయము నిర్భయానందముగను నిర్బంధముల ననుభవించుచున్నది. సాంఘిక దురాచారబంధములను ఛేదించి పరిశుద్ధావరణ నిర్మాణముల నభిలషించుచున్నది. నవీనకావ్యనిర్మాణములమూలమునను ప్రజా

హృదయమునం దాత్మవికాసమును గలుగ జేయుచున్నది. ఆర్థికాభివృద్ధికి నవీనసంస్థల నిర్మాణములను జేయుచున్నది. ఆంధ్రోద్యమ రూపమైన ఆంధ్రప్రబోధము సర్వతోముఖముగ వ్యాప్తమై ఆంధ్రాభ్యుదయమునకును, భరతవర్షాభ్యుదయమునకును, ప్రపంచాభ్యుదయమునకును వినియోగపడవలసి యున్నది. హిందూస్థాన రాజ్యాంగనిర్మాణమునకు ఫెడరేషను మూలాధారమైనను, ఫెడరేషనుకు ప్రాణమైన భాషాప్రయుక్తరాష్ట్రవిభాగము ప్రభుత్వామోదమును బడయకున్నది. ఆంధ్రులు భాషాప్రయుక్త సిద్ధాంతాధారబద్ధమైన ఆంధ్రరాష్ట్రనిర్మాణమును చిరకాలమునుండి కోరుచున్నను, ఆకోరిక ప్రభుత్వామోదమును బడయకున్నది. మూడవ రౌండుటేబిలు సమావేశసందర్భమునందు శ్రీయుత జోగయ్యపంతులుగా రాంధ్రుల యభీష్టము నధికారులకు సువ్యక్తముచేసి యాంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయిరి.

సంకల్పశుద్ధిలేని నిర్మాణములు సకల సందర్భములందును ప్రయోగయోగ్యములు గాక నిరుపయోగము లగుచున్నవి. బ్రిటీషుప్రభుత్వాధికారులు త్రికరణశుద్ధిగ రాజ్యాంగనిర్మాణమునకు బూనుకొనవలసిన యవసరమును గ్రహింపవలసియుందురు. ప్రభుత్వలక్ష్యమును, ప్రభుత్వమును, సంకల్పమును మార్చవలసిన భారము, మార్చగలశక్తి ప్రజలమీద గలదు. వర్తమాన సందిగ్ధావస్థయం దాంధ్రలోకము స్వధర్మనిర్వహణమును జేయుచు ఆత్మోపలబ్ధిని బడయుటకు భగవంతు డనుగ్రహించుగాత!

---

Printed and Published by C. Seshagiri Rao, B. A. at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras
Editor: G. Subbaramayya.